

ప్రతిబింబాలు

ఫోటో: ఎ. వి. ఎస్. నారాయణ్ (గూడూరు)



PARKE-DAVIS
NEKO
GERMICIDAL SOAP
NEKO
THE ORIGINAL
Germicidal Soap
PARKE-DAVIS

# ఉత్తరాలు

## కవిసార్వభౌముడు

"కవిసార్వభౌముడు" కథ చాల రసవత్తరముగా, ఇంపుగా ఉన్నది. అందులో ఒక సందేహము. చెక్కపలకపై రాతి బలపముతో వ్రాయుచున్నారని వేసినారు. కాని యిప్పుడు చెక్క పలకపై రాతి బలపముతో వ్రాయరు. కారణమేమి ?

సి. సత్యనారాయణశాస్త్రి (పుంగనూరు)

ఈ కథ 'అప్పుడు' జరిగినట్లే కదా !

* * *

కవిసమ్రాట్ నోరి నరసింహశాస్త్రిగారు రచియించిన 'కవిసార్వభౌముడు' శైలి మృదు మధురముగా నున్నది. నేటి కథానికలతో విసుగుజెందుచున్న మాకు యిట్టి చరిత్రాత్మక నవలలే కావలసి ఉన్నవి.

విశ్వనాథపల్లి బేబీ సరోజ (పామర్రు)

* * *

'కవిసార్వభౌముడు' సీరియల్‌లో గురజాలసీమలో చూచిన కరణము పరాక్రమము ఈ క్రింది విధముగా చెప్పబడినది.

'..... ధాన్యము లింటనుండ శ్రీరామ కటాక్ష వీక్షణ పరంపరచే గడతేరే గాకయా ...... '

కాని యీ క్రింది విధముగా చెప్పబడినట్లు నేను యిదివరకు వినియుంటిని.

'..... ధాన్యము లింటనుండి శ్రీరామ కటాక్ష వీక్షణ పరంపరలే దినమేగుచుండ యీ .... '

దొంతరాజు సుబ్బారావు (హైద్రాబాదు)

* * *

## కథలు

25—10—61 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురింపబడిన కథలు, కార్టూనులు చాల బాగున్నాయి అందులో ముఖ్యంగా రంగధామ్ వ్రాసిన "బుచ్చమ్మ రహస్యం" నన్నెంతో ఆకర్షించింది. అంటే అంత బాగున్నదన్నమాట.

జి డి. హెచ్. ప్రహ్లాద్ (కర్నూలు)

* * *

శ్రీ ఆర్ ఎం. చిదంబరంగారి కథ "సత్యాసత్యాల మధ్య" చాలా బాగుంది. నిజ జీవిత "సత్య, అసత్యాలను" కళ్ళకు కట్టినట్లుగా, అమోఘంగా వివరించా రాయన. దయచేసి ఆయన ఫోటోను కూడ ప్రచురించమని ప్రార్థిస్తున్నాను.

కె. హనుమంతరావు (బెంగుళూరు)

* * * *

ఈ కథ చదువుతుంటే కథగా తోచలేదు. నిజ జీవితానికి ప్రతిబింబం అనిపించింది.

సరళ (విజయవాడ)

* * *

"దారి తప్పి నా—మాట తప్పి నా" అనే కథానిక చాలా బాగుగా రచించినారు. ఇలాటి కథ చదవడం యిదే మొదలు. రచయితకు నా ధన్యవాదాలు.

తమ్మన రాఘవరావు (పెంటపాడు)

* * *

"బాలసాహితి" క్రింద వ్రాసిన "చిన్నారి చెల్లాయి" అనే గేయము చదివాను. చాలా బాగుంది.

ఎం. శ్రీనివాసరెడ్డి (తిరుపతి)

* * * *

మీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగుంటోంది నమ్మండి ! మరీ ఆ బాగుండటం ఎక్కువైపోతే అజీర్ణం అవుతుందేమో ! సింగరాజు లింగమూర్తిగారి 'ఆదర్శాలు—అంతర్యాలు' కథ చెప్పలేనంత బాగుంది. నిజంగా రాజారావు, పోలయ్యలాంటి మనుషులు ఉంటారా అని అనిపిస్తుంది. ఇక పోతే మీరు ప్రతి కథ మాంచి రసవట్టులో ఉన్నప్పుడు 53 వ పేజీ చూడండి, 38 వ పేజీ చూడండి అని వ్రాయటంతో మాకు భలే కోపం వస్తోంది. కోపం వస్తే ఏం చేస్తాం చెప్పండి ! ఉస్సురనుకొంటూ ఆ పేజీ తిప్పి మిగతా కథ చదువుతాము దయచేసి యికనుంచి పూర్తి కథను వరుసగా పేజీలలో వేస్తారని తలుస్తాము. ఈ వారం కథలన్నీ చాలా బాగున్నాయి. రచయితలకు మా అభివందనములు.

ఆంధ్రపత్రిక అభిమాన పరితలు (కోవెలకుంట్ల)

* * *

## బేరాలు-సారాలు

వేదవతీదేవిగారు వ్రాసిన "బేరాలు—సారాలు" బాగున్నది. అయితే న్యూసు పేపర్లు అమ్మడములో మాత్రము వీశ ముప్పావలఉండును కాని శేరు ముప్పావలఉండదని వేదవతిగారికి తెలియదు కాబోలు. ఎన్నడు పాత పేపర్ల అమ్మకములో అనుభవము ఉన్నట్లు లేదు—పాపము. వారికి నా ధన్యవాదములు.

ఎస్. శేఖర్ (కడప)

* * *

బేరాలూ—సారాలూ వ్యాసం చాలా బాగున్నది. పాపం వేదవతిగారి బేరములన్నీ దండుగ బేరాలేనని చాల విచారింపతగ్గ విషయం. ముఖ్యంగా పేపర్ను 12 అణాలకు కొంటానని వాడు చెప్పితే అర్ధ రూపాయికి తీసుకోవా అనటం చాల గమనించదగ్గ విషయం ఇలాంటి పొరపాట్లు చాల జరుగుతాయి కాబట్టి చాల జాగ్రత్తగా, పొదుపుగా బేరములు చేస్తారని వీరి వ్యాసం చూసి నేను ఆశిస్తాను. రచయిత్రికి నా ధన్యవాదాలు.

వాసిరెడ్డి రాజరాజేశ్వరిదేవి (చేబ్రోలు)

## సరసాలు - విరసాలు

రచయిత్రి దంపతులను గూర్చే వ్రాశారు. సరసాలు విరసాలు సహజముగా, పిన్న వయస్సువాళ్ళలోనే ఎక్కువ. కొందరు వరసకు సరసా లాడుతారు. అనుకోకుండా విరసాలు ఆడడం సంభవించుచుండును. నా మట్టుకు యీ సరసాలకు—విరసాలకు ఒక హద్దే కాదు, ఒక నియమము అంటూ ఉండాలి. సమయం, సందర్భము గూడా అవసరం.

సి. వి. శారద (పాకాల)

వవని నిర్మల ప్రభావతిగారు వ్రాసిన కొన్ని కొన్ని సంఘటనలు మనస్సుని ఆకర్షించేలా వ్రాశారు. సరసాలు ఈ ఆధునిక యుగంలో మరీ మితిమీరి పోతున్నవంటే చాల ఆలోచించదగ్గ విషయం. వారి ముందు వరుసలో కూర్చున్న దంపతులు సిగ్గూ, బిడియం లేకుండా అలా ప్రవర్తించారంటే చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఇంకా ఇలాటివారు ఇంత మొరటుగా సరసా లాటడం చాల అవమానకరమైన సంఘటన. ఇది, అసహ్యకరమైన విషయమని భావించరు పాపం ఆ అమాయకపు దంపతులు. ఇలాటి వ్యాసాన్ని చదివన్నా వారు ఇక జాగ్రత్తగా మెలిగెదరు ఇలా కళ్ళు మూసుకుని ప్రవర్తించే వారికి కళ్ళు తెరిపించి బుద్ధి చెప్పించేటట్లు ఇలాటి వ్యాసం అందించిన వవని నిర్మలా ప్రభావతి గారికి నా ధన్యవాదాలు.

వాసిరెడ్డి రాజరాజేశ్వరిదేవి (చేబ్రోలు)

* * *

"సరసాలు — విరసాలూ" అన్న వ్యాసం ప్రత్యక్ష సత్యములను విశదీకరించినది. ఏదైనా ఒక హద్దులో నున్న రసోచితముగా నుండును. కాని దేశకాల పాత్రలను మరచి ప్రవర్తించుట హాస్యాస్పదమని యీమె రచించినందుకు నా ధన్యవాదములు.

చేరాల మృణాలిని (గుంటూరు)

* * *

సమాజంలో కొందరు భార్యాభర్తల సరసాలు—విరసాలు అలాగే ఉంటాయి. ఈ ఆధునిక వాతావరణంలో పబ్లిక్‌గా తమ సరసాన్ని పదిమంది చూసేలా ప్రదర్శిస్తే తమ యిద్దరి మధ్యగల అనురాగానుబంధం యెదుటివారికి బాగా అర్థమవుతుందని ఆ భార్యాభర్తల భావన. కాని అందువలన ఎదుటివారు వీరిని గురించి బాహాటంగా అనలేక (స్వతంత్రదేశం కదండీ !) మనస్సులోనే యెంత "సిగ్గు" లేనివాళ్ళు అనుకొంటారు.

భార్యాభర్తల మధ్య రేగే విరసాలు అలాగే ఉంటాయి. ఆ విరసాల ప్రదర్శన వలన ఎదుటివారికి "తన భార్య తన చెప్పు చేతల్లో ఉంది" అని తెలియచేయడం భర్త ఆశయం. తదాశయమే కలిగిఉంటుంది భార్యామణి కూడ. ఈ దంపతుల విరసాల వలన చూచేవారి దృష్టిలో వీరెంత "చులకన"వుతారో మాత్రం అర్థం చేసుకోరు.

శ్రీమతి వేలూరు సావిత్రమ్మ (నెల్లూరు)

* * *

వనితాలోకం ద్వారా వనితలకు నిత్య జీవితంలో ఉపయోగపడు విషయములను అనేకములను తెలిసికొని సంతసించుచున్నాము. 'గుంట గలగర' ఆకుతో తలనూనెను తయారుచేయు విధమును సోదరీమణు లెవరైన వనితాలోకము ద్వారా తెలియజేసెదరని ఆశించుచున్నాను. తెలిసిన వనితలు తప్పక తెలియజేసెదరని భావించి వివరముల కొరకై ఎదురుచూచుచున్నాను.

ఎ. లక్ష్మి (ఏలూరు)

శుక్రవారం : 10-11-61
ప్లవసం॥కార్తికమాసం శు॥విదియ
సంపుటము : 54 సంచిక : 10

స్థాపితము:
1908

*

ముఖ్యసంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★

## లోకంపోకడ




"రష్యా శాస్త్రజ్ఞులు పొరపాటున అనుకున్న దానికన్నా పెద్దబాంబు పరీక్షించారు."

పొరపాటున అనుకొనిచోట పేలడం జరగదు కదా!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

దీపావళి ముఖచిత్రం : దేవిక

(10వ పేజీ చూడండి)



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి అక్టోబరు 31 వ తేదీనాటికి రు. 69,660=97 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము. విరాళాలు 'ఆంధ్రపత్రిక'కే గాని, ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపరాదని మనవి చేస్తున్నాము.

# దీపావళి వేడుకలు


ఆంధ్రప్రదేశ్‌లో
బొంబాయిలో
భారతదేశంలో
ఢిల్లీలో
కమ్యూనిస్టు
రష్యా అణ్వాస్త్ర పరీక్ష
అమెరికా అణ్వాస్త్ర పరీక్ష
ప్రపంచ మంతటా
జాతీయ సమైక్యత



భారత రాజధానిలో అంతర్జాతీయ చలన చిత్ర ప్రదర్శనలకు ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ ఈ మధ్య ప్రారంభోత్సవం జరిపారు.

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# రామలీలా పేరిట ధనం దుబారా!: పోటీలు పడేవారికి గొడుగులు పట్టేవారు

ఈ వారం ఢిల్లీలో రామలీలా ఉత్సవాలు బ్రహ్మాండంగా జరిగాయి. ప్రధానమంత్రి వీటిలో పాల్గొంటారనే విషయాన్ని ప్రాంతీయ పత్రికలలో ముందుగానే ప్రచారం చేశారు. వారు రానే వచ్చారు. రామలక్ష్మణులకు మాలలు వేస్తూ ఫోటో కూడా తీయించుకున్నారు. మర్నాడు పత్రికలు, "రాష్ట్రపతి ఉత్సవాలలో పాల్గొనకపోవడం" కొంత విచారం కలిగించినట్లు వ్రాశాయి. అంటే, ప్రధానమంత్రి ద్వారా, శ్రీరాముడే రాష్ట్రపతి రాకపోవడం గురించి సందేశం పంపినట్లు ఊహించవచ్చునా ?

'ప్లానింగ్ కమిషన్' ఉపాధ్యక్షులూ, కేంద్ర ప్రభుత్వంలో శ్రామికశాఖా మంత్రీ, అయిన శ్రీ గుల్జారీలాల్ నందా ఈమధ్య ఒక ఉపన్యాసంలో "మానసికమైన జమీందారీ తత్వం" వదులుకోవాలన్నారు, మూఢ నమ్మకాలపైనా, 'సాంప్రదాయ వాదం' పైనా ప్రజాస్వామ్యాన్ని శాశ్వతంగా నిలిచేట్లు నిర్మించడం కష్టమన్నారు. అక్టోబరు ప్రారంభంలో 'జాతీ ఐకమత్య సమావేశం' మొదటిసారిగా జరిగింది. ఈ సమావేశంలో మాట్లాడుతూ, ప్రధాన మంత్రి కుల, మత ద్వేషాలవల్లా, భాషా ప్రాంతీయ భావాలవల్ల కలిగే పరిణామాలను వివరించారు.

ఈ వివరణను పరిశీలిద్దాం. శ్రీరాముడు బ్రాహ్మణుడు కాదుకదా! అయినా రామలీలా ఉత్సవాలలో నాటక పాత్రధారులు బ్రాహ్మణ కుర్రవాళ్ళే. కుల తత్వం ఎంత సంకుచితమైనదో విశదీకరించిన ప్రధాన మంత్రి—ఆగస్టు 15, 1947 నుంచి నిర్విరామంగా ఈ పని కట్టుకున్నారు—శ్రీరాముని పాత్ర ధరిస్తున్న బ్రాహ్మణ బాలురను ఎందుచేత మాలలతో గౌరవించారు ? శ్రీరాముని పాత్ర బ్రాహ్మణేతరులు వేసినట్లయితేనే తాము ఉత్సవాలలో పాల్గొంటానని స్పష్టంగా చెప్తే, వర్ణాశ్రమ సిద్ధాంతానికి పెద్ద దెబ్బగా ఉండేదికదా!

అంతేకాదు, వృథా వ్యయం కూడదని కాంగ్రెసు వారు ప్రతి ఒక్కరికీ చెప్తూనే ఉన్నారు. కాని రాజధానిలో రామలీలా ఉత్సవాల క్రింద ఏటా అయిదు లక్షల రూపాయలైనా ఖర్చు చేస్తారు. స్వాతంత్ర్యం రాకపూర్వం రామలీలా ఉత్సవాలు నడిపే కమిటీలవారు గోమాంస భక్షకుడైన 'చీఫ్ కమీషనర్' హాజరయితే మురిసిపోయేవారు. ఇప్పుడు రాష్ట్రపతి తప్ప పనికిరారు.

ఉత్సవాలకి 'ముఖ్య(మైన) అతిథి' సాధారణంగా ఒక 'కాబినెట్' మంత్రిని 'ఎన్ను'కుంటారు. వీరికి ముఖ్య ప్రదర్శనలన్నీ లాంఛనప్రాయంగా చూపుతారు. అసలు మంత్రులూ, ప్రధాన మంత్రీ కూడా వాటికి ఎందుకు వస్తారో అర్థంకాదు.

ఎన్నికలు దగ్గరకు వస్తున్నాయి. 'మైనారిటీ' వర్గాలవారైన ముస్లింలూ, క్రిస్టియన్లూ, సిక్కులూ, అందరూ ముఖ్యమైనవారే అయినా ఎన్నికల ఫలితాలు హిందువుల చేతులలోనే ఉన్నాయని ఒప్పుకోక తప్పదు. అందుకనే మతాలకు అతీతులైన ప్రధానమంత్రి శ్రీరాముని పాత్ర వేస్తున్న బ్రాహ్మణ బాలుడికి మాల వేస్తూ ఫోటో తీయించుకుంటున్నారు. అశోకా హోటలులో గోమాంసం వడ్డించరాదని ప్రధానమంత్రి ఉత్తరువు జారీచేశారు. ఉత్తరప్రదేశ్, పంజాబ్, రాజస్థాన్‌లలో గోవధ నిషేధించారు. అటువంటప్పుడు అశోక హోటలులో గోమాంసం 'వడ్డించడ' మనేది ఎలా సాధ్యమవుతుంది ? నిజానికి 'గోమాంసం' క్రింద అమ్ముతున్నది బర్రె, దున్నపోతుల మాంసం.

(78-వ పేజీ చూడండి)

# దీపావళి సంచిక పోటీలు

(క)థల పోటీలో బహుమతులు పొందిన ముగ్గురూ హైద్రాబాదు గారే! ఫోటో ప్రచురణకు శ్రీ శ్రీకంఠ మాత్రం ఒప్పుకున్నారు. శ్రీమతి సుబ్బలక్ష్మిగారి 'వాసుదేవరావు' కథలో సున్నితమైన భావప్రకటన పాఠకులే గమ



రెండవ బహుమతి కథా
రచయిత : శ్రీ శ్రీకంఠ.

నిస్తారు. శ్రీ పాకాటి పాండురంగారావుగారి పేరు 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' పాఠకులకు కొత్తది కాదు.

ఈ పోటీ జయప్రదం చేసిన వారందరకూ (బహుమతులు గెలిచిన వారితో సహా!), మా కృతజ్ఞత తెలుపుతున్నాము.

* * *

వనితాలోకం పోటీకివచ్చిన వ్యాసాలలో అసలు, 'వివాహం జూదమా?' అనే విషయం చర్చించిన వారు తక్కువమందేనని చెప్పాలి. రచయిత్రులలో చాలా మంది వివాహం ఏవిధంగా సుఖవంతమవుతుందనే విషయం చర్చించారు! ఏది ఎట్లాఉన్నా ఈ పోటీలో పాల్గొని మాతో సహకరించిన వారందరనీ మా కృతజ్ఞతాపూర్వక శుభాభినందనలు స్వీకరింప గోరుతున్నాము!

* * *

ఈ సంచికతో 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' ప్రతి శుక్రవారం వెలువడుతుంది. ఏభైమూడు సంవత్సరాల పైన జరిగిన మార్పు కనుక, మాకు అతి ముఖ్యంగా కనిపిస్తున్నది! పాఠకులు, రచయితలు ఎప్పటివలె మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

* * *

మా అభిమానులందరకూ ఉజ్జ్వలమైన దీపావళి శుభాకాంక్షలు!

ఇది దీపావళి ప్రత్యేక సంచిక కనుక కొన్ని మామూలు శీర్షికలు ప్రచురించే అవకాశం లేకపోయింది.

★

## ముఖచిత్రకథ

కుటుంబరావుగారి కొడుకు, చిన్నకూతురు తాము కాల్చబోయే టపాకాయలు లెక్క చూసుకుంటున్నారు. పెద్ద కూతురు పద్మ ప్రమిదలలో నూనె పోసి వెలిగిస్తోంది. 'టెలిగ్రామ్' చేతబట్టి భార్యతో ఏదో చెప్పబోతున్నారు కుటుంబరావుగారు. ఆయన ముఖంలో చిందులాడే ఆనందమే చెప్తోంది, అంతవరకూ పండగకు వచ్చే తీరిక ఉండదేమోనన్న అల్లుడు వచ్చేస్తున్నాడని! ఈ సంగతి చిన్నపిల్లలు కూడా కనిపెట్టేశారు; పద్మ తమ్ముడు, "చూడు! నేన్నదే కరెక్ట్!" అన్నట్లు ఏదో చెల్లెలితో చెప్తున్నాడు. ఇక పద్మ సంగతి వేరే చెప్పాలా...

* * *

ఈ సంచిక మధ్య పేజీలలో శ్రీ బాపు ఒక చిత్రమైన 'ఆట' నిర్మించారు. ఈ ఆటకు సంబంధించిన 'నియమాలు' 39-వ పేజీలో చదవండి. ఎన్నికలు దగ్గరకు వస్తున్నాయి కాబట్టి మరికొంత ఉత్సాహంతో ఆడ్తారేమో కాని, నిజం ఎన్నికలకుదిగేముందు, ముందు వెనుకలు మాత్రం ఆలోచించుకోండి!

★

# దీపావళి

ఆమంచర్ల

గోపాలరావు

దీపావళి పండుగను అనాదిగా మనదేశంలో చేసికొంటున్నారు. ఒకవిధంగా ఈపండుగ అన్ని పండుగలను మించింది. భారతదేశంలోని అన్ని మతాలవారూ, జాతులవారూ ఏదోవిధంగా ఈ పండుగలో పాల్గొంటారు. కాని తక్కిన అనేక పండుగలు ప్రత్యేకంగా, ఒకజాతివారికో, లేక ఒక మతానికి చెందినవార్లకో చెందిఉంటాయి. ఈ పండుగనాడు మాత్రం దేశంలో జాతి, మత విభేదం ఏమి కనుపించదు. ఉత్తర భారతంలో అన్ని ఇండ్లముందర దీపాలు వెలుగుతాయి. దక్షిణభారతంలో ప్రతీ పసి పిల్లాడు, పిల్ల అన్నీ ఇన్నీ టపాకాయలు ప్రేలుస్తారు.

మనదేశ పండుగలలో మూడు ముఖ్యమయినవని మనం అనుకోవచ్చు. అవి సంక్రాంతి, దసరా, దీపావళి. సంక్రాంతి కర్షకులకు ప్రధానమయిన పండుగ. కర్షక ప్రాముఖ్యంగల మన ఆంధ్రదేశంలో ఆ పండుగ శోభ వర్ణనాతీతం. దసరా క్షత్రియుల కతిముఖ్యమయినది. ఆయుధపూజలు మొదలయినవాటితో ఆ పండుగ వికాసమందుకుంటుంది. ఉత్తరదేశంలో రావణుని నిర్జించిన రాముని లీలలు దసరాలో ప్రాముఖ్యం వహిస్తాయి. శాక్తేయులు మహిషాసురమర్దని గాథలు తలుచుకొని దుర్గపూజలు చేస్తారు. అనేక మంది శమీవృక్ష యాత్రలుచేసివస్తారు. పెద్ద రాజాలున్న మైసూరు, తిరువాన్కూరు మొదలయిన పట్టణాలలో దసరా శోభ పూర్తిగా గోచరిస్తుంది. మూడవదయిన దీపావళిపండుగ వ్యాపారముచేయువాళ్లకు అతి ముఖ్యమయినది. ఈ పండుగకు కూడ అనేక అర్థములు కలవు. ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థాన్ని ఊహించి, ఒక్కొక్కరు, ఒక్కొక్కరకంగా ఈ పండుగ చేసికొంటారు.

ఉత్తర భారతంలో వ్యాపారస్తులకు ఈ పండుగనాడు నూతన సంవత్సర ప్రారంభం. పాత లెక్కల పుస్తకాలన్నీ మూసివేసి, ఆనాడు క్రొత్త లెక్కల పుస్తకాలు ప్రారంభిస్తారు. ప్రతివాడు ఇంటింటికి వెళ్లి, "సాల్ ము బారక్" చెప్పుకుంటాడు. "సాల్ ము బారక్" అని అనగా, నవీన సంవత్సరం జయప్రదమవుగాక యని అర్థము.

దీనికిగూడ ఒక ఐతిహ్యం ఉన్నది. ఇతిహాసం ఒకటయినా లేని పండుగలుండవుకదా. అతి శుభప్రద దినమని, ఈనాడే విక్రమాదిత్యుడు పట్టాభిషేకము చేసికొన్నాడుట. ఆయన పట్టాభిషేకము కూడ మరొక ప్రాచీన ఐతిహ్యము ననుసరించే అని మనము చెప్పవచ్చును. ఏలనన, రావణుని జయించి వచ్చిన శ్రీరాముని పట్టాభిషేకదినము కూడా ఆనాడేనట. ఈ ఐతిహ్యముల నిజానిజములు పండితులు విచారించవలసినదే. ఏది ఎట్లయినను దీపావళిని, విక్రమ శక సంవత్సరమునకు ప్రథమ

(77-వ పేజీ చూడండి)

# వాసు దేవ రావు

జి. సుబ్బలక్ష్మి

మొదటి
బహుమతి కథ



రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది.

మేము కూర్చున్న పెట్టెలోకి ఎవరో ఒక అబ్బాయి ప్రవేశించాడు. మేమున్న పెట్టెలో బోలెడు స్థలం ఉంది. అందులో మా కుటుంబం తప్ప వే రెవ్వరూ లేరు

అంతలోనే మా అమ్మాయి ఉష నా దగ్గరికి వచ్చి, "చూడవే అమ్మా! ఆత నెవరో వచ్చి మన పెట్టెలోకి ఎక్కేశాడు" అని ఫిర్యాదు చేసింది.

నేను ఆ అబ్బాయి వంక ఒకసారి చూశాను. ఆ అబ్బాయి భయం భయంగా మాకు దూరంగా

(71–వ పేజీ చూడండి)



# మొదటి బహుమతి వ్యాసం:

## శ్రీమతి ఎస్. వెంకటరత్నం

"వివాహము జూదమా"—అనేది చర్చించే ముందు, జూదమంటే ఏమిటి అన్నది ఆలోచించాలి. స్థూలంగా చెప్పాలంటే తక్కువ ఖర్చుతో, లేక శ్రమ (శారీరకంగాగాని, మానసికంగాగాని) లేకుండా, ఎక్కువ డబ్బు సంపాదించదలచుకోడం జూదం. అదే మరోవిధంగా చెప్పాలంటే మననుండి ఎట్టి శ్రమగాని, కష్టముగాని లేకుండా, అధికమయిన సుఖాన్ని పొందడానికి ఆశించడం జూదం అవుతుంది. అట్టి సుఖం పొందగలగడం పొందలేకపోడం అదృష్టం మీద ఆధారపడిఉంటుంది. వివాహంలోగూడా ఈవిధంగా ఎట్టి శ్రమగాని, బాధ్యతగాని లేకుండా ఆనందం అనుభవిద్దామనుకుంటే అది జూదమే అవుతుంది. అటువంటి వివాహాలలో ఎక్కడో ఒకటో, అరో బాగుగా ఉండవచ్చుగాని చాలామట్టుకు దుఃఖ భాజకంగా తయార్లు అవుతాయి.

నిత్యజీవితంలోలాగే వివాహ జీవితంలో గూడా సౌఖ్యమూ, ఆనందమూ కావాలంటే, దానికొరకు కొంత శ్రమపడాలి బాధ్యతతో ప్రవర్తించాలి. పరిస్థితులను అర్థం చేసుకొని, వాటికి అనుగుణంగా నడచుకోవాలి వివాహమన్నది ఇద్దరు వ్యక్తుల సమిష్టి జీవనం కాబట్టి, ఒకరి మంచి చెడ్డలు, ఆర్థిక పరిస్థితులు, ఇంకొకరు అర్థం చేసుకోవాలి. నిజంగా డబ్బుకి ఇబ్బందిగా ఉన్నప్పుడు, భర్త మంచి చీరెలు కొనలేదని భార్య బాధపడితే దానివల్ల నష్టమేగాని, లాభము ఉండదు. ఆవిధంగానే అవకాశంఉండి కూడా, భార్య ముచ్చట్లను గుర్తించకుండా, భర్త తన సుఖాలు చూసుకోడం కూడా మనస్పర్థలకు, కలతలకు దారి తీస్తుంది.

భార్యాభర్తలు అనురాగంగా ఉన్న ఇంట్లో, ఆర్థికంగా చాలా ఇబ్బందులు ఉన్నా, వాళ్ళ జీవితం ఆనందంగానే గడిచిపోతుంది. మంచి డబ్బున్న కుటుంబాలలో కూడా భార్యాభర్తలలో అనురాగం, నశించి, స్వార్థం పెరిగినప్పుడు, ప్రతి చిన్న విషయానికి దెబ్బలాటలు ప్రారంభమై మనస్సుకి శాంతి లేకుండాపోతుంది. ఆవిధంగా భార్యాభర్తల మధ్యన అనురాగం కలగాలంటే, అది వృద్ధిపొందాలంటే కొంత స్వార్థ త్యాగం అవసరం. నేనువేరు, 'నా భర్త (లేక భార్య)వేరు' అనే భావం నశించిపోతే ఒకరు ఇంకొకరిని కష్టపెట్టేదీలేదు, ఒకరివలన ఇంకొకరు కష్టపడేదీ లేదు. అటువంటి జీవితాలు ఆనందంగానే గడిచిపోతాయి. ఆర్థికమయిన ఇబ్బందులు ఏమయినాఉన్నా, వాటికి వారు అలవాటు పడేఉంటారు గాబట్టి, వారి ఆనందానికి మనం ఊహించేటంతటి లోటు రాదు

"అయితే ఈ అనురాగమనేది, ఒక్కరోజుతో వచ్చేదికాదు. అది క్రమేణా వృద్ధి అవుతుంది. దానికి మన ప్రయత్నం కూడా ఎంతో అవసరం. మొదటి చూపులోనే ప్రేమించుకోడం అనేది వట్టి భ్రమ. ప్రథమ వీక్షణంలో కలిగేది ఒక మధురమయిన అనుభూతి అవుతుందిగాని, దానిని అనురాగం అనలేం. అనురాగం అనేది ఏళ్ళు గడిచినకొద్దీ వృద్ధిఅవుతూ వుంటుంది. అది వయస్సు, అందం అన్నింటినీ అతిక్రమించి, మనస్సును మనస్సుతో ఏకం చేస్తుంది. దీనికి సాహచర్యం, స్వార్థత్యాగం, ప్రయత్నం, ముఖ్యం. ఇది వివాహం అయినతర్వాతనే వీలు పడుతుంది. ఎక్కడో మరీ దగ్గర సంబంధాలలో తప్ప.

స్వప్రయత్నంమీద, స్వశక్తిమీద ఆధారపడే ఈ సౌఖ్యం, ఈ ఆనందం జూదం ఎలాగ అవుతుంది? అయితే కొందరంటారు—"వైవాహిక జీవితం ఇద్దరి మీద ఆధారపడి వుంటుందికదా! ఒకరి మనస్తత్వం ఇంకొకరికి కుదరకపోతే సుఖం ఏ విధంగాఉంటుంది? భార్యా, భర్తలలో ఒకరు జబ్బుపడిపోతే సుఖం ఎక్కడఉంటుంది?" అని. నిజమే—ఈవిధంగా ఆలోచించదలచుకుంటే జీవితమే ఒక జూదం. ఒక్క తల్లి కన్నబిడ్డలలో ఆస్తి విషయంలో ఎన్నో మనస్పర్థలు, కలహాలు చూస్తున్నాం. ఒక విధి వారిని అన్నదమ్ములుగా కూర్చింది. తలుచుకుంటే వారు అన్యోన్యంగా ఉండి, స్వార్థంలేకుండా ఎంతో ఆనందంగా ఉండవచ్చు. కాని మరొకవిధి వారిలో స్వార్థం పెంచి, మనస్పర్థలకి, దెబ్బలాటలకి త్రోవ చూపింది. ఈ 'విధి' అనేది జీవితంలో అన్ని రంగాలలోను ఎదురవుతుంది. ఎన్నో ఆశలు పెట్టుకున్న కన్నకొడుకే మంచానపడితే! సాయంత్రానికి ఇల్లు చేర్చవలసిన బస్సు త్రోవలో పల్టీకొట్టి ప్రాణహాని కలిగిస్తే? ఇటువంటి విధికృతాలు జీవితంలో అన్ని రంగాలలోనూ కనుపిస్తాయి. అలాగని బిడ్డలను కనడం జూదం అవుతుందా? బస్సుని ఎక్కడం జూదం అవుతుందా! ఆవిధంగానే వివాహ విషయంలో కూడా! కొందరి విషయంలో ఏమీ కారణం లేకుండానే వివాహం బెడిసిపోతుంది కాని అట్టి సంఘటనలు చాలా అరుదు. మాటికి ఎన్ని వివాహాలు ఆవిధంగా బెడిసిపోతున్నాయి?

తమ ఆర్థిక పరిస్థితులను గుర్తించుకొని, ఎదుటివారి మనస్సుని తెలుసుకొని, స్వార్థాన్నివిడిచి, మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తే వివాహ జీవితం ఆనందదాయకమే అవుతుంది. పై చెప్పిన వాటి జోలికి పోకుండా, వైవాహిక జీవితంలో ఆనందం అనుభవిద్దామనుకున్న వారికి అది జూదమే అవుతుంది. ★

# దిబ్బు దిబ్బు దీపావళి!

## వి. వి. ఆర్.

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి!
అంధకార తిమిరావళి
పారద్రోలు దీపావళి

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి!

ముల్లోకా లుత్సహింప
మును నరకాసురు వధించి
విజయమంది సత్రాజితి
వెలిగించిన దీపావళి

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి!

పసిబాలుర, పెద్దవారు
రకరకముల టపాకీలు
హెచ్చుగ కాల్చే పండుగ
ముచ్చటైన దీపావళి!

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి!

మంచి మంచి చిచ్చుబుడ్లు
మహిత మైన తూటాలూ
పుడమివిరియు చిచ్చుబుడ్లు
పూవులపొట్లాల్ కాల్చే

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి

క్రొత్తల్లుళ్ళకు విందులు
క్రొత్తక్రొత్తవగు వలువలు
అచ్చట ముచ్చటలతోడ
ఆనందించే పండుగ

దీపావళి! దీపావళి!
దిబ్బు దిబ్బు దీపావళి!

దీపావళి! దీపావళి!
దివ్య నవ్య దీపావళి
చీకటియను రాకాసిని
చీల్చివేయు దీపావళి!!



# సంగీతప్రియుడు శ్రీ సంజీవయ్య

ఆరాత్రి ముఖ్యమంత్రి మకాం తిరుపతిలో ఏడుకొండలవాని దివ్యసన్నిధిని ఈ ఇద్దరు మిత్రులు ముఖ్యమంత్రివద్ద సెలవు తీసుకొని నిద్రపోవడానికిగాను తమ 'కాటేజీ''కి వెళ్ళేప్పటికి రాత్రి పదకొండు అయింది తెల్లవారి అయిదు గంటలకే ముఖ్యమంత్రి గదినుంచి ఎలుపు వచ్చింది ఏడున్నరకు స్వామి దర్శనంకోసం వెళ్ళాలి, సిద్ధంగా వుండమని స్వామిదర్శనం అందులోను ముఖ్యమంత్రి ఎలుపు ఇంక ఆలస్యం దేనికని అరగంటలోనే సిద్ధమైనాము

ఆలయం సింహద్వారందాటి మలుపుతిరిగి స్వామి వారి ఆలయానికి ఎదురుగా నిలబడే సమయానికి ముఖ్యమంత్రి చటుక్కున తలమీద టోపీతీసి భుజం మీద వేసుకున్నారు "స్వామి ముందర టోపీ దేనికి" అని కూడా అన్నారు తొలి ద్వారంవద్ద శ్రీ అన్నారావుగారు ఇచ్చిన గంధం తలకు పూసుకున్నారు భక్తుడైన శ్రీ సంజీవయ్య ప్రదక్షిణంచేసి, హుండీలో కానుకవేసి, ముకుళిత హస్తాలతో మూల విరాట్టు ముందుకు వెళ్ళి, శిరస్సు వంచారు హారతి కళ్ళకు అద్దుకున్నారు అక్కడవున్న అయిదు నిముషాలు చూపు స్వామిమీదనుంచి మళ్ళించలేదు ఆ సమయాన ఆయన మనస్సులో ఏమికోర్కె వుందో, ఆ ఏడు కొండలవానికి, ఆయనకు మధ్య ఎలాంటి అనుబంధం ఏర్పడిందో ఆ వెంకటేశ్వరునికి తెలియాలి, ఈ సంజీవయ్యకు తెలియాలి

* * *

రాత్రి ఏడు గంటల సమయం చిత్తూరు మద్రాసు రోడ్డుమీద ఫియట్‌కారు గంటకు ఏభై మైళ్ళ వేగంతో పోతున్నది చల్లనిగాలి చక్కని వెన్నెల పూర్ణచంద్రుడు మబ్బుల చాటునుంచి వస్తూ, పోతూ, కారుముందు అద్దంలోనుంచి లోపల కూర్చున్నవారికి గిలిగింతలు పెడుతున్నాడు బాట కిరువైపుల పంటచేలు, నీటితోనిండిన చెరువులు పండు వెన్నెలలో కన్నులకు మహా ఇంపుగా కనిపిస్తున్నవి ఆ కారులో ప్రయాణం చేస్తున్నారు మన ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య మరి ఇద్దరు మిత్రులతో

చెప్పుకొనడానికి సంగతులు అయిపోయినాయి మాట్లాడుకొనడానికి విషయాలు తరిగిపోయాయి ఇంకా రెండు గంటలైనా ప్రయాణంచేస్తే కాని మద్రాసునగరం చేరలేము ఆ సమయంలో, కారులో వున్న ఒక మిత్రుడు అన్నాడు "ఇది సినిమా పాటలు పాడే ఆయన వూరండీ" అని "ఇంతకీ వారి వూరు వెళ్ళడానికి రోడ్డువుందా? అదైనా వేయించిపెట్టలేకపోయావు" అన్నారు ముఖ్యమంత్రి అక్కడనుంచి మాటలమీద మాటగా కబుర్లు సినిమాలమీదికి, సినిమా పాటలమీదికి దిగాయి ఇంకేముంది శ్రీ సంజీవయ్య సంగీతకారుడుగా మారిపోయారు

## సంగీత ప్రియుడు

బహుశా నిండు చంద్రుడు ఆయనను ఉత్తేజపరచాడు కాబోలు "అందాల హో మేఘమాల" అనే మల్లీశ్వరి చిత్రంలోని పాట ఆలాపనగా వచ్చింది ఆయనకు అంతలోనే ఎందుకు జ్ఞాపకం వచ్చిందో "హో ప్రియతమా నను మరచిపోకుమా" అంటూ లైలామజ్ను చిత్రంలోని విషాదగీతిక వినిపించారు

ఇంతలోకే ప్రక్కనవున్న మిత్రుణ్ణి కూడా చందమామ గిలిగింతలు పెట్టిందేకాని పాడలేక పోయాడు. పల్నాటియుద్ధం చిత్రంతో ముగుస మోహించారు, బాలకొమ్మడు శ్రీ చందమామతోపో "చందమామ" అంటూ పాడిన పాటను గుర్తు చేశాడు పల్నాటి యుద్ధం అనేసరికి, పలనాటి స్థితిని గురించి శ్రీనాథుడు చెప్పిన "చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు" అనే చాటువును రెండు దఫాలు చదివారు శ్రీ సంజీవయ్య అక్కడనుంచి దాని లాపన నెమ్మదిగా సాగి హరిశ్చంద్ర నాటకంలోని "నా ఇల్లాలని నాదు పుత్రుడని" అనే పద్యాన్ని రాగయుక్తంగా రెండు మూడు నిముషాలు పూర్తి కంఠంతో పాడేశారు శ్రీ సంజీవయ్య ఆ వెంటనే పాండవోద్యోగవిజయాలలోని "అలుసు బిడ్డలు వీడ్డ తినజాలన నేత్తురు కూడు మాధవా" అనే పద్యాన్ని కూడా ఎలుగెత్తిపాడుతూ తన్మయత్వంలో మునిగిపోయారు ముఖ్యమంత్రి "ఏమండీ అద్దంకి శ్రీరామమూర్తిగారి కంఠం వినబడుతున్నట్టున్నది" అని ప్రక్కనవున్న మిత్రుడు అనగానే "అలాగా?" అని నవ్వారు శ్రీ సంజీవయ్య

అక్కడితో సంగీత ప్రవాహం ఆగింది కవి, కళాకారులపోషణ, సన్మానాలమీద కబుర్లు జరిగాయి. ఆధునిక కావ్యాల ప్రస్తావన కూడా వచ్చింది జాషువాగారి "గబ్బిలం"లోని రెండు పద్యాలు, ఖండ కావ్యాలలో "నగర మాంధాతాది" అనే పద్యం భీష్మవధకు సంబంధించిన రెండుపద్యాలు శ్రావ్యంగా చదివారు శ్రీ సంజీవయ్య

ఇవన్నీ ఎప్పుడు చదివారు అన్న ప్రశ్నకు "చిన్నప్పుడు" అన్నారు శ్రీ సంజీవయ్య వెంటనే చిన్నతనం గుర్తుకు వచ్చింది అప్పటికి ప్రసిద్ధిలో వున్న కపిలవాయి రామనాథశాస్త్రి పాటలు "రామ జోగిమందు కొనరే భలే మంచి చౌక బేరము" పాటలు చిన్ననాటి ఉత్సాహంతో తాళం వేస్తూ మురిసిపోతూ వినిపించారు అప్పుడేగుర్తుకు వచ్చింది కూచిపూడి నృత్యం సంగతి కూడా "భామనే— సత్యభామనే" అంటూ ఆలాపించినప్పుడు, "కృష్ణ రాయభావ" అంటూ మండూక నృత్య పద్యంలోని ఆలాపనచరణం అన్నప్పుడు, శ్రీ సంజీవయ్యగారికి నృత్యం కూడా వచ్చునేమో అది చూసే భాగ్యం వస్తుంది అని అనుకుంటూ వుండగా, వచ్చేసింది మద్రాసులోని గెస్టుహౌస్ దానిముందు నిలబడిన రిజర్వు పోలీసు తుపాకి నిటారుగా పట్టుకొని, టకీమని బూట్లు చప్పుడుతో చేసిన సెల్యూట్ అదొక నాట్యంగా కనిపించింది ఇంకేముంది. శ్రీ సంజీవయ్యగారు ఇక ముఖ్యమంత్రి.

అవును నిజంగానే ముఖ్యమంత్రి సాహిత్య ప్రియుడైన ముఖ్యమంత్రి సంగీతకారుడైన ముఖ్యమంత్రి అయినా సాహితీవేత్తనని చాటుకొనడానికి ప్రయత్నించరు అముద్రిత శతకాలు, పద్యాలు వున్నా అచ్చువేయించుకొని గ్రంథకర్తనని ముద్ర వేయించుకొనడానికి ప్రయత్నించరు కనీసం "డాక్టరేట్" బిరుదుకోసం లోలోపలైనా ఆశపడరు సంగీత సాహిత్య సభలను అలంకరించరు పత్రికలలో తనపేరుమీద నాలుగువ్యాసాలు సంగీతంమీద, సాహిత్యంమీద, నాట్యంమీద వ్రాయించుకొని అచ్చు అయ్యేటట్టుయినా చూసుకోరు అందుకే అనిపించింది శ్రీ సంజీవయ్య నిజంగా "నిండుకుండ" అని

వి. వి. నరసింహాశాస్త్రి



# 'రేసా'

బ్యాండ్ స్ప్రెడ్ మోడల్

6 నోవల్ లైఫ్ వాల్వులు–5 బ్యాండ్లు

10½" × 6½" స్పీకర్ —

ఆకర్షవంతమైన ఉడెన్ క్యాబినెట్

పికప్, ఎక్‌స్ట్రా స్పీకర్ కనెక్షన్లతో

రు. *370/-*

ఎక్సైజు సుంకం - రూ. 29-50 ; స్థానిక పన్నులు అదనం.

ఆంధ్రప్రదేశ్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు :

## ఎస్. ఎస్. రేడియో & ఎలక్ట్రికల్స్

చిక్కడ్‌పల్లి : : హైద్రాబాద్-20.

గ్రామ్స్ : RESA — ఫోన్ : 35414

—: ఆంధ్రప్రదేశమంతటా డీలర్లు కలరు :—

—Excellent

---

అశోకా ఆమ్లా

రత్నత్రయము

- అశోకా ఆమ్లా హేరాయిల్
- అశోకా ఆమ్లా పొమేడ్ డీలక్సు
- అశోకా ఆమ్లా బ్రిలియంటైను

నల్లని కురులకు చల్లని గుణమునకు
సాటిలేనివని ప్రఖ్యాతిగాంచినవి

VIJAYA CHEMICALS
MADRAS-7.

---



## ఆంధ్రసచిత్ర వారపత్రిక

పాఠకులకు

రచయితలకు

అభిమానులకు

దీపావళి

అభినందనలు!



## రెండవ బహుమతి వ్యాసం:

# వివాహం జూదమా?

శ్రీమతి సి. కమలా శ్రీరామ్

వివాహము జూదమా? అన్న ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు' అది నూటికి నూరుపాళ్ళు యథార్థమే నన్న విషయం నేటి మనవివాహాలే నిరూపిస్తున్నాయి.

ఆ విషయములో వాద వివాదాలు అనవసరమనే అనిపిస్తుంది ఎందువల్లననంటే—పెద్దలు కుదిర్చిన వివాహాలేగాక ప్రేమించి పెండ్లాడిన వివాహములలో కూడా వధూవరులు సంతృప్తికరమైన జీవితములు గడపలేకపోవడము, జీవితములో అమూల్యావకాశమును దుర్వినియోగపరచుకొన్నామను కొంటూ బాధపడటమూ నిత్యమూ కన్పిస్తున్న విషయమే

నేటి వివాహములలో సగానికిపైగా ఎందుకు విఫలమవుతున్నాయ్? దీనికి కారణము అన్నీ ప్రేమ వివాహములు కాకపోవడమేనా?

కానీ అలా భావించడానికి వీలులేదు మొదట ప్రేమించి పెండ్లాడినా, వివాహమైనపిమ్మట వారి సంసారములో ప్రేమంటే యేమిటో మచ్చుకైనా కనుపించక, నిరంతరము మనఃక్లేశాలతో—జీవించడమే దుర్భరముగా భావిస్తూ, సంసారయాత్ర సాగిస్తున్న స్త్రీ, పురుషు లనేకులు నేటి మన సమాజములో కన్పిస్తూనే ఉన్నారు

మరి వివాహానంతరము వధూవరు లెందువలన అసంతృప్తిపాలౌతున్నారు?

మొదట పెద్దలు కుదిర్చిన వివాహములనే తీసుకుంటే—వధూవరులనే రెండు పావులతో పెద్దలు ఆడే జూదమే వివాహమనిపిస్తుంది ఈ వివాహములో జయాపజయములు భగవంతునిపైనే ఆధారపడి వుంటాయ్. ఆ వివాహమువలన ఆ వధూవరులు సుఖపడగల్గితే— అదంతా వీరి గొప్ప అనే భావిస్తారు. ఆ వివాహమువలన ఆ వధూవరులు కష్టపడితే—"అదంతా వారికర్మ" అని తేలికగా కొట్టి పారేస్తారు.

ఇక రెండవ రకము—ప్రేమ వివాహములు. వీటిలో ప్రేయసీ ప్రియులు ఒకరినొకరు పూర్తిగా అర్థము చేసికొనకపూర్వమే, కొద్ది పరిచయముతోనే—బాహ్యాకర్షణలకు లోబడి-ఒకరి హృదయ భావములను ఒకరు సంపూర్ణముగా అవగతము చేసుకొన్నాము—ఇక తామిద్దరికీ శరీరాలు వేరేగానీ—మనస్సొకటేనని భావించుకుని వివాహము చేసుకొంటారు కానీ వారు గూడ వివాహానంతరమే ఒకరి నొకరు పూర్తిగా అర్థము చేసుకొనగల్గుతారు. అప్పుడు యిద్దరి మనస్తత్వాలూ వేర్వేరని తెలిసికొన్నా, తమ్ము తాము మోసగించుకొన్నామని బాధపడటము, నిరంతర కలహాలతో వేగిపోవటము తప్ప చేయగల్గిన దేమున్నది?

వివాహమంటే యేమిటి? ఇద్దరు స్త్రీ పురుషుల పవిత్రానుబంధమేకదా! వారి అభిప్రాయములు, ఆశయములు, ఆశలు వేర్వేరైనా, ఏకమేఅయినా వారి మధ్య విడరాని బంధము ఏర్పరుస్తుంది వివాహము. వారి అభిప్రాయాలు ఒకటే అయితే చిక్కేవుండదు. అవి వేరైనప్పుడే వచ్చే చిక్కంతా.

వివాహమంటే బొమ్మలఆటగాదు — జీవిత సమస్య అంతవరకూ ఒకవిధముగా సాగిన జీవితాలు వివాహముతో వేరొక క్రొత్త మలుపు తిరుగుతాయి దానిపైనే మన భవిష్యత్తు జీవిత సుఖ దుఃఖాలు ఆధారపడివుంటాయి. అటువంటి వివాహమునే తేలికగా తీసుకొని, మన నొసటెలా వ్రాసియుంటే అలా జరుగుతుందిగానీ—మన చేతిలో యేముంది?' అని పూర్వ జన్మ సుకృతాలపైన ఆధార పడివుంటే—వివాహం జూదముగాక మరేమవుతుంది?

ఇలా వివాహము జూదముగా పరిగణింపబడుటకు కారణమేమిటి? వధూవరులు ముందుగా ఒకరి నొకరు ఎందువలన అర్థము చేసుకొనలేకపోతున్నారు? అని ప్రశ్నించుకొనాలి.

పూర్వము వధూవరుల నొకరి కొకరిని చూపించకనే—పెద్దలే వివాహమును నిర్ణయించేవారు. కానీ కాలము మారినకొలదీ, వధూవరుల నొకరి కొకరిని చూపించడమనే ఆచారాన్ని అమలులోనికి తీసుకొనివచ్చారు. కానీ, దీనివలన వధూవరులు వారి బాహ్యరూపములనే చూడగల్గుతారుగానీ, వారి హృదయాంతర్గతభావాలను ఎలా చదువగల్గుతారు? దాంపత్య జీవితము సుఖమయమగుటకు బాహ్యరూపమొక్కటే ప్రధానముగాదుగదా!

ఈ విధముగా ఆలోచించి కొంతమంది కొంచము ముందంజవేశారు. పెద్దలు నిర్ణయించిన సంబంధమే అయిననూ, వధూవరులు ఒకరితో నొకరు కొద్ది నిముషములు ముందుగా మాట్లాడి, ఒకరి అభిప్రాయముల నొకరు కొంతవరకూ తెలిసికొనిన తరువాత వివాహము చేసుకొనుచున్నారు. ఇది కొంతవరకూ మంచిపద్ధతిగనే కన్పిస్తుంది. ఎందుచేతనంటే—వివాహము దైవాధీనమని, గ్రుడ్డిగా చేసుకొనకుండా ఈ పద్ధతివలన వధూవరులు ఒకరి

(67-వ పేజీ చూడండి)

ఎప్పుడూ ఇంతే— 107 శంకర్



# చదువుల్రావు



చదువుల్రావు దీపావళికి వాళ్ళ మేనమామగారి ఇంటికి వెళ్ళాడు.
ఈసారి బావని మనం బాగా ఏడిపించాలి
ఐతే ఏం చేద్దాం?
....ప్స....... ప్స.. ......ప్స .. ప్స ...
అలా చేద్దాం ఏం?




మెల్లిగా వెళ్ళి మెయిన్ స్విచ్ ఆఫ్ చేసేడు_




బావా లైట్లువచ్చేదాకా ఈ కొవ్వొత్తి వెలిగించు




వీళ్ళకి కొవ్వొత్తి వెలిగించడంకూడారాదు కుర్రవెధవలు
అని అటు చూస్తూ వొత్తి దగ్గర అగ్గిపుల్ల పెట్టాడో లేదో




పాపం మనరావుకి మాత్రం ఏంతెలుసు టపాకాయి చుట్టూ మైనంరాసి ఇచ్చారని
సత్యమూర్తి



ఇటీవల విజయవాడలో కృష్ణాజిల్లా పోలీసు ఉత్సవాలు జరిగాయి. చిత్రంలో మంత్రులు అల్లూరి, శ్రీమతి మసూమా బేగం, శాసనసభ్యుడు కాకాని, కలెక్టరు ఆర్. కె వేపా లను చూడవచ్చు.

మనమూ-మనరాష్ట్రం — కౌండిన్య

# నదీజలాల తగవును రాజకీయాలనుండి తప్పించకపోతే రావణాసుర కాష్ఠంవతే

గుల్హాతీసంఘం అక్టోబర్ 28 నుంచీ ఆంధ్రలో పర్యటన ప్రారంభించింది. ఇది నవంబర్ 6 వరకూ సాగుతుంది ఇదివరకటి పర్యటనకన్నా, ఇది చాలా ముఖ్యమైనది క్రితం జూన్‌లో గుల్హాతీసంఘం కేవలం కృష్ణా—గోదావరి నదీ ప్రవాహాల కొలతలు తీయడానికి వచ్చింది ఈసారి రాష్ట్రంలో వివిధ ప్రాజెక్టులను సందర్శించి, ఏది ఎంత అవసరమో, పొరుగు రాష్ట్రాలకు నీరు సప్లై చేయడానికి వీలుగా వేటిని ఎంతవరకు కుదించవచ్చో నివేదికలో తమ అభిప్రాయం సూచిస్తారు. అందుకే కమీషన్ ఇప్పుడు ఎక్కడికివెళ్ళినా, శ్రీశైలం, పోచంపాడులు మంజూరు చేయాలని, తుంగభద్ర కాల్వ పొడిగించాలని, నాగార్జునసాగర్ రెండవదశకు నున్నా చుట్టరాదని 51 ఒప్పందాన్ని ఆమోదించాలని, నినాదాలుచేస్తూ ప్రదర్శనలు జరుపుతున్నారు. మూక ఉమ్మడిగా సంతకాలుచేసి విజ్ఞప్తులు సమర్పిస్తున్నారు

ప్రాజెక్టులు గురించి ప్రజాభిప్రాయాన్ని ప్రజల భయాందోళనలను వ్యక్తం చేయడానికి ఇటువంటి ప్రదర్శనలు, నినాదాలు అవసరమే. కాని కేవలం వాటిపైనే ఆధారపడి కృతకృత్యులంకాలేం, ఇదివరలో ఇలా పెద్ద ఎత్తున ప్రజాందోళన లేవదీసి, నాగార్జునసాగర్‌ను సాధించుకోలేదా అనవచ్చు నాగార్జునసాగర్‌కు ఇప్పుడు వచ్చిన ఈ తగాదాకు పోలికలేదు. అది ఒక్క రాష్ట్రానికి సంబంధించిన ప్రాజెక్టు ప్రాజెక్టును మంజూరు చేయడంలో కేంద్రం మొదట వెనకాడింది డబ్బు విషయమయ్యేగాని, నీటి పంపిణీ కీచులాటగాని, ఇతర కారణాలుగాని లేవు ఇప్పుడో ఈతగాదా ఆంధ్రకు, కేంద్రానికి మరో నాలుగు రాష్ట్రాలకు సంబంధించినది మనం మన రాష్ట్రంలో ప్రజా ఉద్యమాలు నిర్మిస్తే, అవతలి రాష్ట్రాలవారు కూడా అదే చేస్తారు. కేంద్రం దృష్టిలో అందరూ ప్రజలే గనుక ఏమీచేయలేని అసహాయస్థితిలో పడిపోతుంది కాగా ఒక వైపున ప్రజాందోళన చేస్తూనే, మరోవైపున ఈ తగాదా పరిష్కారానికి ఇతర మార్గాలను కూడా మనం ఆలోచించడం అవసరం.

ఆ మార్గాలు ఏమిటి అన్నదే సమస్య మనకు సంబంధించినంతవరకు 1951 ఒప్పందాన్ని ఒప్పుకుంటే సమస్యేలేదు కాని అవతలి రాష్ట్రాలవారు ఒప్పుకోడంలేదు. 25 ఏళ్ళు ఉండవలసిన ఒప్పందాన్ని మధ్యలో కాదనడం తప్పే అయినా మీ వాదం తప్పు అని వారికి నచ్చజెప్పడానికి కేంద్రం సిద్ధంగా లేదు. అటువంటప్పుడు మన ఒప్పును, వాళ్ళ తప్పును నిరూపించడానికి మనం యత్నించాలి. ఇందుకు మూడు మార్గాలు కన్పిస్తున్నాయి. ఒకటి : వివిధ రాష్ట్రాల ప్రతినిధులు ముఖాముఖి కలుసుకుని తేల్చుకోడం, రెండు కేంద్రంమధ్యవర్తిత్వం, మూడు సాంకేతికుల ద్వారా పరిష్కారం. ఇందులో మొదటి పద్ధతి ప్రకారం ఐదు రాష్ట్రాల మంత్రులు కేంద్రం అధ్వర్యాన రెండు మూడుసార్లు కలుసుకున్నారు లాభం లేకపోయింది నదీ జలాల కేటాయింపులో న్యాయాన్యాయాలను అంతర్జాతీయ సూత్రాల ప్రకారం పరిశీలించి ఉంటే పరిష్కారం కుదిరి ఉండేది కాని అవసరంగా ఇందులో రాజకీయాలు చొప్పించి ఆధార రహితమైన వాదాలతో, గొంతెమ్మ కోర్కెలతో సమస్యను కళ్మలం చేశారు. కేంద్ర ప్రభుత్వంలో వున్నవారు కూడ ఇందుకు కొంత బాధ్యులనే చెప్పాలి.

రెండవ పద్ధతి మధ్యవర్తిత్వం. ఇది నడపవలసిన కేంద్ర ప్రభుత్వం 51 ఒప్పందం సంగతి ఎత్తకపోయినా అవతలి వారి వివాదానికి మొగ్గు చూపుతున్నట్లు కన్పించడంచేత కేంద్రంవల్ల కూడా మనకు అన్యాయం జరుగవచ్చు నన్న భయంతో మధ్యవర్తిత్వానికి మనం ఒప్పుకోలేదు. ఇప్పుడు కేంద్రప్రభుత్వం కృష్ణా, గోదావరి నీటి లెఖ్కలు తీయడానికి గుల్హాతీ సంఘాన్ని నియమించినా ఇది నిష్పాక్షికమైన సాంకేతిక సంఘంగా మనం విశ్వసించడంలేదు. ఇదివరలో ఖోస్లా సంఘం, తీసిన లెఖ్కలు తప్పు అని తేల్చడం గాని, ఈ నదులలో కొత్తగా మిగులు నీరున్నట్లు చూపించడం గాని

(65-వ పేజీ చూడండి)

# కేశ శృంగారమునకు
# తగిన హేర్ ఆయిల్

ఒత్తుగా పెరిగిన, నిగనిగలాడే నల్లని కురులుగల భారతీయనారి నిత్యం తన జుత్తును
పరిపోషించుకొంటుంది వెంట్రుకల కుదుళ్లకు తగినంత నూనె అందటం మూలంగానే
ఆమె జుత్తు అంత మనోహరంగా వుంటుంది. అందుచేతనే ఆమె తలయందుగల
సహజ నూనెలను హెచ్చింపే తలనూనెను జాగ్రత్తగా ఎంచుకొంటుంది.

టాటావారి హెయిర్ ఆయిల్స్‌లో ఆరోగ్యవంతమైన శిరోజాలను ఒత్తుగా పెంచేశుద్ధమైన, సులభంగా
ఇంకిపోయే పోషక పదార్థాలు వున్నాయి, జుత్తును జిడ్డు చేయకుండా నిగనిగలాడిస్తాయి.

టాటావారి కోకనట్ మరియు కేస్టర్ హెయిర్ ఆయిల్సు మనోహరమైన
పరిమళం గలవి. మూడు సైజులలో దొరుకుతాయి.






## టాటావారి
## హేర్ ఆయిల్స్

THOY 12 TEL

# గిరీశం లెక్చర్లు | స్రో మహా ష్వారో భాణము

## (లేక) మైగాడ్! పేరేనా మారార్రా?

ఆయ ఆయ నమస్కారం నమస్కారం. దయ చెయ్యండి మీకోసవే ఎదుగు చూస్తున్నాను. పాత బాకీకోసం చిన్న నటుడిలా, కొత్త ఇనిస్టాలు మెంటు సొమ్ముకోసం ప్రొడ్యూసరులా, రయమున రయమున రాని హీరోయినుకోసం మిగతా జనాభాలా పార్టీ టిక్కెట్టుకోసం ఛాన్సులేని ఎలక్షను కాండిడేటులా, ఈ ఉపమానాల అంతుకోస మిమ్మలా, జీ(వి)తంకోసం బోర్డుస్కూలు మేస్టరులా, ఆయన జీతం కోసవే ఆయన తాలూకు అప్పులాళ్లలా, మందుకోసం ధర్మాసుపత్రి రోగిలా, ఈగలకోసం పెన్సిలిను బుడ్డిలా, రైలుకోసం ప్రయాణికుడిలా, సీతకోసం మోహన్‌లా, ఈ ఉపమానాల ముగింపుకోసం పాఠకుడిలా, 'ది యెండ్' కోసం ఇటీవలి చిత్రాల ప్రేక్షకుడిలా, ఐక్యత కోసం ఆంధ్రుల్లా, విమర్శకోసం మహాకవుల్లా, గురు అప్పారావుని ఆడిపోసుకునే అవకాశంకోసం హాస్యబ్రహ్మల్లా, మనియార్డరుకోసం హాస్టలు స్టూడెంటులా, డెంటుకోసం టాక్సీడెంటుకోసం పొగరుమోతు డ్రైవరులా, మంచి ఉపమానంకోసం మీలా, అర్హుడైన ప్రయోక్తకోసం ఉపమానంలా, తమపై సినిమావారి మోజు విరిగేరోజుకోసం శరత్కథలా, చిద్గగనాంతాన గురుసాక్షాత్కారం కోసం విశ్వనాథగారిలా, రీమేక్‌కోసం పాతకథల్లా, సన్నదనం కోసం దేశవాళీ హీరోయిన్‌లా, చక్కదనంకోసం వాంపులా, నాయకుల చెవాకులకోసం సెక్రెటర్లురాసే వాడిలా, ఈ పేరాగ్రాపు ముగింపుకోసం పాఠకుడిలా, సరి కొత్తకథలోంచి పుట్టవలసిపున్న సరిపాతకథకోసం మనలా, అప్పుకోసం అప్పారావులా, విడుదలకోసం లోభి జేబులో గుండుగల ఐదవజార్జి రూపాయిలా, నేను మీకోసం ఎదురు చూస్తున్నాను మీకోసవే ఎదురు చూస్తున్నాను

ఆయ ఆయ రండ్రండి నమస్కారం మీ కోసవూ ఎదురుచూస్తున్నాను అయిపోయింది కథ రడీగాఉంది మార్పులు, కూర్పులు చేసి తీసి సిద్ధ పరిచాను ఓకె చెయ్యడవే తరవాయి. ఇందువు కాయేసిన వరద బురద నీటిలా తేటగాఉంది ఎంత చిన్నపిల్లాడైనా—మాటలు రావాలనుకోండి— చక్కగా చెప్పగలడు ఏదేశంవాడైనా—భాష తెలిస్తే—ఇట్టె చెప్పేస్తాడు ఏ ప్రేక్షకుడికీ చెప్పినా, ఇది సినిమాకథ అని ఇట్టె గుర్తు పడ తాడు హిట్టవుతుందని నా మిత్రులెవర్నడిగినా చెప్తారు. నేనేనా ఆమాటే అంటాను

చిత్తం యూవన్నారూ? మార్పులు చెయ్య లేదనా? ఛంపేశారు నేను చస్తే పాతకదని వాడ తాన్టండీ కొత్తదివ్వకపోతే నా గొప్పేవిటంట. అంతెందుకు ఇందులో మెలోడ్రామా సీన్సవింటే చాలు మీకే తెలుస్తుంది భోర్న ఏడుస్తారు నా ఫ్రెండ్సంతా మొర్రోమని ఏడిచారు. బుచ్చమ్మ బాబోయ్ అని ఏడిచింది బుచ్చమ్మేవిటి ఇంటిల్లి పాది ఒకటే ఏడుపు . డామిట్. మీర్నమ్మరు

(60-వ పేజీ మాడండి)



# దీపావళి శుభాకాంక్షలు

## ఈస్టిండియా
ఫిలిం కంపెని (ప్రై) లిమిటెడ్

యం యం. పిక్చర్స్
"ప్రొడక్షన్ నెం.1." (తెలుగు)
జమున • రాజసులోచన
జగ్గయ్య • రమణమూర్తి

శ్రీ రామా పిక్చర్స్
"దేశద్రోహులు" (తెలుగు)
N.T. రామారావు • రేలంగి కాంతారావు
రాజనాల • దేవిక • గిరిజ

రాజలక్ష్మి ప్రొడక్షన్స్
"ప్రొడక్షన్ నెం.1." (తెలుగు)
(ఖైదీ కన్నాయిరం తెలుగు)

భాస్కర్ ప్రొడక్షన్స్
"మోహిని రుక్మాంగద"
(తెలుగు & కన్నడం)
(తెలంగాణా & మైసూరులకు

పద్మశ్రీ ప్రొడక్షన్స్
"ప్రొడక్షన్ నెం. 2." (తెలుగు)
నాగేశ్వరరావు • రేలంగి • సావిత్రి
గిరిజ • వాసంతి • శాంతకుమారి
(నైజాం)

జైకుమార్ పిక్చర్స్
"సంపూర్ణ మహాభారతం"
(తెలుగు)

నిర్మల పిక్చర్స్ వారి
ధాన్యమే ధనలక్ష్మి
పద్మిని • జెమినిగణేష్
డైరెక్షన్ • A భీమ్‌సింగ్

## చమ్రియా టాకీ
డిస్ట్రిబ్యూటర్స్

అంజలీ పిక్చర్సు వారి
"స్వర్ణమంజరి"
అంజలి దేవి • N.T. రామారావు

వి.యన్ ఫిలిమ్స్ వారి
"భక్త రామదాసు"
నాగయ్య • కన్నాంబ

లలితా ఫిలిమ్స్ వారి
"లవ కుశ"
(గేవా కలరు)
N.T రామారావు • అంజలిదేవి
నాగయ్య

పక్షిరాజా స్టూడియో వారి
"రాబోవు తెలుగు చిత్రము"






# సాందీపనిపర్వం - 35

ఆ మరునాడు ఉదయముననే రథము వచ్చెను. రథముతో వాచాలుడు వచ్చెను. వాడు బ్రాహ్మణుడు. బ్రహ్మచారి రథము దిగి ఆశ్రమములో ప్రవేశించుచు ఆశ్రమ వృక్షముల కొమ్మలను వంచి పూవులను కోయుచున్న వామాక్షిని చూచెను. వామాక్షి అందమైన పిల్ల. పదియేండ్ల వయస్సు గలది, పదిరెండేండ్ల వయస్సు కలదివలె కన్పించును మన్మథుడు క్రొత్తగా దాని యొడలిపై తన చూపులను ప్రసరించుచున్నట్లు అది కన్పించును వాచాలుడు ఆశ్రమములో ప్రవేశించుచు అట్టె దానిని చూచెను. వానికి మనస్సు ఏమో అయినది హృదయములో ఏదో కోరిక కదలాడినది వాడు అనుకొనినాడు . ఈ పిల్లను భార్యనుగా స్వీకరించుచో ఎంత బాగుండును అని. అనుకొని వామాక్షి పూవులుకోయుచున్న చెట్ల దరికి అతడు వచ్చెను. "చూడు పిల్లా ! నీ పేరు వామాక్షి కాదు! అసలది యేమి పేరు ! మీనాక్షి యనియో, చకోరాక్షి యనియో, పద్మాక్షి యనియో, కలువ కన్నుల అన్న అనియో పేరు పెట్టిన బాగుండెడిది మరి మీ నాయనగారు నాయంత ఆలోచనాపరులు కారు అందుకే వామాక్షి యని పేరు పెట్టినారు' అనినాడు వామాక్షి అతనిని అప్పుడు చూచినది. ఆ చూపులలో అత డనుకొనిన పుష్పము లేమియును లేవు చురకత్తు లున్నవి ఆ చూపుల తాకిడికి అతడు డిల్లపడి పోయినాడు అతని ముఖము ఎర్రనైనది ఇప్పుడు తెల్లవడినది. "అట్లు చూచెదవేమి !" అనినాడు

"నీవు అట్లు మాట్లాడెదవేమి ?" అన్నది వామాక్షి

"ఎట్లు చూడమందువు ?" అనినాడు వాచాలుడు

"దిక్కులు చూడక వచ్చిన పనియేమో చూడ ముందును" అన్నది వామాక్షి.

పిల్ల చమత్కారముగ గూడ మాట్లాడును అనుకొనినాడు వాచాలుడు. తానును చమత్కారముగ మాట్లాడబోయినాడు.

"దిక్కులలో అందములు చెట్లకు ఎగబ్రాకుచుండగా నెట్లు చూడక యూరకొందును" అని వాడు.

"నీ అందమునకు తోడు దిక్కులలో అందములను గూడ చూచుట కలదా!" అన్నది వామాక్షి.

ఆ మాటలు ఎవ్వరో వినినట్లున్నారు, పగలబడి నవ్విన నవ్వడి య్యైనది. వామాక్షి ఆ దిక్కునకై చూచినది. సిగ్గు పడినది. వాచాలుడును అటు దిక్కైక్క చూచినాడు. తిరిగి తన్ను తాను చూచుకొనినాడు. వాని యందమేమో వానికి కన్పించలేదు ఆ వచ్చుచున్నవారిలో యొక్కడు, మరి యొక్కనితో అనుచున్న మాటలు మాత్రము వానికి విన్పించినవి. "శ్రీకృష్ణ ! వీడొక మర్కటము. వీనికి అందములు కానవచ్చుచున్నవయ్యా!" అంతలో వారు దగ్గరకు వచ్చినారు. వామాక్షి సిగ్గు రూపమై నిలుచున్నది. శ్రీకృష్ణదేవు డనినాడు : 'వామాక్షి ! నీవు ఇంటిలోనికి పో. నేనును, సుదాముడును పూవులు కోసి, ఆచార్యానికి యిచ్చెదము" అని వాచాలుని చూచినాడు. "అవును ! నీపేరేమి ! వాచాలుడు కదూ ! పౌండ్రకుని విదూషకుడవు. అవునా ! నీ వచ్చిన పనియేమి ! అవును మహానందుని కోసము వచ్చినట్లున్నావు. ఆయన ఇప్పటిదాకా మాతోడనే యుండెను. ఇప్పుడే అట్లు పోయెను పిలతునా !" అనినాడు.

"నేనే పిలతును."

"నీవు పిల్చిన ఆయన పల్కవద్దా !"

"నన్ను ఎరుగక మాట్లాడుచున్నావు."

"నిన్ను ఎరుగకపోవుట యేమి ! ఇప్పుడేగదా చెప్పితిని. నీవు వాచాలుడవు. పౌండ్రకుని నర్మసఖుడవు. అతని మనస్సు వంటి ఆకారము కలవాడవు మరియు నేమి కావలెను నిన్ను ఎరుంగుటకు !"

"ఏమి కావలెనా ! మాటలాడు పద్ధతిలో జాగ్రత్త కావలెను. నేను పౌండ్రకుని నర్మసఖుడను ! నా సఖుడు పౌండ్రకుడా ! తెలిసినది నీవు వాసుదేవుడవు శ్రీకృష్ణ వాసుదేవుడవు. నీవు మా మహారాజును పౌండ్రకుడని యందువా ? వాసుదేవుడని యనలేవుకదూ ! నేను ఆయనకు మంత్రిని తెలిసినదా ! వాసుదేవునకు మంత్రిని."

శ్రీకృష్ణదేవుడు గల్లున నవ్వినాడు. "నేనుమ అదియే కదా అంటిని. అతని మనస్సే నీవని." అనినాడు

వాచాలుని మొగ మిప్పుడు పూర్తిగా ఎర్రబడినది. వానికి నోట మాటగూడ సరిగాలేదు. తడబడినది "నేను—నే . . ను .... మర్కటమునా! మా వాసుదేవుని మనస్సు .... మర్కటమా ?" అనినాడు

శ్రీకృష్ణదేవుడు మరల గల్లున నవ్వినాడు. "ఆ మాట నేను అన్నానటయ్యా ! నీవు అనుకొనుచున్నావు సరే ! అది యంతయు నా కెందుకు ? మహానందు డెచ్చట నున్నాడో చూచి, నీవు వచ్చినావని చెప్పుదును నీవు ఆశ్రమద్వారమున నిలువుము."

ఆ మాటలలో మెత్తని ఆజ్ఞ యున్నది. ఆ ఆజ్ఞ వాచాలునకు విన్పించినది. వాడు ఏమో అనబోయినాడు. ఆ అనబోవు మాటలయొక్క అక్షణము వాని ముఖములో కన్పించినది. వానిని అట్లు చూచి శ్రీ కృష్ణదేవు డనినాడు : "వాచాల ఆశ్రమ ద్వారమున నిలుమంటిని గదా ! ఇంకా ఇక్కడే నిలుచున్నావు."

వాచాలుడు మరి మాటాడలేదు. ఆశ్రమ ద్వారమునుగూర్చి బయలుదేరి పోయెను. శ్రీకృష్ణ సుదాములును మహానందుని వెదుకబోయిరి. అత డెక్కడనో, ఏ చెట్టు క్రిందనో ఉండును. లేదో నగరములో తిరుగ బోవును అత డిట్లు రాలేదు గనుక, ఆశ్రమములోననే ఎక్కడో యుండును. పౌండ్రకుని అభిప్రార్థనమును గూర్చి ఆచార్య సాందీపనియు అట్లు అనుట అతనికి కష్టముగా నుండెను ఇప్పుడు తా నా గురుత్వమును కాదన లేడు అవునను అనలేడు. ఈ సందిగ్ధ స్థితిలో నతడు నిర్వేదమును పొందుచుండెను. నిజముగా నతడు నిర్వేదమును పొందుచుండెనా ! అది శ్రీకృష్ణునకు తెలియును. మహానందునకు సుఖమును లేదు. దుఃఖమును లేదు. అతడు నిర్వ్యాపారి. గృహస్థుడు గనుక గృహస్థ ధర్మముల నాచరించును. ఆ ధర్మములను తాను ఆచరించు చున్నానా అన్నట్లాచరించును. అతనికి శరీరము ఉన్నదా ! అది వాదియా అన్నట్లాచరించును. శరీరము వేరు, తాను వేరువలె నాచరించును. ఇప్పుడు పౌండ్రకునకు గురుత్వమును అట్లులనే ఆచరించును. అయినచో, ఇంతటి మీమాంస నేల పొనకరించుచున్నాడు ? అదియును శ్రీకృష్ణదేవునకు తెలియునో ?

శ్రీకృష్ణ సుదాములు మహానందుని కనుగొనిరి. అతడు ఆశ్రమములో నౌకమూల చెట్లకు పాదులు కట్టుచుండెను. అతని భార్యయు నచ్చట నుండెను. శ్రీకృష్ణ సుదాములు అచ్చటకు చేరువేళకు ఆమె అతని నిట్లు మందలించు చుండెను !

'మీకు ఏమియును పట్టదు పౌండ్రకుని వద్ద నుండి మనిషి వచ్చినాడు రథమును గూడ తెచ్చినాడు. మీరు ఇంకను బయలుదేరరేమి ! ఆ వచ్చిన యతనిని చూచి, మాట్లాడి, వత్తునని చెప్పరేమి ! అతడు మన వామాక్షి నేమియో అన్నాడట ! ఏమి యన్నాడే అని అడిగినాను. ఏమో చెప్ప

(58-వ పేజీ చూడండి)

### సంతోష హృదయావళి

దీపావళీ! దీపావళీ
సంతోష సంభరిత హృదయావళీ!
ముచ్చటైన ముతాబాల వెలుగులతో
చక్కనైన కాకరల చిటపటలతో
గంతులతో గోలచేయుచుం టే
బాలబాలికల సమ్మోదావళీ॥
కొమ్మలపై కాంతులుంచు కొం టెలకు
గోడలెక్కి ప్రమిదలుంచు గోలలకు
ఆశలపై విహరించే అల్లురకు
ప్రమోదసుధా జ్యోత్స్నావళీ॥
ఆటంబాంబు కాల్చేటి అల్లురను
వారిచూసి మురిసేటి కూతులను
ముతాబాలు కాల్చేటి మనుమలను
దర్శించి పులకించే తాతలకు
ఆనందమయ బాష్పావళీ॥
దీపావళీ! దీపావళీ!
సందీప్త సమ్మోద సారావళీ॥

—"నాగరాజ్"



**మల్లన్న నర్సిగాణ్ణి ఎక్కడ చూశాడు? ఎంత ప్రయత్నించినా గుర్తుకురాదేం? కాని తను పోచమ్మకు మాట ఇచ్చాడు. ఏం చెయ్యగలడు?**

కుక్క మొరగడం విని ఉలిక్కిపడి లేచాడు మల్లన్న. వంటినిండా గొంగడి కప్పుకుని లేచి నిల బడ్డాడు పొలం గట్టున చలి కాచుకుంటూ కూచున్న ఈరయ్యను కేకేసి "ఎందుకు ఈరయ్యా కుక్క అట్ల మొరుగుతున్నది ?" అని ప్రశ్నించాడు

"సాయిగాడు ఉరుకుతున్నడు అందుకే కుక్క మొరుగుతున్నది" అని అక్కడినుంచే జవాబిచ్చాడు ఈరయ్య

మల్లన్న పొలాలమధ్య ఎవరో పరుగెత్తుతుండడం చూశాడు చూసి వాడు ఎందుకు పరుగెత్తుతున్నాడో తెలుసుకుందామని ఈరయ్య ఉన్నచోటికి నడిచాడు

"ఏంది ఈరయ్య, ఏం సంగతి ? వాడు ఎందుకు ఉరుకుతున్నడు ?" ప్రశ్నించాడు మల్లన్న ఈరయ్యను

"నిన్న రాత్రిల కూని జరిగిందంట"

# రెండవ బహుమతి కథ

"ఎంటి ? కూని ? ఎక్కడ ? ఎవర్ని ?" ప్రశ్నలవర్షం కురిపించాడు మల్లన్న

"సత్తెనపల్లి కిష్టయ్యగారింట్ల నిన్న రాత్రిల దొంగలు కన్నం ఏసింద్రంట అల్లు లేసేటప్పటికి పెద్ద కొట్లాట జరిగి గాకొట్లాటలో ఒకడు సచ్చిపోయిండంట . .."

"గిప్పుడు సాయిగాడు యాడికి పోతుండు ?"

"పోశమ్మ ఇంటికి"

"గాడికెందుకు ? నరసిగాడికి అండ్ల ఏమన్నా సమ్మంద మున్నదా ఏం కత ?"

"ఏమో ఎవడికెర్క !"

మల్లన్న తిన్నగా ఇంటికి వెళ్లాడు మొహం కడుక్కుని వచ్చి సావిట్లో చతికిలబడి 'చా' కోసం ఎదురుచూడ సాగాడు రాత్రంతా నిద్రలేకపోవడం వల్ల తలపోటు మొదలయింది తన భార్య యాది చేసిన వేడివేడి 'చా' గొంతులో పడితే ఎంతటి తలపోటయినా ఇట్టే ఎగిరిపోతుంది

రోజూ తను మొహం కడుక్కునేలోగా 'చా' సిద్ధంగా ఉండేది. కాని ఆరోజు మాత్రం ఇంకా తయారుకాలేదు.

"యాదీ ! ఇయ్యాలేంటే బారెడు పొద్దెక్కినా ఇంకా 'చా' కాలేదేంటి ?"

పొయ్యిముందు కూర్చుని మండుతున్న కట్టెలను చూస్తూ, పరధ్యానంగా ఉన్న యాదికి అతని మాటలు వినిపించలేదు.

"ఏయ్ యాదీ!"

"ఓ ... ."

"'చా' అయిందా అంటున్నా"

(54-వ పేజీ చూడండి)

# కవి సార్వభౌముడు

నోరి నరసింహశాస్త్రి

### జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై ద్విజులు సూచించిన పౌష్టిక క్రియలు ఆచరించి శ్రీనాథుడు యాత్రకు సంసిద్ధుడవుతాడు. సింగన ప్రధానితోను, వామనభట్ట బాణునితోను ముచ్చటించి, డిండిముని శాస్త్ర పాటవము, లోపాలు తెలుసుకుంటాడు. వేమభూపాలుడు ఉచితమైన వీడ్కోలు ఇచ్చి పంపుతాడు.

చిత్రముగా, తెల్లవారునరికి ఏనుగుపాలెమంతయు గగ్గోలుగా నుండెను. నారి వాగున కావలి యొద్దున్న పెద్ద సేనతో వినుకొండ దుర్గాధిపతి తన చిత్ర చీనావట కుటీరములో విడిసియుండెనను వార్త వచ్చినది. అది అపూర్వము.

నారివాగు వర్షము కురిసినప్పుడు పెద్దదిగా ప్రవహించును. దాని మధ్యనుండియే రెండు రాజ్యముల సరిహద్దు రేఖ పోవును. ఇప్పుడు నీటి జాలు కొంచెమే యున్నందున, కొంత యీ రాజ్యమున, కొంత యా రాజ్యమున పారుచున్నది. సరిహద్దు రేఖ పొడుగున నారి వాగు మధ్యమున రహదారి కడ్డముగా దడివలె కర్రలు పాతి యున్నవి అనుమతి లేకుండా ఆ దడి దాటి వచ్చు వారిని బాణములతో కొట్టుటకు విలుకాండ్రు ఆవల సిద్ధముగా నుండిరి.

ఆవల సేనలున్నను శ్రీనాథుని పరివారములోనివారు ఆనాటి యుదయమున వాని కెదురుగానే వారి వాగులో స్నానములాడి వచ్చిరి. వారి కెట్టి యలజడియు నావలి సేనలు కలిగింపలేదు. ఆ నాడు భోజనాదికములు త్వరగా కానిచ్చి మధ్యాహ్నమునకు పూర్వమే బయలుదేరవలెనని శ్రీనాథుడాదేశించెను.

బండ్లకు సామానులెత్తిరి ఆశ్వికులు గుర్రములెక్కిరి యథాప్రకారము సన్నాయి మేళము ముందు కల్యాణిరాగ మాలాపనము చేయుచుండ నుత్సవము బయలుదేరినది.

(52-వ పేజీ చూడండి)



ఎన్. జగన్నాథ్

# ముఖ్యమైన ముడిపదార్థాలు

పది లక్షల రూపాయల రొఖ్ఖమూ, పేరుపొందిన నటీనటులూ, పరిపక్వమయిన సాంకేతిక నిపుణులూ, ఒక్కచోట చేరితే, ప్రశస్తమయిన చిత్రాలు తీసెయ్యవచ్చని చాలామంది అభిప్రాయం ఇవన్నీ ఉన్నప్పుడు ఎటువంటి చిత్రాలు తీసినా తప్పకుండా ప్రజాదరణ పొందుతాయని కొంత మంది వాదన ప్రస్తుత కాలపు నిర్మాతలలో ఘుప్పాతిక ముప్వీసం మందికి యివన్నీ సమకూర్చడం సాధ్యంకాదు గనుక, —"ఇలా అన్నీ కలిసి వచ్చినట్టయితే, ఉత్తమ చిత్రాలు వాటంతట అవే ఏర్పడిపోతాయి మా చేతుల్లో ఈ సదుపాయాలుంటే 5 నిమిషాలకి ఒక చిత్రం చొప్పున అయిదు భాషల్లోనూ తీసేస్తాం" అనే ప్రగల్భాలు కూడా వినవచ్చు

కాని వాస్తవికత మాత్రం ఈ అభిప్రాయాలని బలపరచటం మానేస్తుంటుంది!—పెట్టుబడికి వెనుదీయక,—పేద్ద పేద్ద నట బృందంతో పేరుగల నిర్మాతలూ, డైరెక్టర్లూ తయారుచేసిన చిత్రాలు కూడా తెరమీంచి త్వరత్వరగా తప్పుకోవటం, లోగడ అందరూ గమనించిన విషయమే !—దానికి తోడు, ఎవరో అనామధేయులు (ఆరోజు వరకూ), చాలీ చాలని పైకంతో, సర్వ విధాల సతమత మయి, చచ్చి చెడి పూర్తిచేసిన చిత్రం సర్వమయిన వారికీ నచ్చటం కూడా లోగడ జరిగిన సన్నివేశమే

మంచి చిత్రానికి, —మూలధనం కంటే ముఖ్యమయిన ముడిపదార్థం—"మంచి కథ" అనేది, ప్రస్తుతం చెలామణి అవుతూన్న అభిప్రాయం.

నిర్మాతలలోనూ,—వాళ్లని నిలబెట్టడమో, నిర్మూలించడమో తేల్చివేయగల ప్రేక్షకులలోనూ కూడా "మాంచి కథ" అత్యవసర మనుకోవడం అలవాటయిపోయింది అయితే ఈ "మాంచి కథ" ఏదో మాత్రం ఎవరూ తేల్చలేకుండా ఉన్నారు. చివరి వరకూ (అంటే చిత్రం పూర్తి అయి ప్రజల ముఖం చూసేవరకూను) మంచి కథకి లక్షణాలు తలకొక రీతిగా వర్ణిస్తున్నారు రోజుకో రీతిగా మార్చుకుంటున్నారు. ఏ యిద్దరి అభిప్రాయాలూ ఏకీభవించటంలేదు ఇదమిత్థమని నిర్ణయించలేక, నిద్రాభంగం పొందుతూండడం నిర్మాతలకీ, వారి అనుచరులకీ నిత్యకృత్య మయిపోయింది "మాంచి కథ" అంటే ఏమిటి అనే విషయాన్ని మరో మాంచి రోజు చూసి తర్కించదలచుకున్నాను కాని ప్రస్తుతం మంచి సినిమాకి కావలసినది "మాంచి కథ" మట్టుకేనా అని మాత్రం తర్కించదలచుకొన్నాను.

సినిమా పరిశ్రమలో 'మంచి కథ' కి ఉన్న ప్రాముఖ్యత వ్యవసాయంలో మాంచి విత్తనానికి ఉన్న ప్రాముఖ్యతతో పోల్చవచ్చు విత్తనం ఒక్కటే మంచిదయినందువల్ల ఏమీ ఉపయోగం లేదు క్షేత్రం మంచిది కావాలి అంటే ఆ విత్తనానికి అనువైనదయి ఉండాలి గాలి మంచిది కావాలి (అంటే బొంబాయి లాంటి ఫ్యాక్టరీ పొగతో కూడుకున్న గాలిలో పెరిగిన కొత్తిమీర కూడా ఎటువంటి వింత వాసన లేస్తుందో పెంచి అనుభవించిన వాళ్లకి అర్థ మవుతుంది! ) నాటిన ఋతువు మంచిది కావాలి, శీతోష్ణం సరిపోవాలి, —వర్షం సకాలంలో పడాలి అన్నిటికంటే ముఖ్యం రైతు సమర్థుడై ఉండాలి లతనికి వ్యవసాయం అంటే యిష్టం ఉండాలి ఆ పంటమీద ఉత్సాహం ఉండాలి

మంచి చిత్రానికి ఈరకపు ముడిపదార్థాలే కావాలి ఒక్క చిత్రం బాగుండగానే, —నిర్మాత సర్వ సమర్థు డనుకోవటం అనవసరం డైరెక్టరు ప్రజ్ఞ గలవా డనుకోవటం పొరబాటు తారాగణం ఏదో పొడిచేసిందనుకోవటం అజ్ఞానం అలాగే ఒక చిత్రం బాగుండకపోతే వీళ్లల్లో ఒక్కొక్కరినీ పేరు పేరు వరుసనా తిట్టడం కూడ తెలివి తక్కువే!—ఏ చిత్రమయినా సరే, బాగున్నా, బాగుండకపోయినా,—బాధ్యత ఏ ఒక్కడిదీ కాదు చిత్రనిర్మాణం సమష్టి ప్రయత్నం చిత్రం యొక్క చిట్టచివరి స్వరూపం—దాని బాగోగులు, సమష్టి కృషి యొక్క ఫలితాలు అందరికీ మనసులు కలిసి, ఉత్సాహం కలిగి ఏకదీక్షతో పని నడిచినప్పుడు ఎటువంటి కథ అయినా రసవత్తరంగా ఏదో ఒక ప్రత్యేక ఆకర్షణతో రూపొందుతుంది మంచి చిత్రానికి అత్యవసర మయినది ఐకమత్యం !!

పూర్వకాలం "ప్రభాత్ " ఫిలిం కంపెనీలో "శాంతారామ్", "ఫతేలాల్", "దామ్లే"—అందరూ కలిసి తయారుచేసిన చిత్రాలకే, ఆ రోజుల్లోనే వాహినీ సంస్థలో బి ఎన్ రెడ్డి, రామనాధ్, శేఖర్ కలిసి తీసిన చిత్రాలకే, ప్రజాదరణ విశేషంగా లభించటానికి కారణం, వారి సమష్టి ప్రయత్నాల్లో ఉన్న సమర్థత—ఒక అందమయిన చిత్రము తయారు చేయడంలో, సృష్టించడంలో తమ యావచ్ఛక్తినీ ఉపయోగించి, తమ సృష్టి తమకు సంతోషం కలిగించేలాగ చేయాలని చేసిన పరిశ్రమ యొక్క ఫలితము ఆ తరువాత వ్యాపార దృష్టితో, ఆనందం పొందటం కంటే ఆర్థిక సంపాదనమీద ఎక్కువ మోజుతో, వీరందరూ విడిపోయాక ఎవరు మట్టుకు వారు ప్రత్యేక చిత్రాలు ఎన్నెన్నో తీసినా, అందరు కృషి చేసినప్పుడు తేగలిగిన ఆకర్షణ తేలేకపోయారు ఈ క్రొత్త చిత్రాలు ప్రజలను అంతగా తృప్తిపరచలేక పోయినాయి. నిజానికి ఒక్కొక్కప్పుడు ఆ పాత చిత్రాల ఉత్కృష్టతమీద, సంపాయించుకున్న ప్రతిష్టమీదే, కొత్త చిత్రాలు అమ్మజూపి, బ్రతుకుతెరువు కలిగించుకున్నారు చాలా రోజులు

అంచేత ఏనాడయినా సరే, మంచి చిత్రాలకి కావలసినది సమష్టి ప్రయత్నం. ఒకేతరహా అభిరుచీ, సంస్కారమూ, ఆశయమూ, గలిగినవారు ఐకమత్యంతో, ఉత్సాహంతో, ఏకాగ్రతతో, పరస్పర గౌరవంతో, స్నేహభావంతో సాధించవలసిన మహత్కార్యము.

ఈ సమష్టి కృషికి దోహదం యిచ్చేది, ఉత్సాహము ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క వ్యక్తి యొక్క ఉత్సాహం, అమితమయిన ఉద్రేకంగా పరిణమించి, ఆవేశంగా ఏర్పడుతుంది ఈమూల వ్యక్తియొక్క ఆవేశం చుట్టుప్రక్కల నున్నవాళ్లందరినీ, ఉత్సాహవంతులుగా, ఉద్రేకపూరితులుగా చేస్తూంటుంది. ఈ ఉత్సాహమే చిత్రానికి జీవం

ఈ రోజున చిత్రాలు అమిత అసంతృప్తికరంగా ఉండటానికి కారణం—పనిచేసే వాళ్లల్లో ఉత్సాహము లేకపోవడం, ఆ ఉత్సాహం నిర్మాతగాని, డైరెక్టరు గాని, తమ చేతి క్రింద వాళ్లకు కల్పించలేకపోవటం

లోక ప్రఖ్యాతి తెచ్చుకున్న "సత్యజిత్ రాయ్" గారికి మొట్టమొదటి చిత్రానికి ఉన్న పెట్టుబడి, ఉత్సాహం, ఆవేశం, ఒక్కటే ఆయన చిత్రీకరించిన "పథేర్ పాంచాలి" మంచి కథ అని ఈ రోజున సినిమా నిర్మాతలలో ఎవరూ ఒప్పుకోరు కాని బాగా తీశాడని మాత్రం అందరూ ఒప్పుకోక తప్పడంలేదు "సత్యజిత్ రాయ్" కి పెట్టుబడి లేదు తారాగణం లేదు. నిజానికి సినిమా తీయడానికి కనీసావసరాలయినా ఆరోజున ఆయన దగ్గర ఉండేవికావు.

అలాగే ఇటాలియను డైరెక్టరు "విట్టోరియా డిసేకా" (బైసికిలు దొంగ చిత్రము) కూడాను ఆ చిత్రం విడుదల అయాక, ఒక రోజు తెల్లవారేటప్పటికి ఆయన ప్రపంచమంతటికీ పెద్ద డైరెక్టర్లలో లెక్క కొచ్చాడు. వెంటనే ఆయన్ని అమెరికా రప్పించుకున్నారు. "నీ యిష్టం వచ్చినంత ఖర్చు పెట్టు, నీ యిష్టం వచ్చిన కథ ఏరుకో, మా కొక్క ఫిలిం తీసిపెట్టు" అన్నారు ఏం లాభం ?—ఆయన 7, 8 నెలలు అక్కడ ఉండి పరిస్థితులు అర్థం చేసుకుని యింటి ముఖం పట్టి ఇటలీ చేరుకున్నాడు. అక్కడ ప్రబలంగా ఉన్న పెట్టుబడిదారీ విధానంలో—జమాఖర్చుల చిట్టా పుస్తకాల మధ్య, ప్రజల అభిరుచులను గురించీ, తారల పలుకుబడిని గురించీ, సంవత్సరాల తరబడిని కొలత బద్దలతో కొలిచి, త్రాసుల్లో తూచి తయారు చేసిన అంకెల కాగితాల దస్త్రాల మధ్య, శతాంశాలే శాసనం పెట్టుకొని డాలరులే దైవాలుగా పెట్టుకునే వ్యక్తుల మధ్య, హృదయం కదిలించే ఘట్టాలు తయారుచేయడం తనకు చేతనయిన

(49-వ పేజీ చూడండి)

ఈ వ్యాసంలో ప్రసిద్ధ డైరెక్టర్ శ్రీ జగన్నాథ్ సినిమా పరిశ్రమకు సంబంధించిన ఒకముఖ్య విషయం వివరంగా చర్చిస్తారు.


పంటి నొప్పి! హుఁ- అదే తనక అది నా పన్నయుంటే- ఈ పాటికి పీకించేసి వుందును
నీ పన్నవుతే ఈ పాటికి నేనూ పీకించేద్దును


ఈ చొక్కా లాగూలో నీకేదేనా ఎబ్బెట్టుగా కనిపిస్తోందా?
నువ్వే

# 'రేఖోద్యానం




ష్- ఇదుగో అమ్మడూ మాట


అల్లుడు అలకపాన్పు మీంచి లేచి వెళ్లాడు- కోపం తగ్గిందేవిఁటో-


కాదు నాన్నా- నల్లులు



నువ్ తొడుక్కున్నది కట్ బనీను - వీపుమీద చిన్న చిరుగుంది - అవునా?




హాశ్చర్యం గురూ! ఎలా డిటెక్ట్ చేసేశారు గురూ




హెహెహ్హె - దీంట్లో ఏముంది సురేశా - నువ్వు బూక్కా వేసుకోడం మరిచి పోయావు




యువరానర్ - ముద్దాయి నిర్దోషి - 1936, 38, 42, 43, 48 '51, 52, 54 సంవత్సరాల్లో జరిగిన కేసులన్నిటిలోనూ ఇతను నిర్దోషి అని కోర్టువారు ఇచ్చిన తీర్పులే ఇందుకు నిదర్శనం




ఇదుగో సర్వారావూ ఈ మినపట్టు ఇంత గట్టిగా వుందేవిటో పట్టుకుపో -
మా యిట్టు మెచ్చినట్టు దొర్లించేసి అక్కర్లేదంటే ఎలాగండి మరి




ఒహో పెసరట్టు - బాగా రోష్టు చెయించు ఉల్లిపాయొద్దు - కొస్త మిర్చి బాగా తగల్నీ మరీ మినపరొట్టెలా కాకుండా - అలాని కాయితమ్ముక్క లాగానూ చేకుండా మీడియంగా వెయ్యమను




ఓ పెసరాట్!


మళ్లీ హాల్లోకి వచ్చాకా—
ఏమండే అలా అడుగుతున్నారు మీకు మా నాన్నగారు, తెలుసా?


తెలియదు మేమిటోయ్, నువ్వు వెదుకుతున్న రావుబహద్దూర్ విశ్వనాధం ఇంటని నేనే చెప్పాన.. విశ్వనాధాన్ని నేనే..
హ్హా హ్హా హ్హా...
ఆ( మీరేనాండీ!!


ఏమోయ్ నువ్వు ఒక్కడివి వచ్చావేమిటోయ్ పెళ్ళిచూపులకి
నాన్నగారికి అనుకోకుండా అర్జంటుగా కేంపు వెళ్ళవలసి వచ్చిందండి ఈ వేళ మంచి రోజు కదా అని నన్ను ఒక్కణ్ణే చూసుకుని వచ్చేయమన్నారండి


హ్హాహ్హా హ్హా మంచిపని చేసేవోయ్ మీ నాన్న చిన్నప్పటినించి విసుప్పి అంతే అయినా నిన్న అంతమందిని అంత దర్జాగా చితకకొట్టిన వాడివి. మా అమ్మాయిని చూడ దానికి ఒంటరిగా రావడానికి భయమేముంటుందిలే?


ఇంతలో ఒక లావుపాటి అమ్మాయి కాఫీ వాటితో వస్తుంది
అరెరె! అలాగా బెదిరిపోతున్నావేమిటోయ్ హ్హహ్హహ్హ అది మా పెద్దమ్మాయ్ చిట్టి— క్రిందటేడే పెళ్ళయింది


బ్రతికాన్రా దేముడా!!!




తల్లిగర్భంలో నవమాసములు ఎదిగి, బాధపడి, బాధపెట్టి, బయటపడిన ప్రాణంతోఉన్న శిశువు వృద్ధిచూడగానే ఏడుస్తుంది ఏడవకపోయినా మంత్రసాని కౌళ్ళన లెంపకాయకొట్టి ఏడవమంటుంది

అల్లా మొట్టమొదటిసారిగా ప్రాణి ఏడుస్తాడు మళ్ళీ అల్లాగే ఆఖరిసారిగా, చనిపోయేముందు తనచుట్టూఉన్న పరివారాన్ని, బంధువుల్ని, భార్యాబిడ్డల్నిచూసి ఏడుస్తూ వెళ్ళిపోతాడు

అల్లా పుట్టుక! చావు! అయిన ఈ ముఖ్య ఘట్టాల్లో మొదలుపెట్టి అంతమైన ఏడుపు—మానవుణ్ణి—జీవితమంతకాలంలో కూడా వెన్నాడుతోనేఉంది! అందుకే మన బ్రతుకులు దుఃఖమయములు అని వేదాంతంపారంకూడా!

అలాంటి దుఃఖమయ జీవితంలో దినదినం వృద్ధి కాజొచ్చే ఏడుపులు—(అదిలేదనీ, యిదిలేదనీ ఆడపిల్ల పెళ్ళికాలేదనీ, అబ్బాయికి జీతం కట్టలేక పోయాననీ అలాంటికారు నాకులేదనీ, ఆ అమ్మాయి ఆ అబ్బాయితోటే తిరుగుతోందనీ, నిన్న యజమాని చేసింది ద్రోహమనీ, పోయిన్నెల పాతబాకీ తీర్చడానికి మంగళసూత్రం తాకట్టుపెట్టాల్సివచ్చింది అనీ, శ్యామలకు నేనంటే యిష్టంలేదనీ, సుబ్బారావు ఎక్కువ స్కోర్ చేస్తున్నాడనీ)—ఎన్నో రకాలు!

అలాంటి వివిధ రకాల ఏడ్పులను మరచిపోడానికే—మరపింపజేయడానికే—మానవుడు కృషిచేస్తూ వచ్చాడు తన జీవితకాలంలో అతను చేసిన ఆ కృషి ఫలితమే ఆనందం! ఆ ఆనందానికి ఆశ్రయమిచ్చినవె లలితకళలు!—కమ్మని సంగీతం—మధురమైన సాహిత్యము—కుంచి యించులమించే చిత్రలేఖనము—ఉలికల్పితమైన శిల్పము—రాగరస—తాళమిళిత—భావయుక్తమైన—నాట్యము వెలిశాయి

ఈ కళలు లంపడనివారు, అవి అనుభవించే ఆసక్తి సంపాదించినవారు—దుఃఖానికి దూరమవుతారు! అందుకే—అన్ని కళలు మిళితమై చదువను రాయను రానివారికి కూడా ఆనందాన్ని కలుగజేసే దృశ్య ప్రదర్శనమైనది—నాటకము!

ఈ దృశ్యప్రదర్శనమనే సమిష్టికళ అనాదిగా అనేక రూపాల్లో ఎదుగుతూవచ్చి—సినిమాగా రూపు దాల్చింది తోలుబొమ్మలు— పగటివేషాలు—వీధి భాగవతములు—వీధి నాటకములు—నాటకముల దశలలో దిశలవెళ్ళి—పరిపూర్ణతచెంది—టాకీగా—రూపు నిల్పుకొన్నది ఈ అభివృద్ధి యింకా కొనసాగుతూనే ఉంది 3—డి వైడేంగిల్, సినిమాస్కోప్ ట్రూకలర్—ఇంకా! ఇంకా!

పై చెప్పిన దశలలో నాటకందశలో ఉండగానే నాకూ, ఈ కళామతల్లికి పరిచయం కల్గింది!—

(49—వ పేజీ చూడండి)

యువ నటులలో మంచి పేరు సంపాదించుకున్న శ్రీ చలం తమను తాము పరిచయం చేసుకుంటున్నారు



జ్యోతి - శ్యామల - గులాబి - కస్తూరి. వాళ్ళిద్దరూ యిటువంటి వారనుకున్నాడు వాసు. కాని తను చివరకు తెలుసుకున్న దేమిటి?

"..చెప్పు వాసూ! నువ్వు చెప్పు ..... నేనూ ఒక మనిషిగా బ్రతకాలని కోరడం ఒక తప్పా? .... నా జీవితాన్ని నేను దిద్దుకోవాలనుకోవడం ఒక నేరమా .... ?"

అంతకుముందు ఇరవై నిముషాలనుండి హోరుమని తన బాధను వెళ్లబోసుకున్న జ్యోతి హఠాత్తుగా ఊరుకుంది. జలపాతం నిలిచిపోయినట్లనిపించింది వాసుకు. తొమ్మిదేళ్ల క్రింద—ఒకచేత్తో ముక్కు తుడుచుకుంటూ, మరొకచేత్తో పరికిణీ అంచును మెలిపెడుతూ కూచుని, "నాకు ఆ డాలర్ని ఇవ్వవూ?"—అని అడిగిన జ్యోతికీ—ఈనాడు, అనురాగంలేని ఎడారి మధ్య ఉండి కూడా, ఎండిపోవడానికి నిరాకరించి నిలిచి, తన్నూ, తన విద్యనూ, తాను ప్రతినిధిని అనుకునే నాగరికతనూ నిలదీసి ప్రశ్న వేస్తున్న జ్యోతికీ మధ్య ఎంతదూరం! ఆ క్షణాన తానొక దేవుడయి ఈ పద్దెనిమిదేళ్ల యువతి అడిగిన వరాలన్నీ యిచ్చివేయ గల్గితే?—ఈ అమాయకురాలి కోమల హృదయం మీదకు రాళ్లు విసరుతున్న రాక్షసులను చూపుతో భస్మం చేయగల్గితే?

వాసు ఆమెను చూస్తూనే ఉన్నాడు. కాని గమనించడంలేదు. ఆమె గొంతు విని ఉలిక్కిపడ్డాడు

"వాసూ! ఆనాడు—అక్కయ్య పెళ్లిలో—అరటిపళ్లున్న గదిలో నేనేడుస్తుంటే నువ్వొచ్చి కళ్లు తుడిచావు. నేను పెద్దవాడినయి నీకు బోలెడు కొనిపెడతానన్నావు— గుర్తుందా వాసూ?"

ఎందుకులేదు!

అప్పుడు అతను ఎనిమిదో తరగతి చదువుతున్నాడు. అమ్మతోబాటు శ్యామల పెళ్లికి—శ్యామల అంటే పిన్నికూతురు కూతురు, అంటే జ్యోతికి అక్కయ్య—ఆ శ్యామల పెళ్లికి తెనాలి వచ్చాడు. ఓ ప్రక్క ముహూర్తం అవుతూంది. ఆ రొదని ఆనందించలేక అలా అలా తిరుగుతున్నాడు తను. ఆ ప్రక్కగదిలోనుంచి ఎవరో ఏడుస్తున్న శబ్దం వినిపిస్తే అటు వెళ్లాడు. ఓమూల కూర్చుని ఏడుస్తుందొక అమ్మాయి. మధ్య మధ్య మాసిపోయిన పావడాతో ముక్కు తుడుచుకుంటూ వెక్కివెక్కి ఏడుస్తూంది. తను లోపలికి రావడం కూడా గమనించనట్లుంది ఆ గదిలో కొన్ని వందల అరటిపళ్లు రాసిగా పోసిఉన్నాయి. గంయ్యమంటూ సన్నటి దోమలు తిరుగుతున్నాయి. వీధిలోకి ఉన్న తూర్పువైపు కిటికీగుండా ఎండ తీక్షణంగా పడుతూంది ఆ అమ్మాయి ఏడుస్తూంది. అయ్యో పాపం అనిపించింది. దగ్గరకెళ్లి పక్కన కూచున్నాడు. ఆ అమ్మాయి ఇటు తిరిగి చూసింది.

"నువ్వెందుకు ఏడుస్తున్నావు?" అని అడిగా...

...మ్మాయి ఏడుపు మానింది, కాని వెక్కిళ్లు మాత్రం ఉండుండి వస్తున్నాయి.

"ఎందు కేడుస్తున్నావో చెప్పవూ?"

"నువ్వెవ్వరు?"—అంది ఆ అమ్మాయి.

"నేను వాసుని ......"

"అంటే నెల్లూరవ్వ అబ్బాయివా?"

(43వ పేజీ చూడండి)





## గిరీశం ప్రేమలేఖ

ఆధునిక గిరీశంగారు 'మోడ్రన్' వాణికి
రాసిన ప్రేమ లేఖ:

స్పోర్టు హైట్సులో విహరించే కైట్,
నీ సైటు నా డిలైటు
నిన్న మొన్న కానకున్న
ప్రైవేట్ రెఛడ్ ప్లైటు
మూను లేని నైటు
ఎయిమ్ లేని ఫైటు
నీ ఆర్బిట్ లో నే
నొక శాటిలైటు
ఎప్పటికో నీ చెంతకి
నా రిటర్న్ ఫ్లైట్ !
ఎలాన్! ఎలాన్! ఎలాన్!

(డి. హనుమంతరావు.)

## కుమతీ!

నిప్పెటిన అంటని చుట్టను
గటిగనాటని నస్యపుపట్టున్ రొ
ప్పట్టిన పీడని ఋణదాతను
గుట్టుగ కడతేర్చవలెను గదరా కుమతీ!

యం. రామస్వామి (ఏలూరు)

* * *

## నేస్తుడు

పుట్టుకతోం తా వెంటరాడు
పెరిగినపిదపే నేస్తుడు
ప్రతినిత్యము 'పట్టు' విడడు
పాపము! ప్రియ చుట్ట(ము) వీడు.

ఎమ్. రామస్వామి (ఏలూరు)

* * *

## హాలివుడ్ మార్కు చిత్రం

అయోమయంగారి దర్శకత్వంలో తయారవుచున్న ఒక 'హాలీవుడ్' మార్కు పిక్చర్ లో పనిచేయుటకు సమర్థుడైన సంగీత దర్శకుడు కావలెను. హిందీట్యూనులు కాపీ చెయ్యగల సమర్థత కలిగియుండవలెను. (N. B/:-అరవట్యూనులయిననూ ఫరవాలేదు.) సంగీతము ఒక్క మానవ ప్రపంచమునే గాక సకల జంతు ప్రపంచమునూ ఆనంద పర్చునట్టిదిగా యుండవలెను.

నరసింహం, సోమయాజి (రాజమండ్రి)

* * *

## మగవంటు

క॥ సెగద్రోయ చేయి కాలెను
పొగమీసలు కమిలె, విసుగుపుట్టెను వంటా
పొగ చూరిపోయె, నిక నా
మగవంటకు బిలువనొప్పమగువలనోజన్

రౌతుల సత్యనారాయణమూర్తి (పరుచూరు)

* * *

## చంద్రుని విలాపం

"ప్రేయసీ! ఏదీ చంద్రబింబం వంటి నీ ముఖారవిందం" అని ఒక హీరో హీరోయిన్ తో అనడం చూసి "ఏమిటీ! అయితే నా మొఖము సోడా బుడ్డిలాగ వుంటుందన్నమాట-ఇన్నాళ్ళూ తెలియనే తెలియదుస్మీ" అని చందమామ తనలోతాను విస్తుపోయాడట.

వి. బి. జి. శ్రీకూర్మం, (కొవ్వూరు)

* * *

## నాతి జవాబు

గీ॥ బాటవెంటజనెడు గార్దభమునుజూపి
"పోవునది నీకు జుట్టమా నే వధూటి"
యనుచు నిజసతి గేలిసేయంగజూడ
"నగునుదమవైపు చుట్టమే" యనియె
నాతి.

రౌతుల సత్యనారాయణమూర్తి (పరుచూరు)

* * *



## మూడవ బహుమతి వ్యాసం

# వివాహం జూదమా?

### టి. సుశీల

యువతీ యువకుల జీవితాలలో వివాహం ఒక ముఖ్యమగు ఘట్టము. అంతవరకు గడుపుచున్న ఒంటరి జీవితమును విడిచిపెట్టి ఇరువురూ కలిసి కష్టసుఖములను, ఒడుదుడుకులను సమముగ పంచుకొనుచు సంసార భారమును తమ భుజములపై వహింపవలసి వస్తుంది. ఈ వివాహములు అనేక రకములుగను, చిత్ర విచిత్రములుగను నేడు జరుగుచున్నవి. మన పూర్వులు కూడ వివాహమును ఎనిమిది రకములుగ విభజించిరి. వానిలో వారు చెప్పిన గాంధర్వ వివాహమును నేటి ప్రేమ వివాహమని చెప్పవచ్చును. ఈ ప్రేమ వివాహములు, పెద్దల ప్రమేయ మేమాత్రమును లేకుండ వధూవరుల ఇష్టముపై జరుగును. పురాణ కాలమున కూడ ఇవి ఉండినట్లు తెలుస్తుంది. జగత్తునకు తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులు పరస్పరము ఇష్టపడియే చేసుకొనినారు. ప్రేమించి వివాహము చేసుకొనువారికి పురాణ దంపతులేకదా ఆదర్శులు ఇక భారత కాలమునాటికి ప్రేమ వివాహములు బహుళ వ్యాప్తిలో నుండె ననుటకు ఆనాటి శకుంతలా దుష్యంతులు, నలదమయంతులు, గిరికావసురాజులు పరమ ప్రామాణికులు.

ఆధునిక కాలంలో కూడా యువతీ యువకులకు ప్రేమించి వివాహము చేసుకొనటానికి అనేక పరిస్థితులు అనుకూలించు చున్నాయి. ఇందువలన వివాహమునకు పూర్వమే ఒకరి నొకరు చక్కగ అర్థము చేసుకొను అవకాశములు చాలా ఉన్నవి. అయితే ఇట్లా ప్రేమించి చేసుకొన్నవా రందరూ, ఒకరినొకరు పూర్తిగా వివాహమునకు పూర్వమే అర్థము చేసుకొన గలుగుతున్నారా ? లేక వివాహానంతరమే, ఒకరితో నొకరు కలిసి జీవితమును గడుపు చున్నప్పుడే అర్థము చేసుకొన గలుగుతారా? అంటే ఏ విషయంలోనూ ఇది ఇలాగే జరుగుతుందని నిక్కచ్చిగా చెప్పలేము. మానవ హృదయము యొక్క అగాధములను తెలుసుకొనటం చాలా కష్టము. వారి మనస్సు, హృదయము, వారు ఎదుర్కొను పరిస్థితులు, వ్యక్తులు, వారు నివసించు పరిసరములు, వీటినిబట్టి మార్పు చెందుతూ ఉంటాయి. కాబట్టి ఒక వ్యక్తి నేడు ఆలోచించి ప్రవర్తించిన విధంగానే రేపుకూడా ప్రవర్తిస్తాడనుకోవడం సరికాదు. మానవుని మనస్సు అంతటి వైవిధ్యమును గలిగి ఉంటుంది. అందువలన ప్రేమీ ప్రేమికులు, 'మనం పరస్పరం ప్రేమించుకున్నాం కదా, మనం ఒకరి నొకరము పూర్తిగ అర్థము చేసికొన్నాము. ఇంక ఒకరిని గురించి ఒకరము తెలుసుకొనవలసినది ఏమీ లేదు అని అనుకొనుట చాలా పొరబాటు. అట్లా అనుకొంటే అది వాస్తవ ప్రపంచమును మరచిపోయి, ఊహాలోకంలో విహారం చేయటం అవుతుంది. కాకపోతే, వివాహమునకు ముందు, వారికి ఉన్న పరిచయము కొద్దీ ప్రేమీప్రేమికులు స్థూలముగ ఒకరి నొకరు అర్థము చేసుకొన గలుగుతారు. సంస్కృతి విద్య, జీవితము పట్ల గల దృక్పథము, ఆశయములు, అభిప్రాయములు, ఉద్దేశ్యములు, లక్ష్యములు, వీని విషయమై ఇరువురకు ఏకాభిప్రాయము ఉన్నదో లేదో తెలిసికొని, తాము జంటగా జీవితమును గడపగలరా, లేదా అను విషయములను చక్కగ అర్థము చేసుకొను అవకాశము ఉన్నది. అంతేకాని చిన్న చిన్న విషయముల దగ్గర నుంచి, ప్రతిదీ అర్థం చేసుకొన గలుగుతారంటే అసహజము. ఎందుకంటే ఒక మనిషిని ఒక మనిషి అలా ఎప్పటికీ అర్థం చేసుకొనలేరు. కొన్ని సంవత్సరములపాటు కలిసి ఉన్నప్పటికీ కొన్ని విషయములలో ఒకరి కొకరు క్రొత్తగానే ఉన్న వ్యక్తులను మనము చూస్తూనే ఉన్నాము కదా !

కాబట్టి వధూవరులు వివాహమునకు పిమ్మటనే ఒకరి నొకరు పూర్తిగా అర్థం చేసుకొన గలుగుతారని మనం ఒప్పుకోవాలి. కాని ఇలా అన్నంత మాత్రంచేత "వివాహం ఒక రకమైన జూదమవుతుంది, అదృష్టం ఉంటే వారు ఒకరి నొకరు అర్థం చేసుకుంటారు. లేకపోతే అధోగతి పాలై పోతారు" అని అనుకోటానికి వీలులేదు. జూదమయితే, ఆడటము వరకే మన చేతిలో ఉంటుంది. ఫలితము యొక్క నిర్ణయమును మనము చేయలేము. ఈరోజు అదే జూదమును ఆడితే, ఫలితము ఒకలాగ ఉంటుంది. అదే మళ్లీ రేపాడితే, వేరొకలాగ ఉంటుంది. దేనివలన అలా జరుగుతుందంటే మనం చెప్పలేము. అందులో మనము ప్రయత్నపూర్వకముగ చేయగలిగిన దేమీ లేదు.

ఇక, వివాహము విషయంలో ప్రేమించి చేసుకొన్నా, పెద్దలు అనుమతిపై చేసుకొన్నా వైవాహిక జీవితమును సుఖప్రదంగా చేసుకొనడం వధూవరుల ఇద్దరి చేతులలోను ఉంటుంది. 'భర్త ఎలాగైనా ఉండవచ్చును, గృహజీవితమును సుఖమయంగా చేసే బాధ్యత ఒక్క భార్యదే అనుకొంటే ఆ సంసారంలో సుఖ శాంతు లుండవు. గృహజీవితమును శాంతిమయంగా చేసుకొనడంలో ఇద్దరికీ సమమైన పూచీ ఉన్నది భార్య కదా అని ఆమె తనయొక్క ప్రతి పనీ చేయాలి, ప్రతిదీ తనకు తెచ్చి అందించాలి, అనే అహం భావం భర్తలో ఉండరాదు. నిజంగా ప్రేమించిన నాడు ఆతడు చెప్పకుండానే ఆ పనులన్నీ జరిగిపోతుంటాయి. నిజమైన ప్రేమ ఉన్నచోట 'ఒకరు చేస్తున్నారు, ఇంకొకరు చేయించుకొంటున్నారు' అనే భావనే ఉండదు. ఇద్దరూ సర్దుకుపోతే చిక్కులు రావు.

(43-వ పేజీ చూడండి)









దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

-11-1961 శుక్రవారము మొదలు

-11-1961 గురువారము వరకు

### షం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం అన్ని విషయాలలోనూ సుఖంగా టుంది. పైసా ఖర్చు లేకుండా గౌరవం ందగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో రావలసిన ర్తలు ఆలస్యంగా వస్తవి. కాని, అందువల్ల ందు ముందు లాభం పొందగలుగుతారు. క్కువ విలువగల వస్తువులమీద డబ్బు పెట్టు డి పెట్టవలసి వస్తుంది. లోగడ మీ మాటను దని ఎదిరించినవారే ప్రస్తుతం మిమ్ములను నుసరిస్తారు. ప్రయాణాల మూలంగా శరీరం డలిక చేస్తుంది. మధ్యవర్తిత్వం వహించి ్యయం చెప్పవలసిన చోట నిర్మొహమాటంగా వర్తించి మీ అంతస్తును కాపాడుకొన గలుగు రు. దుబారా ఖర్చులను తగ్గించుకొనటానికి యత్నించటం అవసరం. పుణ్య కార్యాలలో ల్గొంటారు. 10, 11 తేదిలలో నిరుత్సాహం, నవ్యయం.

*   *   *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఒకరి మాటను లక్ష్యపెట్టకుండా అవకాశం ఉన్నంతవరకు మీ కర్తవ్యాన్ని మీరు నెరవేర్చు కుంటూ ఉంటారు. అయితే మసిపూసి మారేడు కాయను చేసే రకం మనుష్యులు అప్పుడప్పుడు తటస్థపడుతూ ఉంటారు. జాగ్రత్తగా ఉండండి. సంఘ కార్యాలలో విశేషంగా ప్రమేయం పెట్టుకో

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో రాహువు తులలో బుధ శుక్రులు, తులా వృశ్చికాలలో సూర్యుడు, వృశ్చికంలో అంగారకుడు, మకరంలో గురు శని కేతువులు. వృశ్చిక ధనుర్మకర కుంభాలలో చంద్రుడు.

తగిన సమయంకాదు. వృత్తిలో ఆదాయం నిమిత్తం మాత్రమే కాకుండా కొంతవరకు గౌరవార్థంగా కూడా శ్రమపడవలసి వస్తుంది. కుటుంబంలో సాధారణంగా అభిప్రాయ భేదాలు, అశాంతీ కనిపిస్తూ ఉంటవి. కాని అందువల్ల ఏవిధంగానూ ఇబ్బంది ఉండదు. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు బాగానే ఉంటవి. కాని, అవసరానికి ఆదుకునేవారు తక్కువ. దైవబలం బాగున్న ఈ సమయంలో అన్ని సమస్యలు వాటంతట అవే పరిష్కారం అయి ప్రశాంతత లభిస్తుంది. 12, 13 తేదులలో సంచారం, ధనాదాయ వృద్ధి, తీరని ఆలోచనలు.

*   *   *

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

సమయానికి తగినట్లు యోచించి నడుచుకో గలుగుతారు మీ తోటివారికి మీయందు అసూయా భావం ఏర్పడినట్లు తెలుస్తుంది. అయితే అంత మాత్రంచేత జరిగేది కూడా ఏమీ ఉండదు. శక్తివంచన లేకుండా శ్రమపడి నలుగురికి ఉపకారం చేయగలుగుతారు. ఒకటి రెండు సందర్భాలలో ఇతరులకు చెప్పిన మాటను తప్పుకొనవలసి వస్తుంది. అంతమాత్రంచేత ఎవ్వరికీ ఏవిధంగానూ అపకారం జరుగదు. కుటుంబంలో జరిగే కార్యక్రమాలలోనూ, అటు వ్యవహార వ్యాపారాదులలో కూడా ప్రతి పనీ జ్ఞాపకం పెట్టుకుని జాగ్రత్తగా నెరవేర్చుకో గలుగుతారు.. ఆదాయం సంతృప్తికరంగా ఉంటుంది. బంధువులవద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి. ఇతరుల మెప్పు కోసం అనవసర విషయాలలో జోక్యం పెట్టుకో వద్దు. 14, 15 లలో వస్తువులు పోగొట్టుకొనటం, వృథా కలహాలు, ప్రయోజనంలేని శ్రమ.

*   *   *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మానసికంగా అసంతృప్తి పడుతూ జరుగవలసిన దానిని జరుపుకొంటూ పోతారు. ఎదటివారికి సమాధానంచెప్పి ఒప్పించవలసిన భారం పైన పడుతుంది. కాని, తలవనితలంపుగా చిక్కు విడిపోతుంది. వృత్తి ఉద్యోగాలలో ఇంతకుముందు కన్నా శాంతి, ఆర్థికంగా అభివృద్ధీ కనుపిస్తవి. కుటుంబంలో కూడా అన్నివిధాలా సంతృప్తికరంగా ఉరటుంది. క్రొత్త ప్రయత్నాలు మాత్రం ఏవీ అనుకూలించవు. అవతలివారి మనస్తత్వాన్ని అనుసరించి ప్రసంగం పెరుగకుండా జాగ్రత్తపడుతూ ఉండటం అవసరం. వ్యవహార రంగంలో ఏ పనీ జరుగకపోయినా తొందరపడవద్దు. బంధువుల మూలంగా ఖర్చులు అధికం అవుతవి స్థిరాస్తులు కొనే ప్రయత్నాలు, కాంట్రాక్టు వ్యవహారాలు అనుకూలించకపోవచ్చు. 15, 16 లలో డబ్బు చిక్కు, కష్టవార్త.

*   *   *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉన్నది మీ మాటకు మీ పనికి అభ్యంతరం ఉండదు మీకు కూడా ఇంతకుముందు వస్తున్న సందేహాలు తీరిపోతవి. ప్రశాంతంగా ఉందామనుకున్నా స్నేహితులు

పూర్తికోలేయరు. వాహనాలు, యంత్ర సంబంధమైన పరికరాలు కొనటానికి అనుకూలమైన సమయం తరచూ ఏదో ఒక క్రొత్త వ్యవహారం పైన వేసుకొంటూ విశ్రాంతిలేకుండా పనిచేస్తూ ఉంటారు. ఆదాయం విపరీతంగా పెరగకపోయినా కార్యక్రమాలను మార్చుకోవలసిన అవసరం ఉండదు. దైవిక, పుణ్యకార్యాలయందు ఆసక్తి, పాల్గొనే అవకాశం లభిస్తుంది మీరు చేయలేకపోయిన పనులను గురించి మొదట్లో విచారం తోచినా, నిదానంగా అదీ మీ మంచికే నసే విషయం తెలుసుకుంటారు. 14, 15 తేదులలో దేహశ్రమ, ధనలాభం, సంఘంలో గౌరవం.

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

మీ ఓర్పుకు తగినట్లు దైవానుగ్రహం కూడా కలసివస్తుంది. అన్ని రకాల మనుష్యులతోనూ వారికి తగినట్లు మాట్లాడి మన్నన పొందగలుగుతారు. అధికారము, ఆదాయము బాగుంటవి. మానసికంగా ధైర్యము, అందుకు తోడు మంచి పేరు పొందతగిన అవకాశము లభిస్తవి. కుటుంబంలో కూడా విలాస వినోదాలతో సుఖంగా ఉంటుంది. మీరు చెప్పే సలహా అందరికీ అనుకూలిస్తుంది. ఇంతకుముందు ఖర్చులు విపరీతంగా పెరగటంవల్ల కలిగిన చింత చాలావరకు తగ్గిపోతుంది. ఇతరులకు సంబంధించిన పనులలో ప్రవేశించటంవల్ల మనస్పర్థలు రాకుండా చూచుకొనండి. ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నటువంటి లావాదేవీలలో తగినంత ఫలితం ఉండకపోవచ్చు. 13, 14 లలో క్రొత్తవారితో స్నేహం, బంధువుల రాక, శ్రమ అధికం.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

మీవరకు మీరు ప్రశాంతంగా ఉండటానికి అనువైన సమయం. ఏ విషయంలోనూ ఇతరుల జోక్యము, నిష్ఠురాలూ లేకుండా మీ అవకాశం కొలదీ పనులు జరుపుకొన గలుగుతారు. డబ్బు చిక్కు నుంచి బయటపడ గలుగుతారు. మీ బుద్ధిబలంతో పదిమందిని ఆకర్షించి మీ కార్యం చక్కబరుచుకొంటారు. సౌఖ్యం నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. నూతనంగా డబ్బు వినియోగించి ఏపని చేదామన్నా మనస్సుకు సంపూర్ణంగా ఉత్సాహం కలుగదు. అవకాశాలు కూడా వెనుకకు పోతవి. శుభకార్యాలలో పాల్గొంటారు. ఆదాయంలో చెప్పుకోతగిన మార్పులు ఏమీ కనుపించవు. 12, 13 లలో సభా గౌరవం, బంధుదర్శనం. ఇష్టవస్తుప్రాప్తి.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ముందు చేసిన దానికి ఫలితం కనుపించకపోయినా ఇంకా ఏమో చేదామనే ఆశ మాత్రం కలుగుతూ ఉంటుంది. మీరు న్యాయం చెప్పినా అవతలివారు వినిపించుకోక పోవచ్చు. వృత్తి ఉద్యోగాలలో చాలా ఉత్సాహంతో పనిచేస్తారు. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఈ సమయంలో మీరు ఏపని చేసినా ఆరంభంలో కనుపించినంత ఆడంబరము, హడావుడి తరువాత కనుపించవు. బంధువులవద్ద నుంచి వచ్చే వార్తలు ముందు ముందు ప్రయోజనకరంగా ఉంటవి. మీ క్రింద పని చేసేవారితో మృదువుగా మెలగవలసిన సమయం. 11, 12 లలో ధనలాభం, కుటుంబంలో శుభకార్యాలు, అధికారులతో స్నేహం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఈ సమయంలో మీరు అనుసరించే పద్ధతి చూచేవారికి విపరీతంగా తోస్తుంది. పట్టుదలలు పెరగకుండా కొనసాగించుకొనటం అవసరం. సమయానికి ఏదోవిధంగా ధనసహాయం లభిస్తుండటంవల్ల మీరు తలపెట్టిన పనులు నిరాటంకంగా జరుగుతవి. మీ ఆరోగ్యం సరిగా ఉండదు. వృత్తిలో మీ మాటకు భంగం వస్తుందేమోననే భావం తోస్తుంది. లాటరీ, చట్టా వ్యాపారం వంటి పనులలో ప్రవేశించతగిన సమయం కాదు. కుటుంబంలో ఎప్పుడు ఏది చేదామనుకున్నా ఆటంకాలు వస్తూవుంటవి. బాహ్య విషయాలలో గౌరవం దక్కుతుంది. వారం రెండవ భాగంలో ధనాదాయం బాగుంటుంది. 10, 11 తేదులలో ఆందోళనకరమైన వార్తలు, ధర్మ కార్యాలకు ఆటంకం.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

పరిస్థితులు మామూలుగానే ఉండటవి. కాని, మనస్సులో ఏదో పోగొట్టుకొన్నట్లు బాధపడుతూ ఉంటారు. ఆరోగ్యము, ఆదాయము సంతృప్తికరంగా ఉంటవి. అధికారులవల్ల అనుకూలం పొందతగిన సమయం. బంధువులవద్ద నుంచి సహాయం లభిస్తుంది. స్నేహితులలో ఒకరిద్దరు వ్యతిరేకంగా పనిచేస్తున్నారనే విషయం తెలుస్తుంది. కాని, ఏమీ ఎరగనట్లు నిగ్రహంతో ఉండటం అవసరం. వృత్తి ఉద్యోగాలలో శక్తికి మించిన శ్రమ చేయగలుగుతారు. కుటుంబంలో ఏవిధమైన ఒడుదుడుకులు లేకుండా ప్రశాంతంగా ఉంటుంది. 15, 16 తేదులలో వ్యవహార జయం. తలవనితలంపుగా ధనాదాయం.

* * *

## ఈ వారము ధరలు

బంగారు, వెండి ధరలలో తాత్కాలికంగా మందీ లక్షణాలు వస్తవి. ధాన్యం ధర పెరుగుతుంది. కాని,నిలకడగా ఉండకపోవచ్చు. గోధుమ ధర క్రమంగా తేజీఅవుతుంది. నూలు, నూలు వస్త్రాల ధరలు గతవారం కన్నా తగ్గే సూచనలున్నవి. నూవులధర పెరిగి తగ్గుతుంది. నూవులనూనె ధర గతవారంవలెనే ఉంటుంది. వేరుశనగపప్పు ధర బాగా పెరగవచ్చు. మినుములకు గిరాకి వస్తుంది. సువాసన ద్రవ్యాలకు, విలాస వస్తువులకు ధరలు కొద్దిగా తగ్గవచ్చు.

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

క్షణం తీరుబాటు ఉండదు. ఏ ఒక్క కార్యమూ సంపూర్తిగా నెరవేరిందనే సంతృప్తి తోచదు. ఆదాయం అనుకున్నదాని కంటే అధికంగానే ఉంటుంది. "అందితే జుట్టు, అందకపోతే కాళ్లు" పట్టుకునే రకం మనుష్యులతో లావాదేవీలు జరపడం శ్రమ అవుతుంది. గ్రహబలం వల్ల మీ అంతస్తుకు భంగం రాకుండా జాగ్రత్తపడ గలుగుతారు. తోటివారు చేసిన పొరపాట్లను సర్దుబాటు చేసి ఉపకారం చేయవలసి వస్తుంది. ముందు ఏదీ ఒక నిర్ణయం అనేది లేకుండా ఏ పనిలోను దిగవద్దు. మీ దినసరి కార్యక్రమాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి. ఎవరు ఏమి చెప్పినా శక్తికిమించిన భారం పెట్టుకోవద్దు. 13, 14 తేదులలో వృథా ఖర్చు, త్రిప్పట, అపవాదులు రావచ్చుననే ఆందోళన.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

పైన పెట్టుకున్న భారాన్ని చల్లగా నెరవేర్చి మాట రాకుండా కాపాడుకో గలుగుతారు. డబ్బు ధారాళంగా వచ్చి అనుకున్న పనులు సకాలంలో జరుగుతవి. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. పైమెరుగు మాటలను నమ్మి క్రొత్తవారితో వ్యాపార, ధన సంబంధమైన లావాదేవీలు పెట్టుకోవద్దు. ఈ సమయంలో సంఘ కార్యాలలో అంతగా ఉత్సాహం చూపలేకపోతారు. చాలా రోజులకు ముందు ప్రయత్నించి విరమించుకున్న పనులు తిరిగి ఆరంభించవలసి వస్తుంది. మిమ్ములను ఆశ్రయించి వచ్చేవారిని ఆదరించి సహాయం చేయగలుగుతారు. ప్రయాణాలకు విఘ్నాలు రాగల సూచనలున్నవి. 10, 11, 12 తేదులలో కార్యసిద్ధి, పండితులతో సమావేశం. ★

# ఎలక్షన్ కి నిలిచి చూడు, మంత్రిగిరీ తలిచి చూడు!

నిర్మాత: బాపు

ఈ ఆటకు కనీసం ఇద్దరుండాలి; ఆపైన మీ ఇష్టం. రెండు గ్రూపులు. ఇద్దరు ప్రతినిధుల ద్వారాకూడా ఆడించవచ్చు. గవ్వలతోగాని, పాచికలతో గాని పందెం వెయ్యాలి. ఎంతపడితే అన్ని గళ్లు పావును నడపాలి. తొలి పందెం ఆరుపడితే తప్ప ఆటలో ప్రవేశించే అర్హత ఉండదు. ఆపైన, ఈ క్రిందినియమ నిబంధనల ప్రకారం పావును నడపాలి. ఆడి, లేదా ఓడి చూడండి. లేదా చూడండి. లేపోతే చదవండి. వినోదమే కావలసింది. రాజకీయ రంగంలో ఉన్నదీ అదే.

## ఎలక్షను గేము: నియమ నిబంధనలు

1. రంగంమీది కొచ్చారన్నమాట. పరుగందుకుందికి సిద్ధంగా ఉండండి. పోతూ పోతూ పక్కవాడినో తాపు తంతే మరీ మంచిది; ఇటు మీకు మరింత ఊపూ, అటు పోటీదారుకో తోపూను.
2. డామిట్! శకునం అద్భుతంగా ఉన్నట్టు లేదే! ఆట బయటి కెళ్లిపోండి. మళ్లీ పందెం 6 పడితే తప్ప ఆటలోకి ప్రవేశం లభించదు. సారీ.
3. వండర్‌ఫుల్. మీతోటివాళ్ళంతా ఏకమై మిమ్మల్ని నాయకుడిగా పైకెగసం దోశారు. ఇంతకన్నా అదృష్టం ఏముంది. 6 వ గడిలో ఆయన చెయ్యందిస్తున్నాడు. అక్కడికి వెళ్లిపోండి.
4. ఎలక్షన్లో నిలబడతానని మీరు సరదా పడితే, డబ్బుగల మీ మిత్రుడు నిలబెడతానని మాట ఇచ్చాడు. కళ్లెం వేస్తాడు కాబట్టి, అవసరం తీరాక తప్పించుకుందికి కత్తిర అట్టే పెట్టుకోండి. ఒక గడి ముందుకుపోండి.
5. కొంచెం జాగ్రత్త. మీ అంత గొప్పవాడు (దాదాపుగా లెండి) మరొకడు తయారయ్యాడు —మీ మిత్రుడిని వల్లో వేసుకుందికి. ఓ ఛాన్సు వదలుకుని అతన్ని (వరి) మార్చండి.
6. (ఉప) గ్రహబలం అనుకూలంగా ఉంది. ఇంకో ఛాన్సు తీసుకుని పెద్ద గ్రహాలవేపు వెళ్ళడానికి కృషి చెయ్యండి. పేపరువాళ్ళకు తెలీనీకండి.
7. మంతనాలకు భేటీ ఏర్పాటయింది. జాగ్రత్త.
8. ఎవరికో సన్మానంట. ఆయన రాలేదు. దారే పోతున్న మిమ్మల్ని పట్టుకు కూర్చోబెట్టి మీకు చేసేశారు సన్మానం. ఏం చేస్తాం. ఓ ఛాన్సు వదులుకోండి. పబ్లిసిటీ గిడుతుందిగా.
9. ముందున్నవన్నీ గండాలు. కాస్త చూసి మరీ అడుగెయ్యాలి. కావలిస్తే, ధైర్యం ఉంటే ఇంకో ఛాన్సు తీసుకోండి, లేపోతే కాస్త రెస్టు తీసుకోండి.
10. గుడ్! పడండి ముందుకు. ఇంకో ఛాన్సు.
11. పార్టీ నాయకుడు మీ విజాయితీ పరీక్షించడం కోసం, తనకి శత్రువర్గం ఉన్నట్టూ, అదొక గ్రూపు అయినట్టూ ఏర్పాటు చేశాడు. మీరు తెలీక అందులో చేరారు. ఐదేళ్ళ అజ్ఞాతవాసం చెయ్యమని నాయకుడు శపించాడు మిమ్మల్ని. శిరసావహించండి. మళ్ళీ ఆరు పందెం పడితే తప్ప మీకు విముక్తి లేదు; అది పడితే అప్పుడు ఇంకో పందెం ఆడి ఎంత అయితే అన్ని గళ్ళు ముందుకు జరగాలి.
12. తప్పటడుగు వేశారు. అరటిపండు తొక్కలాటి మాటమీద కాలేసి జారారు. మళ్లీ 9 కి వెళ్లి ప్రదక్షిణం చేసుకురండి. మళ్లీ ఇందులోకొస్తే మళ్లీ 9 కి వెళ్లవలసిందే.
13. సెబాష్. అదీ పద్ధతి. ఇంకో ఛాన్సు తీసుకోండి.
14. పార్టీ లక్ష్యాల గురించి, కార్యక్రమం గురించి ఏదో మాట్లాడారు. పత్రికలన్నీ వ్యంగ్య వ్యాసాలూ, కార్టూన్లు వేశాయి. పార్టీలో తిట్లు తింటేనేంగాక యమ పబ్లిసిటీ. రెండు రెండు గళ్ళు ముందరకెళ్ళండి—నాయకుడు కావలసినవారు.
15. ఎలక్షనుకి పార్టీ టిక్కెట్లిస్తున్నారు, రద్దీ ఎక్కువగా ఉంది. ఓ ఛాన్సు వదులుకుని తిప్పలు పడండి.
16. టిక్కెట్టు మీకు దొరికింది. అద్భుతం! ఇంకో ఛాన్సు తీసుకోండి.
17. నామినేషను వడేశారు. ఇక జోరుగా నడవాలి—
18. గు—లాబీవర్గాల సలహా విని ఇందులోకి తప్పటడుగు వేశారు. నిందలూ, నిష్ఠురాలూ వచ్చి పడ్డాయి. బాణం చూపించిన దారిలో అణిగి మణిగి పడి, వంగి లొంగి నడుచుకు బయట పడండి. ఈ ఐదుగళ్ళు ఒక్క పందెంతో దాటరాదు. ఒకటి పందెం పడితేనే ఒక గడి దాటడం. ఆ చివర్నించి 22 వ గడిలోకి వెళ్లచ్చు.
19. పద్దెనిమిదవ గడి గండం గడిచినందుకు బ్రహ్మాండమైన సన్మానం జరుగుతుంది మీకు. ఓ ఛాన్సు వదులుకోండి.
20. పైకి రాదలుచుకున్నవాడు పబ్లికున వీలైనంత తక్కువ మాటాడితే అంత మంచిది, సన్మాన సభలో మరీను. కాని అనుభవం ఉండదు కాబట్టి ఆ సంగతి తెలీదు. మీరు అలా మితి దాటి ఎందుకు అవాకులూ, చెవాకులూ మాట్లాడారు ? అందువల్లనే కదా, కాలికింద ఉన్న గోతిలో పడిపోయారు. ఈ సన్నటి ఇన్నటి దారిలో ఒక్కొక్క అడుగు వేస్తూ ప్రయాణించండి. పందెం ఒకటి మాత్రమే పడాలి.
21. నామినేషన్‌లకి ఆఖరుతేదీ రేపనగా ఇవాళ్ళ ఓ గొప్పవాడికి, మీరు నిలబడబోతున్న ఏసెంబ్లీ నియోజకవర్గం కావాల్సి వచ్చింది. మీది లాక్కుని వారి కిచ్చారు. 1 ఛాన్సు వదులుకుని ఇంకో చోటు నుండి గాని, ఇంకో సభగ్గాని సీటుకి తిప్పలు పడండి.
22. మీ నామినేషను ఆమోదించారు. అందువల్ల పార్టీ లక్ష్యాలు ఏవిటో తెలీకపోయినా, వాటి మీద గురి కుదిరింది. కాబట్టి రెండు గళ్ళు ముందుకు వెళ్లండి. (24 కు)
23. మీ నియోజకవర్గంలో మీతోబాటు మరిద్దరు అభ్యర్థులు పోటీ చేస్తున్నారు. ప్రయోగిలు ఫైటు. ఒక ఛాన్సు వదులుకుని, వారిలో ఏ ఒకరైనా తగ్గుతారేమో కనుక్కోండి.
24. గుడ్‌లక్. ప్రచారం ఆరంభించండి.... అరె. మీ మీటింగు కొచ్చిన జనం అంతా అమాంతం లేచి పరుగెడుతున్నారే !—మీతో పోటీచేసే ఆయన తన సభకి సినిమాతారల్ని తీసుకొచ్చాడా? ఇంకేం. వో ఛాన్సు వదులుకుని మీరూ వెళ్లి చూసిరండి.
25. మీ ప్రచారంలో కొత్త తమాషాలు చెయ్యడానికి కొత్త పెట్టుబడి తగిలి కలిసొచ్చింది. రెండు గళ్ళు ముందుకు జరగండి. (ఈ దారిన 27 కు వెళ్తే అక్కడి సూత్రం మీకు వర్తించదు).
26. వుండర్‌ఫుల్. ఆశ్చర్యం. అద్భుతం. మీ పార్టీ లక్ష్యం లేమిటో, సూత్రా లేమిటో మీకన్నీ తెలిసిపోయాయి. వో ఛాన్సు మానుకుని ఉత్సాహంగా వెళ్లి నలుగుర్నీ—పార్టీ నాయకుడితో సహా— కేకేసి వాళ్లకి ఎదురు బోధపరచండి. ఆఖరివాడు పారిపోయే వరకూ.
27. ప్రతవ్యకాలు జరుగుతున్నాయి—మొహెంజొదారో శిథిలాలు కానవస్తుంది మీ భవిష్యత్తు! పునాదులో సమాధిలో నవ నీలివార్త. రెండు గళ్ళు వెనక్కి (25కు) వెళ్ళిపోండి అక్కడ డబ్బుంటుంది కాబట్టి మళ్లీ వద్దురు గాని
28. హమ్మయ్య! ప్రయోగిలు ఫైటుకి నిలబడ్డ మీ ముగ్గురిలోనూ ఒకడు (మీరుకాదులెండి) హఠాత్తుగా పోటీ విరమించుకున్నాడు. మీరు గెలవకపోయినా, ధరావత్తైనా దక్కవచ్చు. పోటీ ఇద్దరికే కాబట్టి ఇంకో ఛాన్సు తీసుకోండి.
29. ప్రచారం ముమ్మరంగా సాగుతుండగా పేచీ వచ్చి, మీ వర్గంలో చీలిక ఏర్పడి, గిట్టనివాళ్ళ గ్రూపు ప్రచారం మొదలెట్టింది. దిగువకి జారి పడిపోయారు. 28 కి వెళ్ళిపోండి. ఇలా 29లోకి వచ్చినప్పుడల్లా జారి వెనక్కిపోకతప్పదు.
30. మీ పార్టీ అంతా ఎన్నికలు గెలిస్తే గెలిస్తే, మీలో ఎవరెవరికి మంత్రిగిరీలు ఇవ్వాలన్న దానిపై లభ్యప్ప మంతనాలు జరుగుతున్నాయి. గ్రూపులవారీగా ఛాన్సు మీదాకా వచ్చేనా ? కాని ఈసారి మంత్రివర్గంలో 227 స్థానాలు ఉంటాయని చెప్పుకుంటున్నారు మరి.
31. కంగ్రాచ్యులేషన్స్ మీరు గెలుస్తారని మేము మొదట్నుంచీ చెబుతూనే వస్తున్నాం గదా. మీకు టికెట్టిచ్చిన దేవుడి నెన్నోసార్లు ప్రార్థించాం మరి మాసంగతి మరచిపోకండి. ఫర్వాలేదు, పోదాం పైపైకి
32. అయ్యారుగా మంత్రి ! అనుభవించండి. ★

(పేజీ తిప్పండి)

# వివాహం జూదమా?

(35-వ పేజీ తరువాయి)

ఇంకొక విషయం. భార్యాభర్తలిరువురు తమ తమ అభిప్రాయములను వెలిబుచ్చుటకు ఆచరణలో పెట్టుకొనడానికి, ఒకరి కొకరు కొంత స్వేచ్ఛను ఇచ్చుకోవాలి. భార్యకాని, భర్తకాని, ప్రతి చిన్న విషయంలో జోక్యం కలిగించుకుంటూ ఉంటే ఎంతటి ఓర్పు గలవారికైనా చికాకు కలిగిస్తుంది. ఇద్దరూ ఎప్పుడూ సంతోషంగా ఉండటానికి ప్రయత్నిస్తూ, చిరునవ్వుతో పలకరించుకొంటే తమ కష్టములను మరచిపోతారు. ఇద్దరూ కూడా ఇట్లు ఒకరి సుఖము కొరకు ఒకరు సహకరిస్తూ త్యాగము పరస్పరసానుభూతి, దయ, క్షమ మొదలగు గుణాలు అలవర్చుకొని ఒకరి కొకరు జీవించిననాడు ఆ జీవితం స్వర్గతుల్యమే అవుతుంది. కాబట్టి జూదములో వలె కాక, జీవితమును స్వర్గతుల్యముగా చేసికొనడం మన చేతులలోనే ఉంది. మనం సుఖప్రదంగా చేసుకోవాలంటే జీవితము సుఖముగానే గడిచిపోతుంది. అయితే ఇది ఇద్దరి చేతులలోను ఉంటుంది.

దీనికి ప్రతిగా వివాహానంతరమే ఒకరినొకరు పూర్తిగ అర్థం చేసుకొన గలుగుతారంటే ఒకవేళ ఒకరినొకరు సరిగ అర్థం చేసుకొనకపోయినా, లేక అపార్థము చేసుకొన్నా వారి జీవితములు దుఃఖమయములు అగునని చెప్పవచ్చును. కాని నిజముగా పరస్పరము ప్రేమ కలిగినవారు ఇట్లు అపార్థము చేసికొను అవకాశము ఉండదు. పైన చెప్పినట్లు స్థూలముగ ముఖ్యమగు విషయములలో ఏకాభిప్రాయము కుదిరి అర్థం చేసుకొన్ననాడు చిన్న చిన్న విషయములలో సర్దుకుపోతూ అర్థము చేసుకొనుట ఒక పెద్ద లెక్కలోనికి రాదు. అది చాలా చిన్న విషయము. ఒకవేళ చిన్న విషయములలో అభిప్రాయ భేదములు వచ్చినప్పుడు ఇద్దరిలో ఏ ఒక్కరుగాని ఓర్పుతో పోయినచో లేక ఒకరికి పట్టుదలగా నున్నప్పుడు మరొకరు సర్దుకుపోయే పద్ధతిని అవలంబించినట్లయితే ఏవిధమయిన చిక్కులు లేకుండ జరిగిపోతుంది.

అట్లా సర్దుకుపోవటం మన చేతిలోనే ఉంది. మన నిశ్చయముపైననే మన జీవిత ఫలితము ఆధారపడి వున్నది. మనము ఆలోచనాపూర్వకముగ ప్రయత్నముచేసి జీవితమును సుఖవంతముగ చేసికొనవచ్చును. కాబట్టి వివాహము కేవలము జూదము వంటిదని అనలేము. 

# వాళ్లు ఇద్దరు

(33-వ పేజీ తరువాయి)

"అవును. మాది నెల్లూరే!"

"ఇక్కడికెందు కొచ్చావ్ ?"

"నువ్వెందు కేడుస్తున్నావ్ ?"

"నేనేడిస్తే నీకేం—"

ఏం జవాబు చెప్పాలో తెలియలేదు తనకు. ఆ అమ్మాయి తనవైపు చూడ్డం మానేసి ఎండలోకి చేతులుజాపి వాటిని చూస్తూ కూచుంది.

"నీకు లడ్లు తెచ్చిపెడతాను. ఏం—నువ్వు ఏడవకూ—" అన్నాడు తను.

ఆ అమ్మాయి తల అడ్డంగా ఊపింది—" నాకు లడ్డేం అక్కర్లేదు .... నువ్వే తిను ! .... నేను ఏడుస్తున్నది అందుకోసం కాదు—"

"మరెందుకు ?"

"అక్కయ్య పెళ్లికి నాకో తెల్ల పట్టు పరికిణ కుట్టించమని అడిగితే మా అవ్వ నన్ను కొట్టింది..... "

తను సలహా యిచ్చాడు—"వెళ్లి మీ అమ్మతో చెప్పరాదూ ?"

"మా అమ్మ లేదు. చచ్చిపోయింది—"

ఎవరయినా అమ్మలేకుండా ఎలా ఉంటారో! తనకు ఆశ్చర్యం వేసింది.

"మానాన్న ఇంకో పెళ్లి చేసుకున్నాట్ట. శ్రీకాకుళంలో ఉన్నాడు."

"ఇప్పు డిక్కడ లేడూ ?"

"ఆయన ఎప్పుడూ ఇక్కడికి రాడుట. మేమంటే ఆయన కిష్టంలేదుట.—అని అవ్వ చెప్పింది."

నాన్నకు ఇష్టంలేకపోవడం అంటే ఏవిటో ? నాన్నకు తనంటే ఎంత ఇష్టమో—తనూ అమ్మా ఈ పెళ్లి కొచ్చేస్తుంటే తనకో పెద్ద చాకలెట్ల పొట్లం కొనిపెట్టాడు నాన్న. ఈ అమ్మాయి నాన్న అలా కొనిపెట్టడు కాబోలు—పాపం !

ఆ అమ్మాయి భుజంమీద చెయ్యివేసి చెప్పాడు... "ఇదుగో చూడూ ! నువ్వేమీ భయపడకు ! ఇంకొన్ని రోజుల్లో నేను పెద్దవాడి నయిపోయి పేద్ద ఉద్యోగం చేస్తాను. బోలెడు డబ్బు సంపాదిస్తాను. అప్పుడు నీకేమో బోలెడు పట్టు పరికిణీలు కుట్టిస్తాను— ఏం ?"

ఫక్కుమని నవ్వింది ఆ అమ్మాయి. "—నీ మొహం!" అంది. తనకు కోపం రాబోయింది.

"నువ్వు పెద్దవాడివయి' ఉద్యోగం చేసేప్పటికి నేనింకా పరికిణీలు కట్టుకుంటానేం !" అని మళ్లీ నవ్వింది.

"మరి—?" అప్పుడు తనకు పదకొండేళ్లు. ఆ అమ్మాయికి తొమ్మిదేళ్లు.

"అప్పుడు చీరలు కట్టుకోవాలి తెలుసా ?"

"పోనీ చీరలే కొందాం—"

ఆమె ఏడుపు పూర్తిగా ఆగిపోయింది. చెంపల మీది చారలు తడి ఆరుతున్నాయి. తన చేత్తో ఆ తడిని తుడిచేస్తూండగా, ఆ చేతిని తీసేసి అంది అమ్మాయి— "నువ్వు మంచివాడివి!"

నెత్తిన ఆకాశం పెట్టినంత పనయింది తనకు.

"మా అమ్మ దగ్గరకు వెళదాం, వస్తావా" అని తాను నిల్చున్నాడు.

తన మెడలో పట్టుదారానికి గుచ్చిఉన్న పతకాన్ని చూసి—"అదేవిటి ?" అంది.

బోలెడు గర్వంతో "ఇది సాయిబాబా డాలరు!" అన్నాడు తను.

"నాకా డాలరు నివ్వవూ ?"

సందిగ్ధంలో పడ్డాడు తను. ఆ డాలరు చాల ఖరీదైనదనీ, అది దగ్గర వుంటే దెయ్యాలూ, జబ్బులూ రావనీ మరీ మరీ చెప్పింది అమ్మ. ఆ డాలరుని అడుగుతూంది ఈ అమ్మాయి. ఇవ్వకపోతే ఏడుస్తుందేమో ?—ఇస్తే అమ్మ ఏమంటుందో—

"పోనీలే—ఇవ్వొద్దులే—" అని మూతి అటు తిప్పుకుంది అమ్మాయి.

"అదికాదులే ..... నేను ఆ డాలర్‌ని నీకిస్తానూ —నువ్వేమో ఎవ్వరికీ చెప్పకూడదు—సరేనా ?"— ఆ డాలర్ ఎక్కడో పడిపోయిందని అమ్మతో చెబితే సరి—అనుకున్నాడు.

"ఏం ?"

"మా అమ్మా—"

"అయితే వద్దులే—"

"ఫరవాలేదులే—నువ్వు ఈ డాలర్ తీసుకో."

"అయితే ఓపని చేద్దాం .. . ఇప్పుడేమో దాన్ని నాకివ్వూ .... ఏం .... సాయంత్రందాక నే నుంచుకుని అప్పుడు నీ కిచ్చేస్తాను .... సరేనా .... "

"ఓ!" తను విప్పి ఇస్తే ఆ డాలరుని తన మెళ్లో చెయిన్‌లోకి పిన్నుతో గుచ్చుకుంది. ఆ అమ్మాయి.

ఇద్దరూ కలిసి పెళ్లి పందిట్లోకి వచ్చారు. అప్పుడే ముహూర్తం అయింది.

"అమ్మయ్య .... ఎలాగో ఓలాగు మూడు ముళ్లూ పడ్డాయి—" అంది దూరపుబంధు వొకావిడ.

"అవునమ్మా—ఏదో జరిగిపోయింది ...... అందరూ వద్దంటుంటే అమ్మాయి కావాలని పట్టుబట్టి మరీ చేసుకుంది అబ్బాయిని—నాలుగు కాలాలబాటు చల్లగా ఉండాలి అంతే" అంది రవణమ్మ.

"ఏమీ—అబ్బాయికేం ?"

"ఏమీ లేదనుకో—! ఆమధ్య కాస్త క్షయ వచ్చి తగ్గిపోయిందని అంటారు—అంతే" అని తాంబూలాలు పంచిపెట్టడానికి లేచివెళ్లింది రవణమ్మ.

ఆపాటికి శ్యామల జీవితం నారాయణకు అంకితం అయిపోయింది.

"రవణమ్మ పిన్నీ ! ఈ అబ్బాయికేం రెండరటి పళ్లివ్వవూ ?" అంటూ ఓ కుర్రవాడిని లాక్కుని వచ్చింది పెళ్లికూతురు చెల్లెలు ......

* * *

.... అది ఆరోజు. శాశ్వతంగా ఎవరో తన మనసుమీద చెక్కి వెళ్లిన రోజు. అది గుర్తుందా అని అడుగుతూంది జ్యోతి. ఎంత పిచ్చిపిల్ల ! నిజమే ! ఆ పెళ్లిరోజుకు తొమ్మిదేళ్ల తరువాత ఈనాడు తను జ్యోతి ఎదుట ఉన్నాడు. తనలో— ఆమెలో—ఎన్ని మార్పులు ?

"వాసూ ! నా వయసు ఆడది ఇలా ఒక మగ వాడి ఎదుటపడి మాట్లాడదని, మాట్లాడకూడదని, నాకు తెలుసు ...... కాని అమావాస్య రాత్రి వేళ మెరుపుతీగలా నువ్విలా వచ్చావు .... ఇన్నేళ్ళ నా బాధనూ నీ ఎదుట వర్షిస్తున్నాను .... ఏమీ అనుకోకు .... తొమ్మిదేళ్లక్రింద ఆరోజున— నన్నొక మనిషికింద గుర్తించి విలువనిచ్చే వ్యక్తి ఈ ప్రపంచంలో ఒక్క రున్నారన్న ఆశ కల్పించి

# వాళ్లు ఇద్దరు

వెళ్ళావు నువ్వు .... ఇంతకాలంనుండీ, తెలిసో తెలియకో ఆ ఆశతోనే బతుకుతున్నానంటే నువ్వు నమ్మకపోవచ్చు....కాని అది నిజం .... నువ్వు విశాఖ పట్నంలో అమ్మ నాన్నల దగ్గర పెరిగావు. కాలేజీలో చదివావు. ఉద్యోగం చేస్తున్నావు. అలాటి పరిస్థితులలో నేను నీకు గుర్తుకు వచ్చిఉండక పోవచ్చు.

"అదికాదు జ్యోతీ .... అక్కడకూడా చాలా ఇబ్బందులు ...."

"పోనీ గుర్తుకు వచ్చానే అనుకుందాం .... నీకు ఇక్కడి విషయాలు ఎటూ తెలియవుకదా ! మీరేమో ఎవ్వరూ యిటురారు. ఉత్తరాలు రాయరు. నేనా పెళ్లికాని పిల్లను," నీకెలా ఉత్తరాలు రాయగలను చెప్పు—పోనీ రాద్దామనుకున్నా కార్డు ముక్క కొనీ కానీ ఇవ్వగలవాళ్లెవరున్నారు నాకు? .... ఇప్పటికే వాళ్ల ఇష్టం లేకుండా స్కూల్ ఫైనల్‌దాకా చదివానని అమ్మమ్మకూ, సుందరానికీ నామీద కోపం ఉంది.....ఇంకా నీకు ఉత్తరం అంటూ రాస్తే ఇంకేమన్నా ఉందా .... ఆ చదువేదో సక్రమంగా పూర్తి అయివుంటే నా కాళ్ల మీద నేను నిలబడగలిగేదాన్ని .... కానీ నేనే గనక ఆ పరీక్ష పాసయితే నీతి, జాతీ వదలి విచ్చలవిడి అయిపోతానని ఘోషించేవాడు సుందరం. వాడి కళ్లు చల్లగా ఆ పరీక్ష కాస్తా పోయింది. .... ఇంకేవిటి దారి నాకు ? .... ఒక్కొక్కప్పుడు, అసలుదారి అంటూ ఎందుకు వెతుక్కోవాలి, నేనూ ఒక మనిషినేనా అనిపిస్తుంది. .... నేను ఉండి ఎవరికి సంతోషం. నేను లేక ఎవరికి దుఃఖం. ఏదీలేదు ...."

జ్యోతి ఒక్కొక్కమాటా సమ్మెటపోటులా తగులుతూంది. బాబాయికి అరవై అయిదు దాటింది. పిన్ని ఎంతసేపూ తన గురించేగాని ఇంకోరి విషయం పట్టించుకోని రాయి మనిషి. ఇహ మిగిలింది—పిన్ని కొడుకు—జ్యోతికి మామయ్య—సుందరం.

"పరీక్షపోతే మళ్లీ కట్టకపోయావా ?"

రాలిపోతున్న పువ్వులాటి నవ్వు నవ్వింది జ్యోతి. "వాసూ ! అందుకనే ఇక్కడి పరిస్థితులు నువ్వు నమ్మలేనివని అన్నాను. తాతయ్యకు సరైన ఆదాయం లేదని నీకు తెలుసుగా—సుందరానికి నెలకు డెబ్భైనాలుగు వస్తాయి. దానితో అంతా గడవాలి. అలాంటప్పుడు పరీక్షఫీజు పదిహేను రూపాయలు ఎవరిస్తారు నాకు ?"

"వెధవ పరీక్షఫీజే అయితే—" అని ఏదో అనబోయాడు వాసు.

"నువ్వు కడతానంటావు .... కాని వద్దు వాసూ, వద్దు ! నా స్నేహితురాలు ఇందిర అని డాక్టరుగారి అమ్మాయి ఉంది. పోయినసారి పరీక్షకు డబ్బు ఆ అమ్మాయి దగ్గర తీసుకున్నాను... అందుచేత ఇందిర అన్నయ్యకూ నాకూ ఏదో సంబంధం ఉందని అన్నారు ...."

జ్యోతి కళ్లల్లో చల్లటి నిప్పు మండుతూంది. పటపట పళ్లు కొరికింది వాసు మనసు.

"…. నేను చదువుకోవాలి …. నేను ఉద్యోగం చెయ్యాలి …. నేను ఇంకొక్కరికి భారంగా ఉండ కూడదు.—అనుకుంటానే గాని నేను ఎవరికీ ఏ కీడూ తలచనే—అలాటప్పుడు అందరూ కలిసి నన్నిలా ఎందుకు పరీక్షించాలో అర్థంకావడంలేదు. వాసూ ! …. అమ్మ అంటూ ఉంటే ఆమె ఒడిలో ఒక్క నిముషంసేపు కళ్ళు మూసుకుని పడుకునే దాన్ని, కానీ …. అయినా పిచ్చిగాని, అమ్మే ఉంటే నే నిలా ఎందుకుంటానూ ? …."

"జ్యోతీ, నామాట విను …. నాతో వచ్చే సెయ్యి …. మా వూరు వెళ్ళిపోదాం …. నేను నీకు చదువు చెబుతాను …. అక్కడే చదువు పూర్తి చేసుకో—ఏం …. తర్వాత ఉద్యోగంలో చేరవచ్చు …. లేకపోతే—"

"లేకపోతే—?" కనుబొమలు ముడిచి అడిగింది జ్యోతి.

"—ఏమీలేదు—ఇప్పు డెందుకులే ఆమాట—అన్నట్టు, జ్యోతీ ! ఈ ఊళ్ళో నే మీ అక్కయ్యా, బావా ఉన్నారుకద ?"

"అక్కయ్య ! …. అవును …. అక్కయ్య ఉంది. కాని ఆమెకు నేనంటే పడదు వాసూ !"

"కారణం ?"

"ఎటూ నువ్వు ఆమె ఇంటికి వెళ్తావుగా—అప్పుడు తెలుస్తుంది కారణం!" అని ఒక్క క్షణం ఆగి పలికింది జ్యోతి—"కాని ఒక్కమాట వాసూ—అక్కయ్య కూడా అందరిలాగే మాట్లాడు తుంది. అది నా దురదృష్టం. ఆమె మాటలలో నిజం ఎక్కువ వుందని నీ కనిపిస్తుందేమో, కాని—నేను మాత్రం ఆ విషయంమీద ఎవరికీ ఏమీ చెప్పలేను—చెప్పలేను వాసూ !" అని గభుక్కున లేచి వెళ్ళి పోయింది జ్యోతి.

ఆశ్చర్యపడ్డాడు వాసు. అతడికేమీ బోధపడడం లేదు. రెండేళ్ళక్రింద ఒకనాడు అత డక్కడ ఉంటే—తెలిసి ఉండేది.

ఆనాడు—

జ్యోతి ఇంట్లో పనిచేసుకుంటూంది. సాయంకాలం ఆరింటికే బాగా చీకటయింది. జ్యోతి ఆకాశం శము వైపు చూసింది. 'వర్షం కురుస్తుందేమో' దొడ్లోకి వెళ్ళి ఉతికి ఆరవేసిన బట్టల్ని భుజం మీదకు వేసుకుంది. ఇంతలో వీధివైపు అలికిడి అయింది పరుగెత్తుకొచ్చింది జ్యోతి.

నారాయణ వచ్చాడు. చొక్కా విప్పుతున్నాడు. చినుకులు పడసాగాయి. జ్యోతి లోపలికి వెళ్ళబోయింది.

"జ్యోతీ !"

ఆగి వెనక్కు తిరిగిచూచింది.

"అక్కయ్యేదీ ?"

"ఇంకా ట్యూషన్ నుండి రాలేదు బావా ?"

నారాయణ నవ్వాడు. "అవున్లే, ఎందుకొస్తుందీ ?"

సెంపమీద కొట్టినట్లయింది జ్యోతికి—'ఏమిటి బావా నువ్వంటున్నదీ ?"

"ఆ …. ఏముందిలే గానీ …. అమ్మాయేదీ ?"

"లలిత అమ్మమ్మ ఇంటికి వెళ్ళింది బావా …. సుందరం వచ్చి తీసుకువెళ్ళాడు. రాత్రికి అక్కడే ఉంటుందిట—" అనేసి వంటింట్లోకి వెళ్ళింది. వర్షం ఎక్కువయింది. అన్నం దింపేసి ముందు గదిలోకి వచ్చింది.

నారాయణ పచార్లు చేస్తున్నాడు. మధ్య మధ్య దగ్గుతున్నాడు. జ్యోతిలాంతర్లు తుడవసాగింది.

"బావా ఆస్పత్రికి వెళ్ళి ఏదయినా మందు తీసుకోరాదూ ?"

నారాయణ వచ్చి జ్యోతి ఎదుట నిల్చున్నాడు. రెండో లాంతరు చిమ్నీని తీసుకుంది జ్యోతి.

"నాకెందుకు జ్యోతీ, ఆస్పత్రులూ మందులూ?"

"నీకు కాస్త బలం వస్తే ఎక్కడయినా చేర వచ్చు కదా ?"

"ఓహో …. ఇప్పుడు మీ అక్కయ్య కష్టపడి పోతూందేనని బాధన్నమాట !"

"అదికాదు బావా ! ఏమీ పనిలేకుండా రోజంతా ఇంట్లో కూచోవాలంటే మగవాడికి కష్టం కాదూ?"

లాంతర్లలో కిరసనాయిలు పోసింది జ్యోతి. ఇంటా బయటా చీకటి పెరుగుతూంది. వర్షం ముదురుతూంది. నారాయణ వచ్చి కూచున్నాడు.

---

తండ్రి :- ఒరేయ్! ఎందుకురా నువ్వు ఇంత చిన్నపని కూడా చెయ్యావు. నువ్వు నిజంగా గాడిదవేరా!

కొడుకు :- అది సరేకాని, పొద్దున్న తాతయ్య నన్ను గాడిదకొడకా అని తిట్టాడు.

కంచర్ల కమలపుల్లేశ్వరరావు,
(అమలాపురం)

---

"జ్యోతీ !—నిజంగా నేనంటే—" సగం వాక్యంలో ఉలిక్కిపడ్డాడు నారాయణ. వీధిలో బిచ్చగాడు అరిచాడు.

జ్యోతి లాంతర్లను వెలిగించింది. ఒకదానిని తీసుకుని లేవబోయింది. హఠాత్తుగా ఆమె చేయిపట్టి లాగాడు నారాయణ.

లాంతర్లమీద పడబోయిన జ్యోతిని లాఘవంగా తన చేతుల్లోకి తీసుకున్నాడు.

నల్లటి మేఘాల మధ్య ఒక మెరుపుతీగ మెలికలు తిరిగింది.

ఒక్క వూపుతో ఇవతలికి వచ్చిపడింది. జ్యోతి.

"బావా ! బా …. వా …. !"

నారాయణ పెదవులమీద చీకటి నవ్వొకటి వెలిగింది.

పెద్దగా ఉరిమింది ఆకాశం.

మళ్ళీ జ్యోతి పెనగులాడింది. అతడి చేతులలో. ఆ క్షణాన్నే—అలసి, తడిసి, ఇంటోకి అడుగు పెట్టింది శ్యామల.

జ్యోతి చచ్చి మొత్తుకున్నా ఒప్పుకోలేదు. "నేను ఏది కోరుకున్న నా మొగు డెన్నటికీ అలా ప్రవర్తించడు. నువ్వే ద్రోహివి …. నా సంసారాన్ని పాడుచెయ్యక వెళ్ళిపో—నువ్వు నా చెల్లివి కాదు—" అంది శ్యామల.

ఆ రాత్రే—ఆ చీకట్లోనే— ఆ వర్షంలోనే మళ్ళీ దారిద్ర్యంలోకి—అమ్మమ్మ దగ్గరకు వచ్చింది జ్యోతి.

మళ్ళీ చెఱసాలలోకి, సుందరంవున్న ఇంట్లోకి వచ్చింది జ్యోతి. అది రెండేళ్ళ కింద. ఆనాడు.

ఈనాడు ఇవన్నీ నోటి మాటలతో చెప్పలేక లేచివెళ్ళింది జ్యోతి. ఇవన్నీ తెలియక కొట్టుకు లాడాడు వాసు. అంతకంతకూ అల్లుకుపోతున్న ఈ అగాధాన్ని కనుక్కోవాలనుకున్నాడు.

సాయంకాలం — టిఫినయిం తర్వాత — రామలింగేశ్వరపేట వైపు నడిచాడు. మేష్టరమ్మ ఇంటి గురించి వాకబు చేశాడు.

"అదిగో …. ఆ పసుపు మేడ తర్వాత, లాంతరు స్తంభం ఉంది చూశారా—దాన్ని ఆనుకునివున్న పెంకుటిల్లేనండి—" అన్నాడు ఆ సందు మొగదల కిళ్ళీకొట్టువాడు.

"ఏదీ—ఆ నీలిరంగు కిటికీలున్నదేనా ?"

"మరేనండి …. ఇదిగో …. అమ్మగారే వస్తున్నట్టున్నారు—"

తెల్లటి చీరలో సన్నగా పొడుగ్గా ఉంది శ్యామల. చేతిలో పుస్తకాలూ, గొడుగూ ఉన్నాయి. మనిషి ఎక్కువ మారలేదు. ఆ కుడి బుగ్గ మీది మచ్చ అలాగే ఉంది. ఎదురు నడిచాడు వాసు.

తననే చూస్తూ వస్తున్న వ్యక్తిని గుర్తించ డానికి అర నిముషం తీసుకుంది శ్యామల.

"ఎప్పుడొచ్చావోయి వాసూ ? ఓ వారం అయి ఉంటుందా—?"

వాసు నవ్వాడు—"లేదు శ్యామూ ! పొద్దుటే వచ్చాను—"

"అవున్లేవోయ్ ! అంతపెద్ద పిన్నిగా రుండగా మా ఇంటి కెందు కొస్తావులే ?"

వాసు పలకలేదు.

"అమ్మా నాన్నా బాగున్నారటోయ్?….కళ్ళజోడు ఎప్పణ్ణించేవిటి?…బాగా పొడుగయ్యావే! ….పెళ్ళయి పోయిందా?—"శ్యామల టపటపమని అడిగింది. ఏవో సమాధానాలిచ్చాడు వాసు. ఇల్లు చేరారు. కుర్చీలో కూర్చోమంది.

"ఏయ్—లలితా ! భాస్కర్ ! ఇటు రండ్రా—మా విశాఖపట్నం మామయ్యని చూడండి—" అని కేకేసింది శ్యామల. ఇద్దరు పిల్లలు వచ్చారు. లలిత జుత్తు శ్యామల లాగే కాస్త రాగి రంగు. భాస్కర్ లలితకన్న తెల్లగా ఉన్నాడు.

"ఈ ఇద్దరూ మా రత్నాలోయ్—ఇదేమో ఒకటో తరగతి చదువుతూంది. వీడికి రెండో ఏడు నిండబోతున్నది. ఏం, అదీ ఇక్కడి వార్తలు. ఇహ నీ విశేషాలు చెప్పు బాబూ !"

తన్ను చూసి ఉప్పొంగిపోతుంది శ్యామల. తానెప్పుడూ ఈవిడకు ఉత్తరమయినా రాయలేదు. హఠాత్తుగా వినపడింది ఆమె కంఠం.

"నువ్వు కళ్లజోడులో ఎంతో బాగున్నావు తెలుసా ?" అని నవ్వింది శ్యామల. తల వంచు కున్నాడు వాసు. పిల్లలిలిద్దరూ ఆడుకోవడానికని వెళ్ళిపోయారు.

# వాళ్లు ఇద్దరు

"అంత సిగ్గుపడతా వెందుకోయ్—నా పెళ్ళికి నువ్వెంతవాడివో తెలుసా ?—ఇంతవాడివి !" అని నేలకు మూడడుగుల ఎత్తున ఒక చేతిని వుంచి ఇంకోచేత్తో నెత్తిమీద మొట్టింది.

ఎంత తమాషా మనిషి ! మనిషంత తెల్లటి నవ్వు. నవ్వంత వెలుగుతున్న కళ్లు ! గోడవైపు చూస్తున్నాడు వాసు. శ్యామల నారాయణ పిల్లలు కలిసి తీయించుకున్న ఫోటో కంటబడింది.

"ఈపూట నీ భోజనం యిక్కడే !" అంది శ్యామల వంటింట్లోకి నడుస్తూ.

"ఊహు—అదికాదు శ్యామూ !" అన్నాడు తానూ ఆమె వెంట వెడుతూ—

"అదేమీ వీల్లేదబ్బాయ్—కావాలంటే మీ పిన్నిగారింటికి కబురు పంపిస్తాను—"

పీట వేసింది. చతికిలబడ్డాడు వాసు.

"ఈపూట వంటేమిటో చెప్పనుటోయ్ !" టొమాటోల పెరుగు పచ్చడి—అరటికాయ ఆవ పెట్టి కూర—పప్పుచారు—"

ఆశ్చర్యంగా చూశాడు వాసు.

"నాకు తెలుసులేవోయ్—నీకు నచ్చిన వేమిటో !

'నారాయణ ఎంత అదృష్టవంతుడో' అనుకున్నాడు వాసు, అడిగాడు— "నారాయణ ఆరోగ్యం ఎలా ఉందీ ?"

అంతవన్నెలనూ ఒకమబ్బు మూసేసింది. అదొక్క క్షణం మాత్రమే !

"అదేనోయ్—ఆస్పత్రిలో చేర్పించి రెండు నెలలయింది. ఏదో అలా నెట్టుకొస్తున్నారు—డాక్టర్లేమో మామూలే. చెయ్యగల్గిందల్లా చేస్తున్నామంటారు. ఎక్స్‌రేల కేమీ కొదవలేదు. ఒక్క 'లంగ్' సగానికి పైగా దెబ్బతిన్నదట. కోలుకోవడానికి కనీసం అయిదారు నెలలయినా కావాలిట—మదనపల్లి వెళ్లమంటారు—"

"మరి వెళ్ళకూడదూ ?"

"నాకీ ట్యూషన్లమీద వచ్చేదంతా అరవై రూపాయలు ! అందులో ఇంటి అద్దె పది రూపాయలు పోతే—"

"మీ ఆయనకు కొంత భూమి ఉండాలేమో ?"

"అయ్యోరామ ! మావారి తమ్ముడొక శ్రేయోభిలాషరా వున్నాడులే—ఈ సమయం జూసి అమ్మకు తింటున్నాడు—"

తల వంచుకున్నాడు వాసు.

"అది సరేగాని వాసూ ! అప్పడాలని నిప్పుమీద కాల్చనా, నూనెలో తేల్చనా—ఏది యిష్టం నీకూ ?" అంది శ్యామల .........

భోజనం అయింది.

రాత్రి అక్కడే పడుకున్నాడు వాసు. అతడి ప్రక్కన లలిత, భాస్కర్, పిల్లల కవతల శ్యామల పడుకున్నారు. ఏవేవో మాట్లాడించింది శ్యామల. నెమ్మదిగా నిద్ర వచ్చేసింది వాసుకు.

ఎప్పుడో రాత్రి—మెలకువ వచ్చింది. వాసు లేచి కళ్లు తుడుచుకున్నాడు. గోడమీద గుడ్డిదీపం మసకగా వెలుతురు చల్లుతూంది. మంచినీళ్లు కావాలి—శ్యామల పడకమీద లేదు.

వెక్కిళ్ళ శబ్దం వినిపిస్తే ఉలిక్కిపడ్డాడు వాసు. లేచి వంటింటి ప్రక్కగా ఉన్న గుమ్మం దాటి దొడ్లోకి వెళ్లాడు.

అక్కడ—ఆకాశం కింద — నక్షత్రాల వెలుతురులో—గోడ నానుకుని కూర్చుంది. చేతులలో మొహాన్ని దాచుకుని ఉంది. ఉండుండి త్రుళ్లి పడుతూంది శ్యామల.

వెళ్లి ఆమె కళ్లనీళ్లు తుడుద్దామనుకున్నాడు. తనచేతుల్లోకి తీసుకుని లాలిద్దామనుకున్నాడు. ఆమె ఏం చెయ్యమంటే అది చేద్దామనుకున్నాడు.

కాని, ఏం చెయ్యలేదు వాసు. మంచినీళ్ల విషయం కూడా మరిచిపోయి వెనక్కొచ్చి పడుకున్నాడు. చాలసేపు వరకు నిద్ర రాలేదు.

రాత్రి శ్యామల ఎప్పుడు వచ్చిందో ఏమో—

పొద్దున్నే వాసు చెవిలో చన్నీళ్లు పోసింది. ఉలిక్కిపడి లేచి కూచున్నాడు వాసు.

"ఏమిటయ్యా వాసూ! నీ వ్యవహారమంతా చెడ్డ బాలుడు—సోములా ఉందే—! మా పిల్లలు చూడూ ఎంచక్కా మొహాలు కడిగేసుకుని, కాఫీ తాగేసి కూచున్నారో !!"

వాసు ఏమీ మాట్లాడలేకపొయ్యాడు. ఆపాటికే స్నానంచేసివుంది శ్యామల. జుత్తుని వదులుగా ముడివేసుకుని ఉంది. గుండ్రటి కుంకుమ బొట్టు నొసట తీర్చిఉంది.

"ఏమీ పలకవేం మామయ్యా ! కాబోయే మా అత్తగారు కన్పించా రేమిటి కలలో—" అంది శ్యామల నవ్వుతూ.

"లేదు! కోడలే కన్పించింది—" అన్నాడు వాసు.

భ్రుకుటి ముడిచింది శ్యామల—" ఏమిటీ ! కోడలు కన్పించిందా— అయ్యో పాపం ! అదేమంత ఆరోగ్యవంతమయిన కల కాదులే ! .... మహాశయా ! ఇహ ఈ వూకదంపుడు మానేసి లేచి వస్తే 'ఏ' క్లాస్ కాఫీ ఇస్తాను .... ఏం .... పది నిముషాల్లో రావాలి .... పదో నిముషం రాకపోతే—నీకూ కాఫీకీ బెబ్బే—" అని వంటింట్లోకి పరుగెత్తింది శ్యామల.

వాసు లేచి మొహం కడుక్కున్నాడు. కాఫీ తాగాడు. స్నానం చేశాడు. తొమ్మిదింటికి పిల్లలకూ తనకూ భోజనం పెట్టి, తాను భోంచేసి పిల్లల్ని తీసుకుని బడికి బయలుదేరింది శ్యామల.

దారి పొడుగునా, ఏవిటి మరిచిపొయ్యానా అని మథనపడ్డాడు వాసు. పిన్ని ఇంటి గుమ్మంలో అడుగు పెడుతుండగా, పెరుగు పోయించుకుంటున్న జ్యోతి కనపడింది. ఒక్కసారి తలెత్తి చూసి లోపలికి వెళ్లిపోయింది.

జ్యోతి—శ్యామల—

గులాబి—కస్తూరి !

ముళ్లమధ్య నలిగిపోతూ నాజొంతో వెలిగేది ఒకటి.

దోచినా దాగక, తొక్కినా అణగక ఉండేది రెండోది.

—ఇంతకూ తను జ్యోతిని గురించి శ్యాముల నుండి తెలుసుకున్న దేమిటి ?—ఏమీలేదు ! తన అసమర్థతకు తానే నవ్వుకున్నాడు వాసు.

ఆ సాయంకాలం తాను బాబాయితో పార్కుకు వెళ్లాడు. ఆ మాటా ఈ మాటా వచ్చి జ్యోతి ప్రసక్తి వచ్చింది.

"జ్యోతిని ఏం చెయ్య దలుచుకున్నారు బాబాయ్ ?"

"ఇందులో తలచుకోవడానికి ఏం ఉందోయ్—కాస్త వీలు చూసుకుని సుందరంచేత ఆ మూడు ముళ్లూ వేయించడమే—"

మిన్ను విరిగి నెత్తిమీద పడ్డట్లు కాగా, గుండె దడతో అడిగాడు వాసు— "సుందరాన్ని చేసుకోవడం జ్యోతి కిష్టమేనా—?"

"జ్యోతిని చేసుకోవడం సుందరాని కిష్టమేనోయ్—" అని నడుస్తున్న వాడల్లా బాబాయి ఆగిపోయాడు. ఊతకర్రమీద రెండు చేతుల్నీ ఆనించి వాసుకేసి చూశాడు. ఆయన నుదుటి మీది ముడతలు వాసు తొందరని చూసి నవ్వాయి— "వాసూ—నాకీ ఒక్కపూట అన్నం పెడుతున్నది ఎవరో తెలుసా ?—సుందరం ! వాడిని కాదని ఏదీ చెయ్యలేను. తెలిసిందా—అంతేకాదు—ఇంకోడి కిచ్చి చెయ్యాలన్నా మూడు వేలూ, నాలుగు వేలూ పెట్ట గలవా డెవ్వడు ? .... కనుకా—"

ఆశల నైవేద్యమన్నా, బ్రతుకుల బానిసత్వమన్నా డబ్బుకి మహా యిష్టం. ఎంత .... !! వాసు ఆపాదమస్తకం సూదులతో పొడిచినట్లయింది.

వాసు, బాబాయితో ఇల్లు చేరుకున్నాడు. కాళ్ళు కడుక్కుని భోజనానికి కూచున్నాడు. సుందరమూ కూచున్నాడు. పిన్ని వడ్డించింది! ఆశ్చర్యం వేసింది వాసుకు

భోజనాలయాయి. నిముష నిముషానికీ ఏదో వరద పెల్లుబికిపోతూంది వాసులో.

పడుకోబోతూ అడిగాడు : "సుందరం ! జ్యోతి ఏదీ ?"

"జ్యోతా ? ఈ ప్రక్క ఊళ్లో వాళ్ళ దూరపు బంధువులున్నారులే — వాళ్లివాళ సాయంకాలం వచ్చారు. జ్యోతిని నాల్రోజు లుంచుకుని పంపుతామని తీసుకు వెళ్లారోయ్—"

విపరీతమయిన కోపం వచ్చింది వాసుకు.

"అయితే జ్యోతి రేపు రాదా ?" అని అడిగాడు. సుందరం ఒక్క చూపు చూసి వెళ్లిపోయాడు.

ఎవరో పట్టపగలే తన్ను దోచుకున్నట్లయింది వాసుకు. బాబాయినీ పిన్నినీ ఎడా పెడా తిడదామనిపించింది. సుందరం పీక పిసికేద్దా మనిపించింది.

కానీ అవేమీ చెయ్యక, సరిగా నిద్రపోక, పొద్దున్నే లేచి స్టేషన్ చేరుకున్నాడు వాసు.

వచ్చిన వారం తర్వాత తెగించి జ్యోతి కొక ఉత్తరం వ్రాశాడు. మూడో రోజు అది నాలుగు ముద్రలతో తిరిగి తనకే వచ్చింది. తెనాలి వెళదామనుకున్నాడు. కాని వీలుపడలేదు. ఇంతలో ఉద్యోగ రీత్యా జబల్‌పూర్‌లో ట్రెయినింగ్‌కు వెళ్లాల్సి వచ్చింది. వెళ్లాడు.

క్రొత్తచోటు—క్రొత్త స్నేహితులు — క్రొత్త విషయాలు—వాసు కాలానికి రెక్కలు వచ్చాయి. అయిదు నెలలు ఎగిరిపోయాయి.

ఒక ఆదివారం—

వాసు మరో మిత్రుడితో కలిసి హాయిగా టిఫిన్ ఆరగించాడు. సినిమాకు వెళ్లాడు. మెస్‌కు వచ్చి భోంచేశాడు. రిక్షామీద గది చేరుకున్నాడు. మధ్యాహ్నం ఒంటిగంటయింది. గది తలుపు తీశాడు. ఒక కార్డు పడివుంది.

'చి. వాసుకు—జ్యోతి రెండు వారాలబాటు విష జ్వరంతో బాధపడి మొన్న బుధవారం రాత్రి కన్ను మూసింది—బాబాయి—'

భర్త:-ఏమేవ్ రాత్రి సినిమా ఎలా వుందే?

భార్య- (భర్త పక్కన కూర్చొంటూ :) ఇలాగుందండి.

భర్త:-అబ్బా!ఇదేమిటే ఈలా గిల్లావ్.

భార్య:-రాత్రి సినిమాహాల్లో నల్లులు అలా కుట్టాయండి.

ఎస్. సుబ్బారాయుడు (శృంగవృక్షం)

"ఏమండీ వాసుగారూ ! ఇందాక మీకోసం ఓ ఎక్స్‌ప్రెస్ కార్డు వచ్చింది. నేను సంతకంచేసి తీసుకున్నాను. మీ గదిలో పడేశాను—చూశారా?" అంటూ వచ్చాడు ప్రక్కగదిలోని సూర్యనారాయణ.

* * *

రెండేళ్ల తర్వాత—

విశాఖపట్నం .... సముద్రతీరం.

నీటికి కాస్త దూరంగా కూచుని ఉన్నాడు వాసు. చెదిరిపోతున్న జుత్తుని ఒక చేత్తో సద్దుకుంటూ ఇంకో చేత్తో ఇసుకలో గీతలు గీస్తూ చెబుతూంది శ్యామల.

".... వాసూ! అదీ ఆ అభాగ్యురాలి కథ .... నేను ఆయన్ని ఏరి కోరి వరించాను. కష్టమో, సుఖమో పడ్డాను. కానీ జ్యోతి జీవితంలో కృష్ణపక్షం మాత్రమే చవిచూసి వెళ్లిపోయింది .... ఆ అమాయకురాలి బ్రతుకుని అంత దుర్భరంగా చేసిన వాళ్లల్లో నే నొక్కతెను—అన్న యధార్థం స్ఫురణకు వచ్చినప్పుడెల్లా చచ్చిపోదా మనిపిస్తుంది. కాని నాకు యిద్దరు పిల్లలున్నారు—" అని తలెత్తి చూసింది. వాసు దృష్టి దూరంగా వెళ్తున్న నౌక మీద ఉంది. సముద్రం సంతోషంతో పొంగి పొంగిపోతూంది.

".... వాసూ ! మదనపల్లిలో ఆఖరురోజున నా ఒడిలో పడుకుని నిజం చెప్పేదాకా ఆయన మాట నమ్మాను .... అంతవరకూ ఆయన మాటను నమ్మేయడం తప్ప మరోటి తెలియదు నాకు .... ఆయన మాట నమ్మాను. నా తోడబుట్టిన దానిని అనుమానించి అవమానించాను. దూరం చేసుకున్నాను ..... "

"అయితే, జ్యోతి కంతగా జ్వరం వస్తే ఆస్పత్రిలో చేర్పించలేదా శ్యామూ ?"

"జ్యోతి చావలేదు వాసూ !"

జబల్‌పూర్‌లో ఆ కార్డు చదివినప్పటినుండి జీవితంలో ఎన్నో వాటికి ఆశ్చర్యపడ్డం మానేసిన వాసు కూడా చలించాడు.

"సుందరంతో పెళ్లి కిష్టపడని జ్యోతి ముహూర్తపు ముందురోజు చచ్చిపోయింది వాసూ!'

హోరుమంటూ వచ్చిందొక పెద్ద కెరటం. వాళ్లిద్దరి పాదాలనూ తడిపి వెళ్లిపోయింది. ఐస్ క్రీం కుర్రవాడు అరుస్తూ వెళ్లాడు. ఇద్దరు పిల్లలు గాలిపటా లెగరవేసుకుంటూ పరుగెత్తారు.

"లలితా, భాస్కరూ ఎక్కడున్నారు శ్యామూ!"

"వాళ్లిద్దరినీ ఒక సదనంలో చేర్పించానోయ్."

"మరి నువ్వేం చెయ్యదలుచుకున్నావూ ?"

"నేను తలచుకోవడ మేమిటీ ? నా ఉద్యోగం ఉందిగా—"

"అదికాదు నే నన్నది—"

"ఓహో అదా—" ఫక్కుమంది శ్యామల. నుదుట బొట్టు ఉంటే ఇంకా ఎంత అందంగా ఉండేదో—అనుకున్నాడు వాసు.

"నేను మళ్లీ పెళ్లి చేసుకో దలచుకున్నానోయ్—"

విస్తుపోయాడు వాసు.

"ఏం—అలా కళ్లప్పగించి చూస్తావేం ?—నేను ముసలిదాన్నయి పోయాననా ?"

ఇసకతో ఆడుకుంటున్న ఆమె చేతి వ్రేళ్లను తీసుకున్నాడు వాసు— "కాదు శ్యామూ, కాదు ... నువ్వు తప్పక పెళ్లి చేసుకో !"

"ఊ .... ఇంతవరకూ పెళ్లి చేసుకోకుండా ఉంటే నిన్నే వరించేదాన్ని కదుటోయ్—" అని వాసు చేతిని విసిరేసి లేచి నిల్చుంది శ్యామల.

"శ్యామూ ! నీ కో కొత్తపేరు పెట్టనా ?"

"ఏమిటదీ ?"

"ఉష."

నవ్వి, ముందుకు నడిచింది ఆమె.

అతడు అనుసరించాడు .....

సూర్యుడు చల్లగా దగ్గరకొస్తే ఆకాశం ఎర్రగా సిగ్గుపడింది.





# ఫిలిప్స్



ట్రాన్సిస్టర్ రేడియో
B4CA96T
ధర రూ. 595/-



మేజర్ రేడియో
B5CA86A - 7 వాల్వ్సు
ధర రూ. 695/-



మాస్టరో రేడియో
B6CA86A
8 వాల్వ్సు - డబుల్ స్పీకర్లు
ధర రూ. 957/-



ఇంటర్నేషనల్ రేడియో
B4CA97A
ధర రూ. 551/-



మైనర్ రేడియో-B4CA07A
4 బ్యాండులు - 6 వాల్వ్సు
ధర రూ. 405/-



ఫియెట్టా రేడియో
3 బ్యాండులు - 5 వాల్వ్సు - ఏసి/డిసి
ధర రూ. 308/-



ట్రాన్సిస్టర్ మైనర్
B4CA07T-ధర రూ: 510/-



పాప్యులర్-B2CA09U
ఏసి/డిసి ధర రూ. 129/-

**మోడరన్ ఆటో స్టోర్స్**
కాన్వెంట్ రోడ్ :: విజయవాడ.

టెలిఫోన్ నంబర్లు
307
1118

నాణ్యమైన
అందమైన
రేడియోలు ఇవే!

# ముడిపదార్థాలు

నిరాశ, నిరుత్సాహం ఆవహించిన వ్యక్తి దైవం మీద భక్తి కుదుర్చుకొంటే సర్వమూ సాధించగలడని ఆస్తికుల వాదన. కాని వ్యవహారరీత్యా అంతకంటే లౌకికంగా తేలికయిన కార్యక్రమం కూడా ఉంది. ఈరోజున కథల విషయంలో, కర్తవ్యతా మూఢత్వం కలగని నిర్మాత లేడు. కాని దీనికి కారణం అతనికి మనోదార్ఢ్యం లేకపోవడం— ఇటువంటి సమయంలో భగవంతునిమీద భారం వేసి, వాడి గ్రంథం చదివించుకుని బాగుపడవచ్చని కొంతమంది కొన్ని నిర్ణయాలకి వస్తున్నారు. కాని మిగిలినవారు తమ తమ మానవత్వాన్ని ఆవాహన చేసుకోవటం సులభమయిన పని. ఆచరణ రూపకంగా చెప్పవలసి వస్తే, తన హృదయాన్ని గీటురాయిగా చేసుకోవటం భగవంతుణ్ణి త్రికరణ శుద్ధిగా నమ్మడంకంటే తేలికయిన పని. ఏ కథ అయినా సరే, ఏ సంభాషణ అయినా సరే, ఒక హృదయాన్ని కదలించగలిగితే ఒక మానవుణ్ణి ఆనందింప చేయగలుగుతే అందరికీ నచ్చుతుందనే నమ్మకం ఉండడం ఉత్తమం.

"నాకు నచ్చిందనుకోండి. ప్రజలకి నచ్చాలికదా! అంచేత యిలా మారుద్దాం" అనుకోవడం కంటే మహామాయ లేదు.

ఈ మూర్ఖతని, ఆచరణలో పెట్టడం కంటె విధ్వంసన మార్గం వేరే లేదు. తన హృదయానికి తృప్తి కలిగించే కథ ఏరుకోవటం ఒక్కటే తరించగల మార్గం. దీనివల్లనే మళ్ళా తనకి ఆత్మవిశ్వాసం కలుగుతుంది. తనకి ఒక ఉత్సాహం పుడుతుంది. ఆ ఉత్సాహాన్ని, ఆ హృదయస్పందనని అతను యితరుల్లో కలిగించగలడు. ఈరోజున చిత్రాలలో ఎవరికీ ఏ విషయాన్ని గురించీ పెద్దగా ఉత్సాహం లేకపోవడానికి కారణం చిత్రంలో ప్రతి సీనూ, ప్రతి వాక్యమూ ప్రజలకి యిలా ఉండాలనే మిథ్యతో వ్రాసుకున్నవి. దాంతో స్వంతంగా ఉన్న జీవం కూడా చచ్చిపోతుంది. వ్రాసిన వాడికీ, వ్రాయించినవాడికీ, రూపించేవాడికీ, ఉచ్చరించే వాడికీ కూడా ఉత్సాహం ఉండటంలేదు. తమ హృదయాలని కదిలించగలిగిందిగదా అనే తృప్తి ఉండటంలేదు. పాటకపుజనంకోసం అనే పారలౌకికం ఎక్కువయిపోయింది. ఈ దురహంకారం నిజానికి ప్రజలని అవమానించడం.

అసలు "మాంచి కథ" కోసం వెతుక్కోవడమే ఒక భ్రమ. ప్రతి కథా మంచి కథే. అయితే ఒక్కొక్క కథ ఒక్కొక్క తరహా చిత్రం అవుతుంది. ఆరకపు చిత్రం తీయడమా, వద్దా అనేదే తేల్చుకోవలసిన విషయం. ఈమధ్య మహారాష్ట్ర భాషలో 3 చిత్రాలను, కథానికలను ఆధారంగా చేసుకొని తీశారు. అన్నిటికీ ప్రజల ఆదరణ లభించింది. నిజానికి ఈ కథానికలలో ఉన్న విషయం గుప్తంగా 2 వేల అడుగుల ఫిలిమ్ ఉంటుంది. దాన్ని సమయోచితంగా, సందర్భశుద్ధిగా పెంచుకొని, 12 వేల అడుగుల చిత్రాలు తీశారు. ఇలాగే ప్రస్తుతం బిమల్‌రాయ్ తీసిన టాగూర్ కథ "కాబూలీవాలా" కూడాను. ఇది యితర రాష్ట్రాలలో పరిస్థితి. మనం యితర భాషల్లోంచి బాగా సంపాయించుకుని, అందరిచేతా భేష్ అనిపించుకున్న కథలని కొనుక్కుంటున్నాం. దేశం అంతా మోగిపోయిన "ఆద్మీ", "దహేజ్", "చిరాగ్ కహాఁ రోషనీకహా" చిత్రాలని అనుకరించపోయి బోర్లాపడ్డాం. వస్తుతః మంచి కథని కూడా మళ్లీ తియ్యలేని అసమర్థుల మనిపించుకొన్నాం.

దానికి కారణం—ఆకథల్లో నిర్మాతలకి తగినంత నమ్మకం చివరి వరకూ లేకపోవడం. ప్రజలకు యింకా ఏమిటో కావాలని నిరాధారంగా ఊహించుకోవడం, ఆదిలో బాగున్న కథలని, ప్రజలకోసమని మార్పులు చేయడంలో వచ్చిన అనర్థం ఇది. ఏరుకున్న కథకి అతుకులు పెట్టకుండా, రచయిత భావాన్ని గ్రహించి దాన్ని సాధ్యమయినంత నిర్మలినంగా ప్రజలకి అందజేయగల నిర్మాతలు బాగుపడ్డారు. పేరు తెచ్చుకున్నారు. "శరత్‌బాబు", "బడదీదీ" ని అనుకరించడంలో ప్రజాహితం కోసం ప్రత్యేకమయిన హాస్య ఘట్టాలు చేర్చకపోవడంలో నిర్మాత మెచ్చుకోదగిన మనోదార్ఢ్యం చూపించారు. వారికి శరత్‌మీద ఉన్న నమ్మకమూ, గౌరవమూ, వారికి కూడా తెలుగు ప్రజల్లో గౌరవము సంపాదించి పెట్టింది.

సాయంత్రం 6-30 గంటలకు ఒక పెద్ద ఉద్యోగి తనభార్యతో 'షాపింగు' వచ్చాడు. ప్రొద్దుకూకి వెన్నెల వచ్చేసింది. భార్య అవి బాగున్నాయ్, ఇవి బాగున్నాయ్‌కొనండి. అనిఅతణ్ణిబాగా విసిగించింది.

భార్య:-అబ్బ! ఆ చంద్రుడు చూచారా! ఎంత బాగుందో!

భర్త:-ఇంకా ఆలశ్యం ఎందుకు? త్వరగా కొనేసెయ్!

పి. రాధాకృష్ణమూర్తి (గుంటూరు)

కథ టూకీగా చెప్పగానే చిత్రంయొక్క చివరి స్వరూపమూ, దాని లాభనష్టాలూ చెప్పెయ్యగలమనే ప్రబుద్ధులు కొంతమంది బయలుదేరారు ఈనాటి నిర్మాతలలో. ఇది ఒకరకం మూర్ఖత, అహంభావం.

"బిమల్‌రాయ్" వచ్చి "మధుమతి" కథ నోటితో చెప్పితే, ఒక్క ప్రొడ్యూసరయినా ఓటిచ్చేవాడు కాడు. అటువంటి కథలు చెప్పడానికి వీల్లేనివి. అలాగే "జిస్‌దేస్‌మె గంగా బహతీహై" మంచి కథ అని ఎవరంటారు ?— చిత్రం చూచాక కూడా—అయితే మరి ఇన్ని రాష్ట్రాల్లో ఎలా నచ్చింది ? దానికి కారణం రాజకపూర్‌కి ఆ కథలో గల నమ్మకం .... అది కాశీమజిలీ కథ కాకపోవచ్చు. కాని దాన్ని చిత్రీకరించడంలో కొన్నిచోట్ల బీజాక్షరాలు వెయ్యవచ్చని ఆయనకి తోచింది. వాటిని రసవంతంగా చేయగలమని అతనికి విశ్వాసం ఉంది. తను కంజీర వాయించి జనాన్ని ముగ్ధులను చేయగలననే విశ్వాసం ఉంది. అది పనిచేసింది. ఇది తన సామర్థ్యంలో నమ్మకం—తన అభిరుచిలో విశ్వాసం, తన పనివాళ్ల సమర్థత తెలుసుకొని ఉండటం.

స్నానాల ఘట్టము ఉంటేనూ, ఎలుగుబంటి ఉంటేనూ పైకం వసూలై పోతుందనే నమ్మకం యిలాంటిది కాదు.

ఈ రోజుల్లో చిత్రాలు తృప్తిగా లేకపోవడానికి ఒకటే కారణం ఉంది. కథ బాగుండకపోవడం కాదు. ఆ చిత్రంలో పనిచేసేవాళ్ళల్లో ఎవరికీ కూడా చివరి వరకూ ఉత్సాహం లేకపోవడం. పది రోజులపాటు పని జరుగకముందే రచయిత నిరుత్సాహ పడుతున్నాడు. సగం చిత్రం అయేటప్పటికి డైరెక్టరుకి సరదా చచ్చిపోతుంది. చివరి చివరికీ నటీనటులు పరధ్యానంగా వచ్చి, ప్రారబ్ధం అనుకొని, బాకీవున్న పైకం వసూలు చేసుకోవటం కోసం తద్దినం పెట్టి పోతున్నారు.

ఈ పరిస్థితులకి కారణం, నిర్మాతగాని, డైరెక్టరు గాని, నటవర్గం కాని, వ్యక్తిగతంగా, దగాకోరులు, స్వార్థపరులూ అవటం కాదు. వారినందరినీ ఏకం చేయగల ఉత్సాహం అనే శక్తి లోపించటం. వారివారి వృత్తిధర్మాల్లో జోక్యం కలుగజేసుకొని వారికి ఉండే స్వతహా సామర్థ్యాన్ని అవమానించి, వారికి ఉండే దీక్షని తగలబెట్టి, వారికి ఉండే ఏకాగ్రతని పాడుచేసి, వాళ్ల నందరినీ కూలివాళ్ళలాగా చూడడం కంటే చిత్రాలు తీసేవాళ్ళు తీసుకోగలిగిన గొయ్యి యింకేం లేదు. సమర్థుడయిన రచయితచేత వ్రాయించి పట్టుకెళ్లిన సంభాషణల్లో నిర్మాత దగ్గర నుంచి, చిల్లర నటుడి వరకూ యిష్టానుసారం తుడుపులూ, సవరణలూ, సర్దుబాటులూ చేయడం మొదలుపెట్టిన తరువాత, ఆ రచయితని లక్ష రూపాయలిచ్చినా తృప్తిపరచటం జరగని పని.

"ఫలాన నటీమణి రెండు గంటలు ఆలస్యంగా వస్తుందిటండీ ఈలోపుగా వచ్చినవాళ్ల క్లోజపులు తీసేయండి" అని డైరెక్టరుని నియామకం చేయడం—అతనికి ఉత్సాహం పుట్టించే పనిగాదు. అసలు ఈ గొడవ అంతా ఎందుకు వచ్చిందంటా? పనిచేసేవాళ్ళల్లో పరాకు యిలాటి చిన్న చిన్న అంశాల వల్లనే పుట్టుకొస్తుంది. ఈ అంటువ్యాధి ఒకచోట ఆరంభమయి అందరిలోనూ వ్యాపించి "మంచి చిత్రం తయారుచేద్దామనే ఉల్లాసం" నాశన మయిపోతుంది. క్రమక్రమేణా అందరూ విరిగిన మనసులతో, మాడిన మొగాలతో, చిరునవ్వుల వెనకనున్న శాపనార్థాలతో పని ముగిస్తుంటారు. ఈ భావమే చిట్టచివరకి తెర వెనుక నుంచి ప్రేక్షకులను వెక్కిరిస్తుంది.

అందరూ కలిసి, దీక్షగా, శ్రద్ధగా, కుతూహలంగా పూర్తిచేసిన చిత్రాలు ఎప్పటికీ లనాదరణ పొందవు. 

# కవిసార్వభౌముడు

(26-వ పేజీ తరువాయి)

ఆ యుత్సవము సారివాగున కీవలిగట్టు ఎక్కినంతనే ఆవలిగట్టున సేన సన్నద్ధమయ్యెను. విలుకాండ్రు నారులు సారించుచు, బాణములు దక్షిణ హస్తములతో గ్రహించి సిద్ధమైరి.

అది గమనించి శ్రీనాథుడు తన పల్లకిని ముందుకుపోనిమ్మనెను. సన్నాయిని ఆశ్వికులను, పర్వతమల్లును, భటులను శ్రీదేవి మేనాను, బండ్లను అక్కడనే ఆపివేసెను. తన పల్లకిముందు వేదవిదులను దుగ్గన పోతనలను వందిమాగధులను, తన ప్రక్కను కొండవీటి కరణము మాచయను ఉంచుకుని ముందుకుసాగెను. వేదఘోషతో బాలకవుల జయధ్వానములతో వందిమాగధుల కైవారములతో నాతడు నీటిజాలు దాటి వాగుమధ్య అడ్డువద్ద నాగెను.

మాచయ తెల్లని ధ్వజము ముమ్మారువీచి ఆవలి నాయకుని రమ్మని సంజ్ఞ చేసెను. ఆతడు రాగానే రెండు పత్రముల ప్రతులుచూపి 'ఈ పత్రముల ప్రతులు దుర్గాధిపతులకు చేరలేదా?' యని ప్రశ్నించెను. "అది మాకు తెలియదు. అనుమతి లేకుండ అడుగుపెట్టినవారిని నిర్మూలింపుమని మా కాజ్ఞలు కలవు. అడుగు కదలవద్దు!" అని నాయకు డాదేశించెను.

మాచయ తన్ను దుర్గాధిపతి దర్శనమునకు గొనిపొమ్మన, నాతడు వెడలి అనుజ్ఞపొందివచ్చి మాచయను ఒక్కని రమ్మని యనుజ్ఞయైనదని తీసికొని పోయెను.

మాచయ వినీతుడై దుర్గాధిపతికి నమస్కరించి తనయొద్దనున్న పత్రములు మౌనముగా సమర్పించెను. వల్లభరాయ డవి చూచుచునే త్రుళ్లిపడెను. ఆతడు ఆశ్చర్యము సందేహము ప్రకటించు చూపుతో మాచయను ఆపాదమస్తకము తీక్ష్ణముగా పరిశీలించెను.

"పెద్ద దోపిడిమూక ఆయుధములతో దేశమును కొల్లగొట్టుచు నిటు వచ్చుచున్నదని మాకు వార్త వచ్చినదే?"

"అదేమో, మే మెరుగము ప్రభూ!"

"మొన్నటి యుదయమునుండి నిన్నటి అపరాహ్ణమువరకు పులిపాడులో విడిసియున్నది ఎవరు?"

"మేమే ప్రభూ!"

ఆ మాటలు విని వల్లభరాయుడు కోపముతో "అక్కడి కరణము ఇంటిలో బలవంతముగా ప్రవేశించి, తిష్ఠవేసి, కాపు ఇంటినుండి ఆహార సామగ్రికొని, దొడ్డినుండి గ్రాసాదులు దోచుకొని కొన్ని యిండ్లలోని గృహస్థులను తోలివేసి ఆక్రమించుకొన్నది కూడా మీరేనా?" అని యడిగెను.

మాచయ నిశ్చలముగా "జరిగిన విషయములు తమరు సెలవిచ్చునట్లే చాలవరకు జరిగినవి కాని దోపిడీకాదు. శిక్ష!" అనెను.

"మీతో సాయుధసేన ఎంత యున్నది?"

"సేనయా? ఏమియులేదు. మా ధన ప్రాణ రక్షణకై సాయుధులైన ఇరువదినాలుగు రాశ్వికులు పదునాల్గుమంది పదాతులు ఐదుగురు మల్లులు నున్నారు."

అప్పుడా డేరాలోని తెరచాటునుండి పులిపాడు కరణము కాపు, నేడు, బయటకువచ్చి, "దండములు ప్రభూ! ఈ కరణమే పెద్ద గజదొంగ, అబద్ధమాడుచున్నాడు. ఐదువందలమంది సాయుధ భటులున్నారు— కాదు—కాదు నేను లెక్కపెట్టినాను. తొమ్మిదివందల తొంబదియారు మంది ఉన్నారు"— అనిరి.

"దుర్గాధిపతి మీ పరివారమెంత యున్న" దనెను.

"పండితులు, స్త్రీలు బాలురు, వంటలవారు మంగలులు, చాకలులు అందరు కలసి సరిగా నూటఎనమండుగురు!"

దుర్గాధిపతికి మాచయ మాటలలో పొల్లుముక్క కానవడకపోవుటచే విశ్వాసము కలిగెను. ఆలోచించి నాయకునికి ఇట్లాజ్ఞ యిచ్చెను.

"నాయకా, నీ వీ కరణముతోపోయి యాత్రికులలో ఆరుగురిని తప్ప తక్కినవారిని నిరాయుధుల గావించి సగౌరవముగా తోడుకుని రమ్ము. స్త్రీ జనమును మా స్త్రీజనముల పట కుటీరము లోనికి చేర్పించు. మన సైనికులను, ఆయుధములు దింపియుండుడని ప్రకటన చేయుము!"

నాయకుడు ముందు తమ భటులను, ఆయుధములు దింపివేయ నాజ్ఞాపించెను. అంతట కొండవీటి కరణముతోపోయి సరిహద్దున అడ్డుదడి తీయించి, అక్కడినుండి దుర్గాధిపతి పటకుటీరమువరకు తన భటులను ఇదువిండ్లదూరమున రెండుబారులు తీర్చి నిలిపెను. శ్రీనాథునిపరివారములో ఆరుగురివితప్ప తక్కినవారి యాయుధములు తన భటుల స్వాధీనము చేయించి శ్రీనాథునకు నమస్కరించి 'ఇక దయచేయవచ్చు'ననెను.

ఇప్పుడు శ్రీనాథుని యాజ్ఞచే సన్నాయి ముందుకుసాగి జయగీతము పాడెను. వందిమాగధులు శ్రీనాథ కవి సార్వభౌముని బిరుదావళి ప్రకటించు కైవారము లొనర్చిరి. దుగ్గన పోతనలు విజయ ధ్వజములతో జయఘోష లొనర్చిరి. వేదవిదుల స్వస్తి వాచన పురస్సరముగా పల్లకి దుర్గాధిపతి డేరాముందు దిగినది. శ్రీదేవిమేనా దుర్గాధిపతి పత్ని పటకుటీర ద్వారమున నాగినది.

పల్లకిదింపిన సడి విన్నంతనే వల్లభరాయుడు ఆనందము విరిసిన ముఖముతో ఎదురువచ్చి శ్రీనాథునకు కైదండయొసగి లోనికి గొంపోవుచు, "ఎంతటి మహాభాగ్యము! ఇది ఎంత సుదినము!" అనుచు ముందు శ్రీనాథాదులను సుఖోపవిష్టులగావించి పులిపాడులో జరిగిన దేమని ప్రశ్నించెను. శ్రీనాథుడు మాచయవంకతిరిగి 'పులిపాటి వృత్తపత్రిక రాజధానికి పంపితివా?' యని యడిగెను.

'చిత్తము. తమ యాజ్ఞకొరకు పంపక వేచి యున్నాను' అని దస్త్రములోనుండి తీసి శ్రీనాథున కందిచ్చెను. శ్రీనాథు డందుకుని మరియు నందు తన గంటముతో నిట్లు లిఖించెను.

"ఊరు వ్యాఘ్రనగర! మురగంబు కరణంబు
కాపు కపివరుండు! కసవు నేడు
గుంపుగాగ నిచట గురజాలసీమలో
ఓగు లెల్లగూడి రొక్కచోట
విద్యాధికారీ శ్రీనాథః"

అట్లువ్రాసి యా పత్రమును మాచయచే వల్లభరాయుల కిప్పించెను.

రాయ డది చదువుకొనుచు ముందు రోషారుణ నేత్రుడై, తుదకు ఆపుకొనలేక కడుపుబ్బనవ్వ సాగెను. పులిపాడు గ్రామోద్యోగులకై వెనుదిరిగి చూడగా వా రక్కడ కనిపింపలేదు. ఇంతలో వారిని భటులు కట్టితెచ్చి డేరాక్రింది సందునుండి పారిపోవుచుండగా పట్టుకుని తెచ్చితిమని విన్నవించిరి.

వల్లభరాయుడు శ్రీనాథునితో "ఈ పత్రము కొండవీటికి పంపవచ్చును. వా రేమిశిక్ష విధింతురో మాకు తెలియదు. మాచేత వృథాగా ఇంత సేనా సన్నాహము చేయించినందుకు విచారించి కొంచెమైనను శిక్షింపక తప్పదు" అని ఆ పత్రము నా ముగ్గురికిచూపి 'మీరేమైన చెప్పుకొనునది ఉన్నదా' అని యడిగెను. వారు చిత్తము, చిత్తము, చి..చి.. చిత్తము అనుచు వంగి దండములుపెట్టుచు నిరుత్తరులై యుండిరి.

"నాయకా, ముందు కరణమును నిలువబెట్టు!" నాయకు డట్లు చేయ, "నీపేరేమి?" అనెను.

"నాగయ్య ప్రభూ!"

"కాదు ఉరగము! శ్రీనాథభట్టు సెలవిచ్చినారు. రొమ్ముతో ప్రాకు విషకీటకమవు! అక్కడినుండి రొమ్ముతో ప్రాకిపోయి వారి పాదములు పట్టుకో!" అత డట్లు చేసినంతట కాపును నిలువబెట్టిరి.

"నీ పేరేమి?"

"హనుమంతయ్య!"

"కాదు కపివి. నీని వీపుకు తోక తగిలించి ఈ డేరాకు ముమ్మారు ప్రదక్షిణము చేయించు!"

అది జరిగిన తర్వాత నేడును నిలువబెట్టిరి.

"నీపేరేమి?"

"గడ్డయ్య!"

"సరిగా చెప్పినావు. వీనినోట గడ్డి కరిపించి డేరాకు ముమ్మారు ప్రదక్షిణము చేయించు!"

అదియైన తర్వాత ఆ ముగ్గురిని నిలువబెట్టిరి.

"మీ యూరిపేరేమి?"

"పులిపాడు ప్రభూ!"

"శ్రీనాథభట్టోపాధ్యాయులు వారి సంస్కృత భాషాభిమానముచే మీ యూరికి లేని గౌరవ నామమిచ్చి కొంచెము అనౌచిత్యమే ప్రదర్శించినారు. వ్యాఘ్రపురమేమిటి? పులి—పాడే! మా సీమలోనైనచో రేపీపాటికి పాడు పెట్టించి పేరు సార్థకము చేయించిడందును. పొండి! ఒళ్లుదగ్గర పెట్టుకొని బ్రదుకండి!"

వారు వెళ్ళినతర్వాత వల్లభరాయుడు శ్రీనాథుని వంకతిరిగి "మీ సప్తశతిలోని పద్యములు శృంగార నైషధములోని గద్య పద్యములు అన్నియు నాకు కంఠస్థములు. విద్యాధికారులు పరీక్షింపవచ్చును!" అనెను.

శ్రీనాథుడు 'తక్కిన వక్కరలేదుకాని నా వ్యాఘ్రపుర నామములోవలెనే అనౌచిత్యములు గుర్తించినవి మూడు సెలవిండు!' అనెను.

వల్లభరాయుడు పొంగిపోయెను. "అది నెమ్మ

దిగా రాత్రికి! ముందు రాజవ్యవహారము మనము చూడవలెను!—సరేకాని ఈ అట్టహాసమేమిటి? ఈ సన్నాయి కొండవీటికి పంపివేయండి. ఆరుగురిని భటులనో, ఆశ్వికులనో సాయుధులనో ఉంచుకొనుటకు శ్రీ విద్యానగరమునుండి యనుమతి వచ్చినది. వారినుంచుకొని తక్కిన భటులను పంపివేయండి. తక్కిన పరివారము సంగతి మీవెంట చేయవచ్చును"

"మావెంట పదివేల సువర్ణముల భారమున్నది. స్త్రీ జనమున్నారు. ఈ యడవులలో రక్షణలేనిది యాత్రసాగుటెట్లు?"

"మీ సువర్ణమెంతైనను భయములేదు. అది మా అచ్చుకావలి కప్పగింతును. దారిలో సెలవైపదిపోను తక్కినది మీకు విద్యానగరములో నప్పగించునేర్పాటు చేసెదను."

"మరి మా రక్ష?"

"మా రాజ్యములో సుగ్రీవాజ్ఞ చెల్లుచున్నది. మా రాజధాని సుగ్రీవ రాజధానియగు పంపాక్షేత్ర సీమగదా! మా రాజమార్గములు నిష్కంటకములు. ఐనను క్రూరవ్యాఘ్రాదులవలని భయములేకుండ మా రక్షకభటులే మీ పరివారమును రక్షచేయ నాజ్ఞలు వచ్చినవి. మీరు చేయబోవు మజిలీలన్నిటిలో సమస్త సౌకర్యములు—వైద్య సహాయముతో సహా ఏర్పాటైనవి."

శ్రీనాథు డంగీకరించెను. అంతట నించుక సందేహించుచు వల్లభరాయలుపక్రమించెను.

"శ్రీనాథభట్టా, మీరు నిజముగా కవి సార్వభౌములే. మీ రిప్పటికి పొందిన యితర బిరుదములును ఉచితములైనవే. కాని యవి మీకు కొండవీటి రాజ్యములో లభ్యమైనవి. అవి మా విద్యానగర రాజ్యములో చెల్లనేరవు!—"

శ్రీనాథుడు ఆశ్చర్యముతో తలయెత్తి ప్రశ్నించుచున్నవానివలె చూచుచుండ వల్లభరాయుడు సాగించెను.

"అవును! ఆ బిరుదలాంఛనములు మా విద్యానగర రాజ్యములో ధరించుటకు అనుజ్ఞలేదు. మరల మా ప్రభువుల సమక్షములో నట్టి బిరుదములో అధికమైనవో పొందినచో మా రాజ్యములో చెల్లును. కావున మీ యీ బిరుద లాంఛనము లన్నియు ఇక్కడనుంచి పోవలెను. మీరు తిరిగి కొండవీటిరాజ్యమునకు వెళ్ళునపుడు కొనిపోవచ్చును. మా దుర్గములో నంతవరకు భద్రముగా ముద్రలతో పదిలపరపించెదను."

ఆ మాటలు మర్యాదగా నున్నను నిష్కర్షగా మున్నవి. శ్రీనాథునకు సందు దొరకలేదు. "మీ రన్నది బాగున్నది. మా బిరుదము లీ నారివాగుకడ శ్రీశైలపర్వతదుర్గములో నుంచెదను. మా వందిమాగధులను గూడ పంపివేసెదను—దుగ్గనా, మన బిరుద లాంఛనములన్నియు తీసికొనిరా!"

దుగ్గనయు, పోతనయు వడి వడి నవి తెచ్చుచుండ వారినిజూచి ముచ్చటపడి వల్లభరాయుడు "ఈ కేతిగాళ్ళు ఎవరు?" అని యడిగెను.

"కేతిగాళ్ళుగారు. ఒకరు హనుమంతులవారు. సంజీవి పర్వత హర్తలు. ఒకరు జాంబవ—కాదు గరుత్మంతులవారు అమృత హర్తలు!"

బిరుదు లాంఛనములన్నియు పెద్ద పెట్టెలో భద్రపరపించిన పిమ్మట వల్లభరాయడులేచి "తమ రిప్పుడు కేవల శ్రీనాథభట్టోపాధ్యాయులరు. నాకు పరమపూజ్యులరు. కామకాయనస విశ్వామిత్ర గోత్రః ఆశ్వలాయనసూత్రః వల్లభరాయ శర్మా అహంభో అభివాదయే!" అనుచు భక్తితో పాదాభివందనము చేయ, నాతని వైదికనిష్ఠకును ఔచిత్యమునకు ప్రీతుడై శ్రీనాథుడు మనసార నాశీర్వదించెను.

శ్రీనాథుని సపరివారముగా వల్లభరాయుడు బలవంతపెట్టి వినుకొండలో తన మందిరమునకే కొంపోయి రాజభోగముగా నాతిథ్య మొసగెను. అంతట నారాత్రి విద్యా వినోదము సాగినది. వల్లభరాయుడు సాయంకాలము వాగ్దానము చేసినట్లు శృంగార నైషధములోనుండి మూడు పద్యములు వినిపించి మూలముతో పోల్చి అ నౌచిత్యములు నిరూపించెను. అందులో మొదటి దిది :

"పవి సంగంబున దాసమొందిన
శచీప్రాణేశు కెంగేలికిం
జివురుం గైదువుజోదు వైద్య
ముపదేశించెన్ రహస్యంబుగా



గోపాలం :- ఏమండోయ్! శర్మగారు ఏమిటి తెగ కోస్తున్నారు.

శర్మ :- రామరామ! ఏం లేదండి. మీారు ధర్మాత్ములు, గొప్పవారు అని చెబుతున్నాను.

శ్రీదేవి, భూదేవి. (గవరేశ్వరం)



నవనీహార పయోమిళన్మలయజ
స్నానార్ద్ర పర్యంతమై
యువతాళించు విదర్భ రాజతనయా
హృద్య స్తనద్వంద్వమున్.

మూలమున స్వాగతవృత్తములో పవిత్రమగు కరగ్రహోపదేశముండగా మీరు వృథాగా వేశ్యలకు చెప్పినట్లు మరొక గ్రహణమును మత్తేభములో రెండు పాదములలో సాగించి ఉపదేశింపజేసినారు. దానిమీదను మిగిలినవానిమీదను పండితులు కొందరౌను కొందరుకాదు అని వినోదముగా వాదించిరి. శ్రీనాథుడు వల్లభరాయల నిశిత పరామర్శకు సంతసించి'

"ప్రాతఃకాలము వాయసంబులు
పణిన్యాపత్యోక్త శాస్త్రంబులో
దాతజ్ఞస్థానులు సెప్పు డెవ్వియను
చందం బొప్ప గౌకేయనం
జాతుర్యం బలరార నుత్తరము
విస్పష్టంబుగా గోకిల
వ్రాతంబిచ్చె తుహీ తుహీ యని
గృహారామ ప్రదేశంబులన్."

అను పద్యము చదివి "ఇట్టిచోట్ల సంస్కృతమునకు డుమువులు చేర్చినామని కొందరి మతము. మీ అభిప్రాయమేమి?" అని యడిగెను.

"అయ్యయ్యో! ఆ మాటలనువారు భట్టహర్షుని కవితానుగుంభములు కొనియాడలేని సోమరిపోతులు. లేజవరాలు చెక్కుగీటిన వసవల్చు బాలకులు డెందములం గలంగనేర్తురే? ఆపణి నాపత్యమువద్ద మావైయాకరణులు చిక్కుపెట్టుచున్నారు" అని వల్లభరాయలు ఉత్తరమిచ్చెను.

ఆ రాత్రి యందరు సుఖనిద్ర పోవుచుండగా పోతనకు ధనుర్ధరులగు నిద్దరు మునివేషధారులు శోకక్లిన్నముఖములతో కనిపించినట్లై 'సీతే సీతే' అను పిలుపులు విని ఉలికిపడిలేచెను. ప్రక్కనే నిదురించుచున్న దుగ్గనను లేపి చెప్పగా, 'పడుకోరా పోతనా' ఇదేమీ క్రొత్తకాదు. పూర్వము రామలక్ష్మణులు ఇక్కడనే సీతాపహరణ వార్త జటాయువువలన విని పలవించిరి. వారి ఆర్తధ్వని నేటికిని ఈ శ్రీశైలపర్వత కందరములు ప్రతిధ్వని తీనుచుండును. అదుగో నాకును ఆ పిలుపు వినబడుచున్నది" అని చెప్పెను. వా రిద్దరు చాలసేపు రామాయణ కథా ప్రసంగస్మరణములు చేయుచు నిద్రించిరి. తెల్లవారుజాముననే శ్రీనాథుడు పయనమయ్యెనుగాని వల్లభరాయుడు ఆపి, తన యాస్థాన నటులచే రావిపాటి త్రిపురాంతక రచితమగు ప్రేమాభిరామమును సంస్కృతవీథిని ప్రదర్శింపజేసెను. దానిని తా నాంధ్రీకరించుచున్నానని కొన్ని పద్యములు వినిపించెను.

ఆ మధ్యాహ్నమే శ్రీనాథుడు సపరివారముగా ప్రయాణమగుచుండ, వారిని సాగనంపుటకై వల్లభరాయుడు అశ్వారూఢుడై కొంతదవ్వరుగుదెంచెను. పురద్వారము దాటగానే శ్రీశైల పర్వతారణ్యముల వైపుననుండి నలుగురు చెంచు యువతులు వారి కెదురైరి. వల్లభరాయని దృష్టి వారి యందముపై ప్రసరింపగా, దుర్గాధిపుని దృష్టి ననుసరించి శ్రీనాథ కవిదృష్టియు నటు మరలినది.

"శ్రీనాథ కవీంద్రా, మీకు శుభ శకునమైనది. సెలవుతీసికొందును. మీకు సమ్మతమైనచో మీ రాకకు స్మృతిచిహ్నముగా నా కొక చిన్న పద్యము ప్రసాదింతురా?'

"మీవంటి సహృదయార్థిని రిక్తహస్తములతో పొనిత్తునా!"

"గిటగిటనగు వెన్నడుములు
పుట పుట నగు చన్నుగవలు పున్నమనెలతో
జిటపటలాడెడు మొగములు
కటి తటములకొమరు శబరకాంతల కమరున్."

"మహాప్రసాదము కవీశ్వరా, సెలవు!" అనుచు శ్రీనాథుని యాశీర్వాదముపొంది వల్లభరాయడు తిరిగిపోయెను.

ఆతడు దూరముపోయిన తరువాత అశ్వారూఢులై యుత్సాహముతో పోవుచున్న దుగ్గన, పోతనలు ఇట్లు బిగ్గరగా సంభాషణ మారంభించిరి.

పోతన : మీ బావ కవిత్వమంటే వినుకొండ రాయలకు ఎంత యభిమానము! మా రాచకొండలో ఎందరికో శృంగారనైషధములోనివి, శాలివాహన సప్తశతిలోనివి ఎన్నెన్నో పద్యములు నోటికి వచ్చును. కాని యింత సూక్ష్మముగా అన్ని నోటికి

వచ్చినవారు కొండవీటిలో గూడ కనపడలేదు.

దుగ్గన : ఇంకొక చమత్కారము గమనించావా ! నేటి ఉదయమునుండి రాయడు మా బావని నిలిచే తీరు మాట్లాడబోయే వైఖరి కూర్చుండే పద్ధతి, నడిచేవిధము, పద్యముచదివే ఫక్కి—అన్నీ వంకరలతో సహా, అనుకరిస్తున్నాడు. పరిహాసమేమో అని మొదట నాకు కొంత కోపము రా సాగినది. తుదకు గౌరవమే అని తేల్చుకున్నాను.

పోతన : అంతేనా నీవు గమనించినది!

దుగ్గన : ఆయన క్రీడాభిరామము పద్యాలు సరిగా మా బావ పద్యాలే అనుకున్నాను. చెప్పకపోతే మా బావ వ్రాసినవే హరించినా డనుకొనేవాడను.

పోతన : వెర్రి దుగ్గన్నా, ఏమి నీ తెలివి తేటలు! ఆయన పద్యాలలో మీ బావ పద్యాలలో లేని రెండు విశేషాలున్నవి.

దుగ్గన ఉలిక్కిపడి ఎర్రవడ్డ ముఖముతో "ఏమిటో అవి?" అన్నాడు

పోతన : ఏమిటా? చెప్పమంటావా? పద్యము ధాటీగా సాగిపోతూ మధ్య నీరస నిరర్ధకపదాలు పడడము ఒకటి. ఆ తీగ సాగుడులో వ్యాకరణ దోషాలు దొర్లడము, రెండు.

దుగ్గన పకపక నవ్వినాడు. ఈ సంభాషణము శ్రీనాధుని చెవులలోబడి, 'వృద్ధిలోనికి రాదగినవారే' అనుకొనెను.

వల్లభరాయడు అన్నట్లే వారి విజయనగర యాత్ర యెట్టి యొడిదుడుకులు లేకుండ సాగు

# కవిసార్వభౌముడు

చున్నది. రోజు కు సామాన్యముగా రెండు యోజనములచొప్పున పరిక్రమించుచున్నారు. మహాశివరాత్రినాడు, నిలిచిన బసలోనే ఉపవసించి శ్రీశైల మల్లికార్జునుని దిక్కుమొగమై మహాశివరాత్ర దీక్షానియమముతో యామము లెనిమిదింటను రుద్రాభిషేకములు కావించి మరునాడు విందు కుడిచి ప్రయాణమైరి.

వారి యాత్రలో మధ్య మధ్య నొక్కటే చిక్కు తటస్థించుచు వచ్చెను. వెంట దెచ్చుచున్న వరిబియ్యము తరుగుచు వచ్చినప్పుడు మజిలీ గ్రామములలో బియ్యము దొరకనందున అప్పుడప్పుడు జొన్నన్నము, సజ్జన్నము, మొక్కజొన్నన్నము తినుట తప్పుటలేదు.

అట్లు జొన్నన్నము ప్రాప్తమైన మొదటి రోజున భోజనవేళలో ఎవ్వరికి ముద్ద మ్రింగుడు పడలేదు. లక్కనసూరి శ్రీనాధు డర్చించు మహేశ్వరుని సంబోధించి యిట్లనెను.

"గరళము మ్రింగితి నంచుం
బురహర, గర్వింపబోకు, పో పో పో నీ
బిరుదిపుడు కానవచ్చెడి
మెరసెడి రేనాటి జొన్నమెదుకులు తినుమీ!"

శ్రీనాధుడు "మా మహేశ్వరు డివియు హరించుకొన్నాడు. చేతకానిది మనకే!" అనెను.

అట్టి యవస్థయే కుందుగడ్డలో తటస్థించినది. గ్రామీణు లాదరించి పుష్కలముగా సరకు లిచ్చి భోజనార్థమై పచ్చి ముత్యములవలె మెరమెరలాడుచున్న మొక్కజొన్న లొసగిరి. జనులు మరి యొక ధాన్యము ఆరగింతురని కూడ ఎరుగనట్టి అమాయికులు. ఆ కొండభూములలో కష్టపడి పని చేయుటచే ఉన్నతకాయులై, బలిష్ఠులై యుండిరి. శ్రీ విద్యానగర ప్రభువుల సేనలో భటుల నెందరినో అక్కడినుండియే ఏరుకొనుచుండిరని గ్రామోద్యోగులు సగర్వముగా విన్నవించుకొనిరి. శ్రీనాధు డెంతయు ప్రీతుడై ఈ పద్యము చెప్పెను:

"మందరాద్రిసమములు మానవు లందరు
చందమామ కూన లిందుముఖులు
కందులేని మౌక్తికంబులు జొన్నలు
కుందనంపుబెడ్డ కుందుగడ్డ"

కరణము వెంటనే వూరి అగసాలిని పిలిపించి రాగిరేకుపై నా పద్యము వ్రాయించెను. ఇప్పటికిని ఆ యూరిలో రక్షరేకులపై నీ పద్యమే మంత్రమువలె లిఖించుచుందురు.

మొత్తముమీద నిట్టి చమత్కారములేతప్ప ఎట్టి విపరీతములు లేకుండ ప్రయాణము సాగినది. అట్లు సాగి సింగన ప్రధాని ముందుగా నిర్ణయించిన ప్రకారమే వారు కొండవీటినుండి బయలుదేరిన ఇరువదియొకటవనాటి మధ్యాహ్నవేళకు శ్రీవిద్యానగర బహిః ప్రాకార ప్రాచీగోపురము సన్నిధికి చేరికొనిరి. (సశేషం)

---

"అయింది .... అయింది" అంటూ తొందరగా గిన్నెను పొయ్యిమీది నుంచి కిందికి దింపింది యాది.

భార్య యిచ్చిన గ్లాసు అందుకుని, ఒక్క గుక్క 'చా' నోట్లో పోసుకున్నాడు మల్లన్న. వెంటనే కనుబొమలు పైకెత్తి భార్య మోహంలోకి వింతగా చూశాడు. అతని పెదవులమీద చిరునవ్వు చిందులు తొక్కింది.

"ఇయ్యాల పరేశాన్‌గా ఉన్నవేంటి యాదీ?" అన్నాడు మల్లన్న.

"గోడ నానుకుని, ఎటో చూస్తున్న యాది ఉలిక్కిపడి "ఎందుకు ? ఏమయింది ?" అని అడిగింది.

"ఇంకా ఏమయిందని అడుగుతున్నావ్ ? 'చా' లో శక్కరే ఎయ్యలేదుగదే ? ఎన్నడూ నువ్విట్ల సెయ్యలె. ఇయ్యాల ...."

అంతలో బయటినుంచి 'మల్లన్నా' అని కేకేశా రెవరో.

ముప్పై ఫ, నలభై ఇళ్ళున్న ఆ పల్లెకు మల్లన్నే నాయకుడు. మల్లన్నంటె ఆ పల్లెలోనివా రందరికీ గౌరవాదరాలున్నాయి. "మల్లన్న ఉండేదాకా మాకేం ఫికర్‌లేదు" అంటుంటారందరూ. ఎవరికి ఇబ్బంది కలిగినా, ఏ సమస్యలు ఎదురైనా మల్లన్నే పరిష్కరించాలి. ఆ పల్లె ప్రజలంతా ఒకే కుటుంబం, దానికి మల్లన్నే యజమాని.

"ఎవరు పోశమ్మనా ? దా పోశవ్వ దా !" అని లోపలికి ఆహ్వానించాడు మల్లన్న. పోచమ్మ లోపలికి వచ్చింది. ఆమెకు అరవైయేళ్ల వయసుండవచ్చు. ముడుతలుపడ్డ మోహం, జీవితంలో అనేక

# ఇజ్జత్

(25-వ పేజీ తిరువాయి)

"సత్తెనపల్లి సాయిగాడు మీ యింటికాడికి వచ్చిండంట గదా, ఏమన్నాడు పోశవ్వా ?" అని అడిగాడు మల్లన్న.

ఆమె తల బాదుకుంటూ అంది : "నా గాచారం మల్లన్న. మన నర్సిగాణ్ణి పట్కపోతరంట."

"ఆడ్నెందుకు పట్కపోతరవ్వ ? ఆడేం సేసిండంట ?"

"గా దొంగముండాకొడుకుల సావాసం సెయ్యకురా అని ఎన్నిసార్లు మొత్తుకున్నగాని నా మాట ఇనలేదు ఆడు. ఎప్పటికైనా యీడు పోలీసోల్ల సేతికి సిక్కక మానడు అని నాకు ముందే ఎర్క. నాకు ఆడొక్కడే కొడుకు. ఇగ నేనుగూడ ముసలి ముండ నయిపోయిన. నా మీదన్నా ఆడికి ఇదుండొద్దా సెప్పు మల్లన్నా ? సెడ్డోల్ల సావాసం సేసిండు. తని లా సెడిపోయిండు. ఆడ్ని పోలీసోల్లు పట్కపోతరంట .... ఇగ నేనేం సేయాలె సెప్పు మల్లన్నా ...." అని రోదించసాగింది. పోచమ్మ.

"ఏడ్వకు పోశవ్వ. నే నున్న గద. అంతా సూసుకుంట. నువ్వు పోయి నరిసిగాణ్ణి తోల్కరా .... అట్ల ఎవర్నంటె అల్లని పోలీసోల్లు ఎట్ల పట్కపోతరు ? నే నడుగత." అంటూ తన భార్య తెచ్చిన రెండో గ్లాసులోని 'చా'ని త్రాగి గ్లాసును ఆమెకు తిరిగి ఇచ్చాడు. యాది మోహంలో భయాందోళనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఇంటికి వెళిన పోచమ్మ పది నిముషాల తరువాత మళ్ళీ తిరిగివచ్చి మరింత బిగ్గరగా ఏడవ నారంభించింది.

"ఏడవకు పోశమ్మ. నర్సిగాడు వచ్చిండా?" అని అడిగాడు మల్లన్న.

"ఆడింట్లో లేడు మల్లన్నా, ఎల్లిపోయిండు. యాడికి పోయిండో ఏమో ! .... పోలీసోల్లకి సిక్కకుంట పారిపోయిండేమో .... అయ్యో .... ఇగ నేనేంసేతు మల్లన్నా ?"

"నువ్వేం ఫికర్ సేయకు పోశవ్వ. నేను ఆడ్ని ఎతికిపిస్త. నా పానాలయిన ఇచ్చి, ఆడి పానం కాపాడుత. సరేనా ? ఇగ వూకో ...." అని ఆమెను సమాధాన పరిచాడు మల్లన్న. పోచమ్మ కళ్లనీళ్లు తుడుచుకుంటూ అక్కడినుంచి వెళ్లిపోయింది.

అప్పటికప్పుడే వూళ్లో వాళ్లందరూ మల్లన్న ఇంటిముందు గుమిగూడారు. వాళ్లల్లో ఎవరికీ నరిసిగాడిమీద కొంచెం కూడా సానుభూతి లేదన్న విషయం మల్లన్నకు బాగా తెలుసు. నరసిగాడి వలన ఏదోఒకవిధంగా బాధపడినవాళ్ళే అందరూ. వాడు ఒకరి కోళ్లను దొంగలిస్తే మరొకరి మేకలనే దొంగలించుకుపోయాడు. ఎందరిండ్లకో కన్నం వేసి డబ్బును దోచుకున్నాడు. కొందరు ఆడవాళ్లను చెరిచాడు. మరికొందరు స్త్రీల జీవితాలను నాశనం చేశాడు. ఇంకొందరికి దేహశుద్ధి చేశాడు. ఒక్కటేమిటి—అన్నివిధాలుగా వూళ్లో వాళ్ళందరినీ బాధపెట్టాడు. బాధపెట్టి వాళ్లకు విరోధి అయ్యాడు.

వాడిని మంచి మార్గంలోకి తీసుకురావడం ఎలాగా అన్నదే పెద్ద సమస్య అయి కూచుంది మల్లన్నకు, వాడిని వెలివేసి పల్లెనుండి తరి

మెయ్యడ మేమీ కష్టమయినవని కాదు. వాడిని పల్లెనుండి వెళ్లగొట్టమని ఎంతోమంది, ఎన్నోసార్లు చెప్పారు కూడా. కాని పోచమ్మ మొహంచూసి వాణ్ణి వదిలేశాడు మల్లన్న. ఇప్పుడు మళ్లీ ఇదొకటి !

"గీ నర్సిగాడి దెకెల్లి మనం బతికేటట్టు లేము" అన్నాడు ఒక రైతు.

"పోలీసోల్లు అణ్ణి పట్కపోతే పట్కపోని. మువ్వేం యిడిపించకు మల్లన్నా .... గా బద్మాశ్ గాడికి గిప్పుడైనా బుద్ధిరావాలి" అన్నాడు మరొకడు.

" ఔ, బాగైతది ఆడికి." అని అందరూ అన్నారు.

మల్లన్న కనుబొమ్మలు చిట్లించి వాళ్లను సూటిగా చూస్తూ అన్నాడు :

"నర్సిగాడు రౌడి, దొంగ, బద్మాష్ అంతా నిజమే. కాని నిన్నరాత్రి ఈడ్నే ఉన్నడుగద అడు. సత్తెంపల్లికి కాలే పెట్టని నర్సిగాణ్ణి పోలీసోల్లెందుకు పట్కపోతరు ? అడు దొంగతనానికి పోయి, కూని సేస్తే గా మాట యేరు. అడుగాడికి పోనేలేదు. అణ్ణి ఈడ్నే సూసినట్టు నాకు మంచిగ యాదున్నది. అన్నాయంగా అణ్ణి పోలీసోల్లు పట్కపోతుంటె వూకుండాల్నా నేను ?"

"నువ్వేమైనా అణ్ణి ఇడిపించనీకి పోయినవంటె నీమీదగూడ అనుమానం వస్తదేమో పోలీసోల్లకు" అన్నాడు ఇంకొకడు.

"నా మీదెందుకు అనుమానం వస్తది ? మల్లన్న ఎసుంటోడని ఇనస్పెక్టర్ సాబుకు గూడ తెల్సులే" అని మల్లన్న లేచి పొలంవైపుకు బయలుదేరాడు.

* * *

ఊరికి నాలుగు వైపులా మనుషులను పంపించి వెతికించడమైయింది. ఎక్కడా నరిసిగాడి జాడే లేదు.

ఒక వారం రోజులు గడిచిపోయాయి. నరిసిగాడిమీద వారంటు కూడా వచ్చేసిందన్న వార్త పల్లె అంతటా ప్రాకింది.

ఒకరోజు పోలీసులు వచ్చి, పల్లెలోని ప్రతి ఇంట్లోనూ గాలించారు కాని నరసిగాడు దొరకలేదు.

మల్లన్నను ఊరిముందున్న ఆంజనేయస్వామి గుడి దగ్గరికి పిలిపించి అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నిజంచెప్పు మల్లన్నా ! నర్సిగాడు ఎక్కడున్నాడు ?"

మల్లన్న తనకు తెలిసిన విషయాలన్నింటినీ వివరంగా చెప్పాడు. నర్సిగాడు నిరపరాధి అనీ, తనకు పూర్తిగా నమ్మకం ఉందని కూడా అన్నాడు.

"దానికి ఆధారమేమిటి ?" అనడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఈడ్నించి సత్తెంపల్లి నాలుగుమైళ్ళ దూరం ఉన్నది దొరా ! కూని జరిగింది అర్థరాత్రిల అంటున్నరు. గప్పుడు నర్సిగాడ్ని ఈడ్నే, నా కండ్లతోనే సూసిన .... "

"ఇక్కడే అంటె ఎక్కడ ?"

మల్లన్న కొంచెం తడబడుతూ అన్నాడు.

"ఈడ్నె అంటె గీ ఊళ్లోనే. ఏ జాగల అన్నది మాత్రం సరింగ యాదులేదు. నిజంగా ఆయాల నర్సిగాడు ఊళ్లోనే ఉన్నడు "

పోలీస్ ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ అడిగాడు : "సరిగ్గా జ్ఞాపకం లేదన్నమాట. ఎందుకు ? ఆ రోజురాత్రి ఏమైనా వేసుకున్నావా ఏమిటి ?"

ఇన్‌స్పెక్టర్ ముందు అబద్ధం చెప్పడానికి మల్లన్న మనసొప్పలేదు. ఆ రోజు తాగినమాట నిజమే. కొంచెం మోతాదు మించి తాగాడేమో !

ఆ రోజురాత్రి జరిగిందంతా కొంచెం కొంచెంగా గుర్తుకొచ్చిం దతనికి. గుడంబా తాగిన మైకంలో ఒళ్ళుమరచి, పొలంలోని మంచెమీదే పడుకుని ఉన్న తనకి అర్ధరాత్రప్పుడు చల్లటిగాలికి మెలుకువ కలిగింది. ఎముకలు కొరికే చలి. ఆ చలికి తట్టుకోలేక, సగం మైకంలోనే గొంగడి తెచ్చుకునేందుకు ఇంటికి వెళ్లాడు తను. పైరు కోతకు వచ్చినందువల్ల మళ్లీ పొలానికి వెళ్లవలసి వచ్చింది. కోతలు ముగిసేవరకూ అతను పొలంలోనే మంచెలో ఉంటూ కాపలా కాయాలి. లేకపోతే పంట దొంగలపాలవుతుంది. ఇంటికి వెళ్లేటప్పుడు

ధరలు దిగజారి, వ్యాపారం మ్యానేసే పరిస్థితి ఏర్పడ్డది. వ్యాపారస్థుడు లెక్కలతో కుస్తీ పడుతున్నాడు.

గుమస్తా:-అయ్యగారూ ! అమ్మగారు మేడమీద నుంచి జారపడ్డారట!

వ్యాపారి:-అలాగా ఇకలాభం లేదు. వెంటనే అయినకాడికి అమ్మేసెయ్యవోయ్!

పి. రాధాకృష్ణమూర్తి (గుంటూరు)

ఎక్కడో నర్సిగాణ్ణి చూసినట్టు గుర్తు ..... వాడు నర్సిగాడే నన్న విషయంలో ఏ మాత్రం సందేహం లేదు తనకి.

మల్లన్న బుర్ర గోక్కున్నాడు. తను నర్సిగాణ్ని ఎక్కడ చూశాడు ? ఎంత ప్రయత్నించినా గుర్తుకురాదేం ! నర్సిగాడి చావు బ్రతుకులు ఆమాటమీదే ఆధారపడినందువల్లనేమో ఎంతకీ గుర్తుకొచ్చి చావటంలేదు.

"ఆయాల నేను తాగినమాట నిజం దొరా. నర్సిగాణ్ణి చూసింది గూడా నిజమే."

"తాగిన మైకంలో నీకు వాణ్ని చూసినట్టు భ్రమ కలిగిందేమో ! .... అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"లేదు దొరా. సత్తెంగ సూసిన. నర్సిగాడికి, గాకూనికీ ఏమీ సమ్మందం లేదు."

"సంబంధం లేకపోతే వాడెందుకు పారిపోవాలి మరి ?"

"మీవోళ్లు పట్కపోతరని బుగుల్‌పడి పారిపోయుండొచ్చు దొరా !"

"అవును వాణ్ని పట్టుకునేపోతాము" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పది పదిహేను రోజుల తరువాత నర్సిగాణ్ని బంధించారన్న వార్త పల్లె ప్రజల కందరికీ తెలిసింది.

• • •

కేసు విచారణ ప్రారంభమయింది.

పోలీసుపక్షంవాళ్లందరి సాక్ష్యాలు పూర్తయ్యాయి. ఇక ముద్దాయివైపు వాళ్ల సాక్ష్యాలు తీసుకోవడం మాత్రమే మిగిలివుంది.

పోచమ్మకు మాటిచ్చిన ప్రకారం మల్లన్న నర్సిగాణ్ని విడిపించడానికి చేయవలసిన ప్రయత్నమంతా చేశాడు. నర్సిగాడి తరఫున వాదించడానికి ఒక ప్లీడరుని నియమించి ఆ ఖర్చులు కూడా తనే భరించాడు.

పోలీసు స్టేషనులో నర్సిగాణ్ని కలుసుకుని, ఆరోజు జరిగిన విషయాలన్నీ వివరంగా తెలుసుకోడానికి ప్రయత్నించాడు ప్లీడరు. కాని లాభంలేకపోయింది.

"ఆరోజు రాత్రి మల్లన్న నిన్ను చూశాడట. ఎక్కడ చూశాడో చెప్పు. ఆ సంగతి గనుక ఉన్నది ఉన్నట్టు చెప్పావా బతికిపోతావు. మల్లన్న సాక్ష్యం, మరియొకరి సాక్ష్యం ఉంటే నువ్వు విడుదల అవుతావు" అని ఎన్ని విధాలుగా ప్రశ్నించినా, నర్సిగాడు స్పష్టంగా ఏసంగతి చెప్పలేదు.

"ఆయాల నేను వూళ్లోనే ఉన్నది, మల్లన్న నన్ను సూసినది అంత నిజం. కాని ఎక్కడ సూసిండో సరింగ సెప్పనిక్కరాదు." అని సమాధానం చెప్పి వూరుకున్నాడు.

ఆరోజు రాత్రి వాడిని ఎక్కడ చూసిందీ మల్లన్న కూడా చెప్పలేకపోయాడు. తన కొడుకు ఆ రాత్రి ఇంట్లోనే ఉన్నట్టు పోచమ్మ వాదించినా ఆ ముసలిదాని సాక్ష్యంతో మాత్రమే వాడ్ని విడిపించడానికి సాధ్యమవదు. ఆ పల్లెలో నర్సిగాడి తరఫున సాక్ష్యం ఇవ్వడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు.

మల్లన్నకంతా అయోమయంగా ఉంది.

"ఏంసేస్తం వకీల్‌సాబ్. బగవంతుడు సేసినట్టవుతుంది. మా ఇద్దరి సాక్ష్యంతో ఏమైతే అదే కాని .... " అన్నాడు ప్లీడరుతో.

కేసు గెలిచే అవకాశం ఏమాత్రం లేకపోయినా ఏదో ఒప్పుకున్నందుకు యాంత్రికంగా పని చేస్తున్నాడు ప్లీడరు.

ముద్దాయివైపు సాక్ష్యం తీసుకునే రోజు వచ్చింది.

మల్లన్న సాక్ష్య మివ్వడానికి బోనులో నిలబడ్డాడు.

ముందే ఆలోచించి పెట్టుకున్న ప్రశ్నలను ఒక్కటొక్కటిగా అడగ నారంభించాడు ప్లీడరు.

"ఆరోజు రాత్రి పల్లెలోనే నర్సిగాడ్ని చూసినట్టు చెప్పావుకదా, ఆ అర్ధరాత్రప్పుడు నువ్వెక్కడికి వెళుతున్నావ్ ?"

"చేనులో కాపలా కాయటానికి. అడ్నే పడుకున్న దొరా. శానా సలి పెడ్తే, గొంగడి తెచ్చుకుందకని ఇంటికిపోయిన "

"ఇంట్లో ఎవరున్నా రప్పుడు ?"

"మా ఇంట్లో మేమిద్దరమే ఉండేది దొరా. ఆయాల నా పెండ్లాం ఒక్కతే ఇంటికాడున్నది."

హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది ప్లీడరుగారికి. ఇన్నాళ్లు ఈ ఆలోచనే రాలేదే అనుకున్నాడు.

నర్సిగాడు దొంగ, రౌడీ, కనబడ్డ ఆడవాళ్లనందరినీ చెరిచే నీచుడు .... అయితే .... ఆరోజు రాత్రి వాడు .... అవును అదే అయిఉంటుంది బహుశా.

'ఆరోజు రాత్రి ఎక్కడున్నావ్?' అని ప్రశ్నించిన దానికి వాడినుంచి సరైన సమాధానం రాకపోవడానికి కారణం అదేనేమో! ....

అంతవరకు యాంత్రికంగా ప్రశ్నలు వేస్తున్న ప్లీడరుకు ఇప్పుడు నవచైతన్యం వచ్చినట్టయింది. ముందే ఆలోచించిపెట్టుకున్న ప్రశ్నలు కాకుండా మరొక కొత్త ప్రశ్న వేశాడు.

"ఆరోజు రాత్రి నువ్వు నర్సిగాణ్ని చూసింది మీ యింట్లోనే కదూ మల్లన్నా?"

హఠాత్తుగా వచ్చిన ఆ ప్రశ్న విని వణికిపోయాడు మల్లన్న. నర్సిగాడు తనింట్లో? అందులోనూ అర్ధరాత్రప్పుడు? మల్లన్న మెదడు అమిత వేగంతో పనిచేయ నారంభించింది. అంతవరకు గుర్తుకు రాకపోయిన ఆ విషయం ఇప్పుడు స్పష్టంగా గుర్తుకొస్తోంది. అవును! తను వాణ్ని ఇంకెక్కడా చూడలేదు. తన ఇంట్లోనే చూశాడు. గొంగడి కోసం వచ్చిన తను తలుపు తట్టగానే లోపల ఏదో చప్పుడు వినిపించింది. యాది లేచివచ్చి వీధి తలుపు తెరవగానే పెరటి గుమ్మంలోంచి ఎవరో పరుగెత్తడం తను చూశాడు. వెన్నెల వెలుగులో వాడు నర్సిగాడేనని గుర్తుపట్టాడు కూడా .... మరుసటిరోజు లేచిన తరువాత వాడిని చూసిన సంగతి తప్ప మిగతా విషయాలన్నీ మరచిపోయాడు తను. అబ్బ! ఎంత మతిమరుపు తనకు? ఎంత మోసం జరిగింది?

"మల్లన్నా ....." ప్లీడరు హెచ్చరించాడు.

మల్లన్న ముఖం తిప్పుకున్నాడు. తల వంచుకుని కూచున్న తన భార్య మోహంలోకొకసారి చూశాడు. ఆమె ప్రక్కన కూర్చున్న పోచమ్మ మోహంలో ఆశాకిరణం మెరవడం చూశాడు. నర్సిగాడు ఆమెకు ఒక్కగా నొక్క కొడుకనే విషయం జ్ఞాపకం తెచ్చుకున్నాడు. తన ప్రాణాన్నయినా అడ్డుపెట్టి నర్సిగాణ్ని విడిపిస్తానని తను చేసిన ప్రతిజ్ఞ మనసులో మెదిలింది. అతని ముఖంలో రంగులు మారాయి. దేవుడు తనకెలాంటి పరీక్ష పెట్టాడు? .... ఆరోజు రాత్రి నర్సిగాడు తనింట్లోనే ఉన్నాడని చెపితే తన పరువు మర్యాదలన్నీ మంట గలిసిపోతాయి. అలా ఒప్పుకోకపోతే నర్సిగాడి ప్రాణం దక్కదు. వాడి తల్లితో తను ఆడినమాట నిలబెట్టుకోలేకపోతాడు. ఇప్పుడెలా?

మల్లన్న గుటక మింగాడు. గొంతు సవరించుకుని న్యాయమూర్తివైపు తిరిగి అన్నాడు.

"అవును దొరా, నేను నర్సిగాణ్ని చూసింది మా యింట్లోనే ......"

ప్రాసిక్యూటరుగారు క్రాస్ ఎగ్జామినేషన్ ప్రారంభించాడు.

# ఇజ్జత్

"నర్సిగాడు నీకేమవుతాడు?"

"ఏమీకాడు దొరా!"

"ఆరోజు రాత్రి నీ భార్య ఒక్కర్తే ఇంట్లో ఉందని చెప్పావు. మరి అర్ధరాత్రప్పుడు నర్సిగాడు మీ యింట్లో ఏం చేస్తున్నాడు?"

ఆ ప్రశ్నకు ఏమి సమాధానం చెప్పాలో తెలియక తల వంచుకుని మౌనంగా నిల్చున్నాడు మల్లన్న.

"చెప్పవేం? నర్సిగాడు అర్ధరాత్రప్పుడు అక్కడ ఏం చేస్తున్నాడు? నీ భార్యను వాడు వుంచుకున్నాడేమో?"

ఈ మాట విన్న మల్లన్నకు తన వంటిమీద పాములు, జెర్రులూ పాకినట్టయింది. కళ్లు బైర్లు కమ్మాయి. మాట్లాడడానికి ప్రయత్నించాడు కాని నోరు పెగిలి రాలేదు.

"అడిగిన దానికి సమాధానం చెప్పు. నర్సిగాడు నీ భార్యకు ప్రియుడా? లేకపోతే అర్ధరాత్రప్పుడు ఒంటరిగా వున్న ఆడదానింట్లో వాడికేం పని?"

మల్లన్న తలకొంచెం పైకెత్తి నెమ్మదిగా "నేను ఆడ్ని మా ఇంట్ల సూసిన మాట నిజం.

పంతులు:- దున్నేవానిది భూమి, అన్న చట్టం ఎప్పుడు వీలవుతుందిరా రాముా.

రాము:- ఉతికినవాడికి చొక్కా, చట్టం వచ్చినప్పుడండి.

పి. నరసింహామూర్తి (అనంతపురం)

కావాలంటే దాన్ని అడుగుదొరా" అన్నాడు. అనేసి మళ్లీ తల వంచుకున్నాడు.

చట్ట ప్రకారం యాది సాక్ష్యాన్ని కూడా తీసుకోబడింది. నర్సిగాడికీ, తనకీ చాలారోజుల నుండి రహస్యమైన సంబంధం వుందనీ వాడు ఆ రాత్రి తనతోనే వున్నాడనీ ఒప్పుకుంది.

నర్సిగాణ్ని విడుదల చేశారు.

* * *

ఆ రోజు సాయంకాలపు బస్సులో వాళ్లందరూ పట్నంనుంచి తమ పల్లెకు బయలుదేరారు. పల్లె చేరుకునేటప్పటికి రాత్రయిపోయింది. త్రోవలో ఎవరూ మాట్లాడలేదు. మల్లన్నయితే అసలు నోరే మెదపలేదు.

ఊరి ముందున్న ఆంజనేయ స్వామి గుడి దగ్గరికి రాగానే, అక్కడ కబుర్లు చెప్పుకుంటున్న వారందరూ వీళ్లను చూసి లేచి నిలబడ్డారు.

"నర్సిగా నువ్విడ్నే వుండు. యాదీ నువ్వుగూడ. ఈరయ్యా యీళ్లను సూస్తుండు." అనిచెప్పి మల్లన్న తన ఇంటికి వెళ్లాడు. దీపం వెలిగించాడు. గోడలో మేకకు తగిలించివున్న తుపాకి చేతికి తీసుకుని, గూట్లో భద్రంగా దాచిన గుళ్లల్లో ఒకటి అందులో నింపుకున్నాడు. మళ్లీ మామూలుగా తలుపుకు తాళం వేసి గుడిదగ్గరికి చేరుకున్నాడు. దేవుడికి నమస్కరించి వచ్చి, అరుగుమీద కూచుని, తుపాకీని పైకెత్తి పట్టుకుని గంభీరమైన కంఠంతో ఇలా అన్నాడు:

"నర్సిగా! గీడ ఎలుతుర్ల కొచ్చి నిలబడు".

నర్సిగాడు తన భుజం పట్టుకు నిల్చున్న తల్లిని పక్కకు జరిపి, మల్లన్నకు ఎదురుగా వచ్చి నిలబడ్డాడు.

"అయ్యో! నా కొడుకును సంపకు మల్లన్నా" శోకాలు ప్రారంభించింది పోచమ్మ.

అంతవరకు దూరంగా నిల్చుని చూస్తున్న యాది గబగబా పరుగెత్తుకువచ్చి మల్లన్న పాదాలను గట్టిగా పట్టుకుని, "గిదొక్కసారి యిడ్సిపెట్టు. ఇంకెప్పుడిట్ల సేయ.." అని ప్రాధేయపడింది.

"ఈరయ్యా, దీన్ని అసింట తోల్కపో. ముసల్దాన్ని గూడా!" అని ఆజ్ఞ ఇచ్చాడు మల్లన్న. వెంటనే ఈరయ్య ముందుకొచ్చి యదినీ ముసల్దానినీ దూరంగా తీసుకుపోయాడు.

తుపాకీని నర్సిగాడివైపు గురిపెట్టి అన్నాడు మల్లన్న:

"నీ పానాలు కాపాడతనని నేను మీఅవ్వకు మాటిచ్చిన. అన్నట్లుగనే నీ పానాలు కాపాడిన. నామాటనేమో నిలబెట్టుకున్న. కాని నా ఇంటి "ఇజ్జత్ పోయింది. గిప్పుడు గదికూడా నిలబెట్టుకోవాలే. అందుకని గిప్పుడు నె నేం సెయ్యాల్నో నువ్వే సెప్పు."

"నువ్వు దేవుల్లాంటి మనిసివి మల్లన్నా. నేను బద్మాసును దొంగని, లుచ్చా. నేను శానా సెడ్డపని సేసిన. నువ్వు ఏమి సిక్స యిచ్చినా తయారుగున్న" వణుకుతున్న కంఠంతో అన్నాడు నర్సిగాడు.

"తయారుగున్నావా?" అంటూ తుపాకీని అటూ యిటూ తిప్పసాగాడు మల్లన్న.

"నా అసుంటి పాపాత్ముడు పానాలతో ఉండగూడదు మల్లన్న. నువ్వేం ఫికర్ సెయ్యకు. తుపాకీతో నన్ను సంపెయ్యి. ఊఁ .... జల్ది ...." అంటూ ఛాతీ విరుచుకుని నిలబడ్డాడు నర్సిగాడు.

పోచమ్మ ఏడుపు ఎక్కువయింది. "అయ్యో.... అయ్యో! నా కొడుకును సంపేత్తున్నరో దేవుడా" అని పెద్ద పెద్ద కేకలు పెట్ట నారంభించింది.

మల్లన్న శాంతంగా అన్నాడు: నిన్ను సంపాలె. అదే మంచి సిక్స నీకు. నీ అసుంటోడు బతికి ఉండగూడదు. గానీ గిప్పుడు నేనే బతికించుకొచ్చిన నిన్ను నేనే సంపగూడదు. ఇంకమీదయినా అందరిలెక్క కష్టంసేసి బతుకు నర్సిగా!" అని యాదిని దగ్గరికి తీసుకురమ్మని చెప్పాడు. ఆమె దగ్గరికి రాంగానే "నువ్వు గాడ నిలబడు, నర్సిగాడి దగ్గర. ఇయాలటినుంచి ఆడే నీ మొగుడు. నువ్వాడి పెండ్లాం. మిమ్మల్ని పల్లెనుంచి ఎల్లగొట్టనిక్కి నా కిష్టంలేదు. సావు దగ్గరకొచ్చిన గీ ముసల్దికతున్నదిగద .... నా యింటి ఇజ్జతు పోయినంక ఇగ నే నెందుకు .... అందుకని నేను .... నేను ...." అంటూ తుపాకీని తన కణతకు గురిపెట్టుకుని ట్రిగ్గర్ నొక్కాడు. 





చిత్రకారుడు:
అరోమోహనరావు

# హరివంశం

(23-వ పేజీ తరువాయి)

నది. అతడుమ బ్రాహ్మణుడే. పిల్ల నాతనికిచ్చి పెండ్లి చేయవచ్చును. ఇన్ని లాభములు ఉండగా మీరు ఏమియు పట్టనట్లు చెట్లకు బోదెలు కట్టుచున్నారు."

ఆమె మాటలు వినుచూ, మహానందుడు మంద హాసము చేసెను. "ఎవ్వరో వచ్చుచున్నట్లున్నారు. కొంచెము నోటికి తాళము వేసికొనుము" అన్నాడు.

"మంచి చెప్పినచో మందమతులకు అట్లుగానే ఉండును" అన్నది ఆమె.

"శ్రీకృష్ణ! విన్నావటయ్యా! మా సంసారము ఇట్టు లున్నది. నేను మందమతిని. నా భార్య మహా చురుకు మనిషి. అప్పుడే వామాక్షికి సంబంధము గూడ వెదకినది."

సుదాముడు తెల్లబోయెను. శ్రీకృష్ణదేవుడు గల్లున నవ్వెను. "మహానంద! ఆమె యన్న మాట లలో తప్పులేదు. నీకొరకు వాచాలుడు, పౌండ్ర కుని రథముతో గూడ వచ్చెను. నిన్ను తీసుకొని పోగా వచ్చెను. నీవు వానికి కనుపించవాయెను. ఇది చెట్లకు బోదెలు కట్టు సమయమా? ఉచిత వేషమును అవధరించి రాజా నాస్థానికి పోవు సమయము. అమ్మ! మీరు బాగుగా నన్నారు. అట్లనవిచో నీయనమాట వినునా!" అనినాడు.

"నాయనా! అట్టు లన్నావు. బాగున్నది. ఏమియు చేయకపోయినచో నెట్లు!"

"సాందీపని ఆశ్రమ ముండగా నేను మరియొకచో పనిచేయు నవసర మేమున్నదే!"

"ఆ మాట అన్నగారితో ననుడు."

"అన్నాను."

"ఆయన ఏమన్నారు?"

"నీకువలెనే మాట్లాడినారు."

అందరును నవ్వుకొనిరి. "శ్రీకృష్ణ! చూచినావు కదా వరుస! అన్నగారిని, నన్నును, ఒక్క త్రాడు మీద నిలిపినారు. మాటలాడుటలో బుద్ధిగూడ యుండవలెను." అన్నది మహానందుని భార్య.

"బుద్ధి యున్నచో నిన్నేల పెండ్లి చేసు కొందును" అన్నాడు మహానందుడు.

"ఇప్పుడేమి చేసెదరు?"

"ఉరిపోసుకొందును!"

"నాకు పెండ్లినాడే ఆపని అయినది."

మరల అందరుమ నవ్విరి. "శ్రీకృష్ణ! చూచి నావు కదా! ఇది నా భార్య! నేను దానికి తాళి కట్టుట, ఉరిపోయుట యుట. నేను భర్తను! అది భార్య! బాగున్నది బాగున్నది."

"బాగుండక యెట్లుండును గాని, ముందు వాచాలుని సంగతి చూడుము" అనినాడు శ్రీకృష్ణ దేవుడు కన్నులతో నవ్వులుగా.

మహానందుడు ఉన్న రన్నాడు. "శ్రీకృష్ణ! ఈ ఆశ్రమములో ఈ చెట్లు, ఈ చేమలు, ఈ తీగలు, ఈ పువ్వులు, నేనును ఒక్కటిగా ఇంత వరకు బ్రతికినాము. కౌశికయు, నేనును ఒక్క టిగా బ్రతికినాము. పరమశివుడు ఇంతవరకు

నన్ను ఇట్లు కరుణించినాడు. ఇప్పుడు ఈ నాగరికులను తెచ్చి నామీదకు ఉసిగొల్పుచున్నాడు. నీవేమో మొదట పల్లెపట్టులలో పెరిగితివి. తరువాత నగరములకు ఎక్కితివి. నా కష్టమును అట్టిది. నేను నగరమునకు ఎక్కి గూడ పరమశివుని కరుణ వలన, సాందీపని కరుణ వలన ఎట్లు పుట్టితినో, అట్లు మసలితిని. ఇప్పుడంతయు తద్భిన్నముగ జరుగుచున్నది. కాని ఏమగునో నేనును చూచెదను. ఇంతకు ఆ వాచాలు డేడి. రథమును ఆయత్తము చేయించినాడా!' అనినాడు.

శ్రీకృష్ణదేవుడు మెల్లన హసించినాడు. "తల్లీ! చూచితిరా! అప్పుడే మహానందులవారికి రాజగురుత్వ లక్షణములు అబ్బుచున్నవి" అనినాడు.

"అవునయ్యా! శ్రీకృష్ణ! మీబోటివారి సహవాస మొక్కపూట యబ్బినచో, అన్ని లక్షణమ్ములును అబ్బును" అన్నాడు మహానందుడు.

మహానందుని భార్య మగని గడుసుతనమును అప్పుడే కనుగొన్నది వలె ముసిముసి నవ్వులు నవ్వినది.

మహానందుడు బయలుదేరినాడు.

"మహానంద!"

"శ్రీకృష్ణ!"

"ఈ వేషముతోనటయ్యా రాజగృహములకు పోవునది?"

"ఎట్లు పోయిన నేమి! చదువుగదా కావలసినది!"

"ఛా! వేషమునకును, చదువునకును దగ్గర సంబంధ మున్నది. నీవు వేషమును సరిగా వేయవో, నీకు చదువు వచ్చియు వ్యర్థము. వేషము గంభీరముగా నున్నచో, చదువు లేకపోయినను భయము లేదు."

"ఇది యేమయ్యా! నేను గురువును. అతడు శిష్యుడు. నేను నా యిష్టము వచ్చిన ట్లుందును. మరి యతడో, నేను చెప్పినట్లు నడుచుకొనవలసినవాడు. ఈ నడుమ నీవేమో, ఇన్ని అడ్డంకులను చెప్పుచున్నావు. నన్ను నన్నుగా నీవు ఉండనీయు దలచుకొనలేదువలె కన్పించుచున్నది."

"అటులనా! కాదు. నిన్ను నీవు మరియు పెరుగుటకు ప్రోది చేయుచున్నాను."

మహానందుడు శ్రీకృష్ణునివంక చూచినాడు. శ్రీకృష్ణుని సమీపించినాడు. ఉపజాపముగా "స్వామి! నిజమా!" అనినాడు. మందహాసము చేసినాడు. భార్యను చూచి ప్రకాశముగా "ఏమే! పెండ్లినాడు మీ నాయన పెట్టిన బట్టలేమైన నింకను ఉన్నవేమో తీయుము. వానిని కట్టుకొందును. సాందీపనిని ప్రార్థించి కాశ్మీరపు పచ్చడమును సంపాదింతును. స్వామీ! శ్రీకృష్ణ! నీవు చెప్పినట్లు వేషమును కట్టెదనయ్యా!" అనినాడు.

అతని భార్యముఖము విచ్చిన తుమ్మిపూవు వలె ప్రకాశించినది. ★

# గిరీశం లెక్చర్లు

(21-వ పేజీ తరువాయి)

గాని, ఎవరో పోయారు గామోసని చుట్టుపక్కల వాళ్లంతా వచ్చి, ఈ ఏడుపంతా కరుణరసం బాపతని తెలిసి ముక్కున వేలేసుకున్నారు—తౌజండ్సుకాదు. ఫింగర్స్—వేళ్లు. ఒక ప్రొడ్యూసరుగారు, ఈ సీనుపట్టి గెళ్లి వాళ్ల సెట్టుమీద శాడ్‌సీనులో ఏడిసినట్టేడుస్తున్న హీరోయినుకు వినిపించారు. అంతే త్రిల్లింగా ఏడిచిందావిడ. కట్ అన్నా ఆగలేదుట. ఈ లెక్కని హా గ్లిసరిన్ అవసరంలేదనీ, ఈ సీన్ని స్టుడియో ప్రాపర్టీగా ఉంచుతామనీ స్టూడియోవాలాయన అన్నాడు. గ్లిసరిను కంపెనీ సేల్సుమానొచ్చి బాబ్బాబు వారికది అమ్మకు నీపుణ్యం ఉంటుందని, గ్లిసరిన్ లేకుండా, ఈ సీనూ వినకుండా స్వతంత్రంగా (పొలిటిక్సుకిసంబంధంలేదు) నటించివెళ్లాడు మీరొచ్చే ముందు. అంతపవర్‌ఫుల్ సీను హృదయాల్ని కదిలించివేస్తుంది. హృదయాలేమిటి. ఇందాక అల్లా గోడని మేకు తీదామని ఎంత పీకినా కదల్లేదు. ఈ సీను వినిపించాను. ఊడి చక్కావచ్చింది. పాలవాడు పాత బాకీకోసం గుమ్మంమీద కూర్చున్నాడు ఇచ్చేదాకా కదల్నని. ఇది వినిపించాను. కదిలి కరిగి నీరైపోయి పాలలో కలిసిపోయాడు. ఆమధ్య ఎక్కడో (ఆంధ్రాలోనే లెండి) పనిచెయ్యని డాక్టర్లనీ, ఆస్పత్రుల్నీ, కారింజన్‌లనిచూసి వో రైలింజను కూడా వెడిపోయి ఆగి కదలలేదు. దాన్దగ్గిర ఈసీను టూకీగా వర్ణించేసరికి కదిలి సాగిపోయింది. అంతెందుకు మనకథే 12 రీళ్ళయినా, ముందడుగు లేకండా మొదలయినచోటనే కదలక మెదలక కూర్చుంది. ఇది చూపించగానే పరిగెత్తింది. ఆవిడెవరో హీరోయిను "షూటింగుకు వేళ పూర్తిఅయిపోతోంది రాత్రీ" అని తెరవేలుపులంతా మొరపెట్టినా కదల్లేదు. ఇది చెప్పగానే ఏడిచి లేచ్చక్కా వచ్చింది. ఏం చెప్పమంటారు.

అయ్యా. ఓ నమస్కారం పెడతానుగాని, ఇది మార్పమనకండి. మార్పులు చెయ్యకేం? చేశాను. మన పాత పిక్చరులో హీరో, హీరోయిన్‌లు సైకిళ్ళమీదవస్తూ డాషిచ్చుకుని ప్రేమలో పడతారుగదా. అందులో హీరోయిను ఎడమనించి, హీరో కుడినించి వస్తారు. ఈసారి ఆ సీనుని తలకిందులుచేసి పారేశాను. హీరో ఎడమనించివస్తే, హీరోయిను కుడినించి వస్తుంది. రెండు సైకిళ్ళకీ డాష్. క్లోజప్. కట్. లాంగ్‌షాట్, ట్రాలి, కోపం, దాని వెనక ప్రేమ. డైలాగులు. హాహూలు. హాహాలమిరించి, డ్యూయెట్‌కి మిక్సుచేస్తాం. టెక్స్టు కూడా మార్చేశాను. పాతపిక్చరులో వోహోహో చందమామా అని ఉంది. ఇందులో ?....వాట్ ? ఆహాహా చందమామా....థాంక్యూ. థాంక్యూ. నాకు తెలుసు మీరు నావెర్టి నెంకరేచ్చేస్తారని.

ఏం? అక్కణ్ణించి. క్లాసు. ఈ హీరో ఇంత క్రితం పేరు పిల్లలతో డ్యూయెట్లు పాడిఉంటాడు. అసలే ఆంధ్రాగదా. తర్టీయియర్స్ పూరికే మడి గట్టుకూర్చుంటాడండీ? మనం రియలిస్టిగ్గా ఉండాలి. నా ఎస్టిమేట్ ప్రకారం ఇలాటి వోల్డ్ ప్లేన్స్—అనగా ఫ్లాషుబాకు హీరోయినులు చచ్చు సంభావన వో అరడజనేనా ఉంటాయి. నన్నుబట్టి నా ఎస్టిమేటులో డిస్కౌంటిచ్చిరా ఓ ముగ్గురు ప్రేయసీమణులేనా ఉండిఉంటారు. ఏం. ఈ సైకిలు హీరోయిను యాక్సిడెంటు తరవాత హీరో, ఆవిడా డ్యూయటు మొదలెడతారు. పల్లవీ, చెరో చరణం తిరిగేసరికి ఈ పాత ప్రియురాళ్ళు ముగ్గురూ హాలో హాలో అంటూ ఆ తోటలోని పాటలో జొర బడిపోయి అపశ్రుతి కలుపుతారు. చివరకా డ్యూయెటు కాస్తా కోరస్‌గా మారిపోతుంది. నావెర్రి కదూ. ఐదుగురినీ ట్రిక్‌షాట్‌లతో తమాషాగా చూపించచ్చు. రాసలీలలా వారీ నాతీ నడుమ మురారీ టెక్నికులో తియ్యొచ్చు. నాలుగు హీరోల బొమ్మలతో అయిదుగురు—ఐమీన్ నలుగురు హీరోయిన్‌లతో రక రకాల మోస్తర్లలో చూపించొచ్చు. హిట్టౌ హిట్టు న్నారా? ఏవన్నారూ. సెన్సారువాళ్ళా? వాళ్ళ కత్తెర్లు. వాళ్ళిమధ్య సెక్సు వదిలి హారరుమీద పడ్డార్ట. ఏకలవ్యుడికథలో గురుదక్షిణసీను తీయించేశారట. రేప్పొద్దున్న సీతని రావణుడెత్తుకు పోయాడంటే బాగుండదని, ఇంకోటేదన్నా చేదా మంటారు. అసలు బహుభార్యాత్వం పెట్టడం వల్ల పేచీవస్తే, పోనీ ఆ సీన్‌మటుకు ఫోక్‌లోర్—జానపదంతా తీదాం. కలర్‌లో. లేపోతే పిక్చరేఫోక్‌లోరు తీదాం. మీకు బాక్సాఫీసూత్రాలు కొరుకుడు పడ్డేదున్నండి. ఎంతసేపు కళ కళ అని దేవుళ్ళాడతారు. జగదేకవీరుడికథ ఎందుకు హిట్టయినట్టూ? అతగాని జగదేకవీరత్వం ఏవిటి చెప్పండి. యుద్ధాలు చేశాడా? అంతా పార్వతిమద్దతు. మరతనిగొప్ప? ఐదుగుర్ని పెళ్ళాడడం. అంతేగదా. ఈకాలంలో ఒక్కదాన్ని కట్టుకునే మన్లాంటివాళ్ళం వేగలేక సినిమా కథలంత జీవితాల్తో చస్తున్నాం. ఒక్క కిటికీలోంచి ఒక్క పెళ్ళాంమీద అపోహపడితేనే 20 రీళ్ళు. ఇంక ఇద్దరు పెళ్ళాలమీద రెండు కిటికీ చిల్లుల్లోంచి రెండపోహలుపడి, రెండు రెండు డైలాగులు రెండుసార్లు చెప్పి, జోడుశాడ్ సాంగులు పాడి బతకడం అంటే చచ్చావే. నలుగురితో చావు పెళ్ళిలాటిదైతే, నలుగురితో పెళ్ళి చావులాటిదన్నాడో జ్ఞాని. తిరుపతి వెంకటేశ్వరస్వామి అంతటివాడు పద్మావతితో డ్యూయెట్లు మొదలెట్టేసరికి మహలక్ష్మి రావడంతో, వాళ్ళ యూ హౌ మచ్ అనుకోడంతో హడలిపోయి, రాయి అయిపోయాడుగదా. ఈ కష్టం మనకీ తెలుసు. ఏడుకొండల జేజెకూ తెలుసు. అసలు నాకీ అయిడియాకి ఇన్‌స్పిరేషను

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేనతవమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న అహారపు తునకలను తీసువేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పెప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !







మీకు పౌడరు కావాలంటే, ఈ లాభమున్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలరు వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.**

# గిరీశం లెక్చర్లు

అంపులోంచే వచ్చిందిలెండి. ఎవరితోనూ అనకండి.

అందువల్ల సంసారసుఖం (?) అనుభవిస్తున్న వారంతా కూడా భళీ నలుగురు భార్యల్ని కట్టుకు వేగ సాహసించినవాడు—జగదేకవీరుడు అంటూ హీరో వర్షిపుచేసి మరీ వస్తారు మన పిక్చరుకి. అంచేత మనం సోషల్ తీస్తేనే మజావుంది. మనుషు లేమిటి, ఆ కొండమీది దేవుడు కూడా చూడడానికి వస్తాడు—ఈ వీరుడి గొప్పతనం ఎలాటిదీ అన్న కుతూహలంకొద్దీ. మనం తిరపతి ఫస్ట్ రిలీజు ఇద్దాం.

చివర్ని శరత్కథ ఒకటి మిళాయిద్దాం. కామిడీ స్టోరీలెండి. సీరియస్‌గానే చూపెడదాం. ఒకపక్కగా వస్తూవుంటుంది. చివరి కొచ్చేసరికి, హీరోయిను విలన్ని పెళ్లాడవలసివస్తుంది. ఆవిడ లేచి పారిపోతుంది. హీరో చేజ్ చేస్తాడు. ఎందుకు? ఆవిడిని పట్టుకు పెళ్లాడ్డానికా? దొరగ్గానే చంపడానికా? సస్పెన్సు. అసలు ఎడిటింగులో తమాషా చేదాం. హీరో హీరోయిన్ని తరుముతోందా? హీరోయిను హీరోని తరుముతున్నాడా అన్నది కూడా తెలీకూడదు ఆడియన్సుకి. ఆవిడ మోటారు సైకిలుమీదా (నావెల్టీ. . .నే చెప్పలే?) ఆయన మూడు చక్రాల సైకిలుమీదా (కామిడీ) వెళ్తారు.

ఏవన్నారూ? రీసెంట్ పిక్చర్‌లా ఉందంటారా. అఫ్‌కోర్సు అది చూశాకే ఈ అయిడియా వచ్చింది. అందులో తరిమేసీను ఇంకా బాగా పెట్టొచ్చు నని పించింది. హీరోయిను, హీరోమటుకే ఉన్నారు. మనదాంటో అలాకాక, ఆ సీనులో కథా కమామిషూ చూసి ముందర అసలు కథకుడు శరత్ బాబు లేచి ఈ కథ నాదికాదు బాబోయ్ అంటూ పరిగెడతాడు. ఆయనను చూసి నాన్నా అంటూ హీరోయిను లేచి పరిగెడుతుంది కారుమీద. ఈవిడ కార్పు మీదున్నా, ఆయన్ని అందుకోకుండా ఎడిటింగ్ ఏర్పాటు చేస్తామనుకోండి. ఏం? ఆమెకోసం హీరో వెనకాల సైకిలుమీద పరిగేతుకెళ్లి కారును ఆపుతాడు. అంతలో హెలికాప్టరుమీద దర్శకుడు (నావెల్టీ) వచ్చేసి ఇది ఆఖరి రీలనీ, ఇంక రెండొందల అడుగులు కూడా లేదనీచెప్పి, సెట్‌కుతెచ్చి పెళ్లి చేస్తాడు. ఎ స్టోరీ ఇన్ ఫోర్త్ డైమెన్షన్. చివర్ని అంతాకలిసి ముసలాయన్ని కూకలెయ్యొచ్చు. ఇది మీదని ఎవర్చెప్పారు? అనలీసెట్టుకి మీ రెందుకొచ్చినట్టు? అవటాని.

నే ననేదేవిటంటే మన పిక్చరులో కూడా ఈ వైపు కామిడీ పెడదాం. ఏవంటారూ? నచ్చ లేదా?

పోన్లెండి. అలాగే కానీండి. మీ పాత పిక్చరుకథనే మళ్ళీతీదాం. ఒక్క రిక్వెస్టు. ఈసారి పిక్చరుపేరు మారుద్దాం. ఆ? అదీవద్దా? సెంటిమెంటా? రైటర్నే మారుస్తారా? మై గాడ్!

అయ్యా! మీకో నమస్కారం. 

# మనమూ-మన రాష్ట్రం

(19-వ పేజీ తరువాయి)

కష్టమనీ, పొరుగు రాష్ట్రాల వారికి నీరిచ్చేందుకు మన ప్రాజెక్టులను కుదించివేస్తారని మనం అనుమానిస్తున్నాం. అటువంటిదేమీ ఉండదని కేంద్రం ఏ హామీ యివ్వకపోవడం కూడా ఈ అనుమానానికి ప్రోద్బలంగా ఉంది. కాగా కేంద్రం తనకు తానై ఏదైనా పరిష్కారం సూచించినా, గుల్హాతీ సంఘం నివేదిక వచ్చినా అది పక్షపాత రహితమైనదిగా మనం అంగీకరించలేం.

పోతే మూడవ మార్గం—అంటే సాంకేతికుల ద్వారా తేల్చుకోడం ప్రస్తుత పరిస్థితిలో ఇది ఒక్కటే గత్యంతరం. గుల్హాతీ సంఘం నివేదికను మనం గాని, అవతలి రాష్ట్రాలవారు గాని తిరస్కరించడం జరిగితే చివరకు ఎట్లాగూ ఈ తగాదాను కేంద్ర ప్రభుత్వం అంతర్రాష్ట్ర నదీజలాల చట్టం క్రింద ట్రిబ్యునల్‌కు నివేదించడం తప్పదు. అప్పు డది వ్యాజ్యం, వ్యవహారంగా పరిణమిస్తుంది. అట్లా పరిణమించడం మన ప్రభుత్వానికి ప్రజా నాయకులకు యిష్టంలేదు. కాబట్టి వ్యాజ్యం గాకుండా, రాజకీయాల జోలి లేకుండా పరిష్కారానికి ఉత్తమ మార్గం సాంకేతికుల సంఘం నియామకం ఒక్కటే. ఇందులో ఇదివరకు కృష్ణా, గోదావరి జలాల కొలతలు తీసి నీటిని పంపిణీ చేసిన ఇంజనీర్లు విధిగా ఉండాలి. నిజానికి ఇట్లా సాంకేతికుల పరిష్కార సంఘాన్ని అడుగవలసింది మనం కాదు. 51 ఒప్పందం న్యాయమైనది కాదు. అన్ని రాష్ట్రాలవారు చేయాల్సిన పని అయినా, అటు కేంద్రము మరో నాలుగు రాష్ట్రాలు మన నిజాయితీని శంకిస్తున్నాయి గనుక, 51 ఒప్పందం న్యాయమైనది అని మనం దృఢంగా విశ్వసిస్తున్నాం గనుక, దాని న్యాయాన్ని ఋజువు చేసుకోడానికి ఇదొక పద్ధతి.

కనుక గుల్హాతీసంఘం నివేదిక వచ్చిన తరువాత, ఆ నివేదికవల్ల తగాదా పరిష్కారమయ్యే అవకాశం కల్పించకపోతే ఇప్పుడు మనం కట్టుకుంటున్న, ఇక ముందు కట్టుకోదలచి పథకాలు సిద్ధపరచి ఉంచుకున్న ప్రాజెక్టులను ఆపాలని గాని, లేదా కుదించుకోవాలని గాని బలవంతపెట్టని పక్షంలో 51 ఒప్పందంపై నిష్పక్షికమైన తీర్పుకు మనం సిద్ధమైతే ప్రమాదంలేదు. అంతేగాక ఈ తీర్పుకు శాశ్వతంగా కట్టుబడి ఉంటామన్న హామీని ముందుగా మనం అవతలి రాష్ట్రాలనుండి పొందగలిగితేనే ఈ సూచన చేయవచ్చు.

కనుక తగాదాకు సంబంధించిన ప్రభుత్వాలు, అనవసరంగా ప్రజల ఆవేశాలను రెచ్చగొట్టకుండా ఏదో ఒక పద్ధతిన తేల్చుకోడం శ్రేయస్కరం.

ఇటువంటి పరిష్కార పద్ధతులు ఏవీ నచ్చక రాజకీయం ద్వారానే సాదిద్దా మనుకుంటే, తగాదా పెరగడమే కాని, మరొకటి ఉండదు. పైగా అన్ని రాష్ట్రాలు దీన్ని ఎన్నికల సమస్యగా చేసి మరింత క్లిష్టం చేసే అవకాశం ఉంది. ఇది అధికారంలో ఉన్న కాంగ్రెసుపార్టీకి దెబ్బ. కనుక విధిగా దీన్ని రాజకీయాల నుండి తప్పించడం ముఖ్యం. లేకపోతే రావణాసురుడి కాష్టంలా శాశ్వతంగా కాలుతుంటుంది. ★









# వివాహం జూదమా?

(17–వ పేజీ తరువాయి)

నొకరు కొంతవరకైనా అర్థము చేసుకొనగల తారు.

కానీ వారు మాట్లాడిన ఆ కొద్ది సమయములోనే వారు ఒకరినొకరు ఎంతవరకూ అర్థము చేసుకొనగల్గుతారు? ఆ సమయమందు పురుషులు కొంతవరకూ సాహసించి, తమ అభిప్రాయములను, ఆశయములను తెలియజేయగల్గినా—స్త్రీలు భయముచేతనో, సిగ్గుచేతనో—తమ భావములను సరిగా వ్యక్తము చేయలేకపోతున్నారు.

ఈ వధూవరులు క్రొత్తవారు గనుక అర్థము చేసుకొనలేకపోవుచున్నారని అనుకొంటే మరి, అంతకు ముందుగా బాగా పరిచయముండి, ప్రేమించి వివాహము చేసుకొన్న ప్రేయసీ ప్రియులుగూడ, ఎందువలన ఒకరి నొకరు పూర్తిగా అర్థము చేసుకొనలేకపోతున్నారు?

వీరు కూడ ఒకరి నొకరు కలుసుకున్న సమయాలలో వారి సంభాషణలలో వారి అభిప్రాయములను నిర్మొహమాటముగా వ్యక్తము చేయరు. తన అభిప్రాయము యిలా అని తెలిపితే— ఆమె యేమనుకుంటుందోనని అతనూ, తన అభిప్రాయము తెలిపితే అతను యేమని భావించి, తన నపార్థము చేసుకొంటాడో—అని ఆమె తలంచి, తమలోని ఆశయములను, ఆశలను తమలోనే అణచివేసుకొంటారు. ఉదాహరణకు చూడండి—నాకు తెలిసిన ఒక యువతి వుంది. ఆమె వివాహమునకు పూర్వము రేడియోలో చక్కగా సంగీతము పాడేది. అప్పుడప్పుడు నాటికలలో గూడ పాల్గొనేది. ఆ సమయములోనే, ఆ రేడియో స్టేషన్‌లో తనలాగానే నాటికలలో, పాటలో పాల్గొనే ఒక యువకునితో స్నేహముకలసి, ప్రేమగా రూపొంది, వివాహమునకు దారితీసింది. ఆ వివాహమునకు ఆమె స్నేహితులంతా యెంతో అభినందించారు. ఇద్దరూ ఒకే రకము అభిప్రాయములు కలవారనీ—వారి దాంపత్యము చాల శాంతియుతముగా సాగుతుందనీ—అందరూ భావించారు. కాని ఇప్పుడు ఆమెలో పూర్వపు ఉత్సాహముగానీ, చైతన్యముగానీ కన్పించక, చాలా అశాంతితో జీవితాన్ని గడుపుచున్నట్లు తెలిసింది. కారణము తెలుసుకొంటే—వారిద్దరికీ యేమో అభిప్రాయ భేదాలతో గృహకలహాలు వచ్చాయనీ—అవి చిలికి, చిలికి గాలి వానగా మారాయనీ తెలిసింది. ఇంతకూ జరిగినదేమిటంటే—అతను ఆమెను 'వివాహమైనప్పటినుండీ రేడియోలో ఏ కార్యక్రమములోనూ పాల్గొనవద్దని చెప్పాడుట. ఆమెకేమో—పాల్గొనాలని చాలా యిష్టం. నిజానికి ఆమె పాట విని ప్రతివక్కరూ ముగ్ధులయ్యేవారు. ఆమె భర్త కూడా వివాహమునకు పూర్వము ఆమెనెంతో అభినందించేవాడు. ఆమె నిజంగా అతనికి సంగీతమంటే చాలా యిష్టము గాబోలని నమ్మింది. కానీ అతను మాత్రము ఆమె ప్రీతికొరకే తనకు గూడా సంగీతమంటే ఎంతో యిష్టమున్నట్లు నటించేవాడు. అలాంటప్పుడు ఆమె ఆ విషయమెలా అర్థము చేసుకొనగల్గుతుంది? ఇక వారి సంసా

[illegible] కొంతవరకూ దుఃఖభూయిష్ఠముగాక ఏమవుతుంది?

ఇలాగే అనేకమంది పొరబడటం జరుగుతూ వుంటుంది. వివాహమునకుపూర్వము ఒక ప్రియురాలి తన 'ప్రేయసి' వేషభాషలు కొంచము యెబ్బెట్టుగా కన్పిస్తాయనుకోండి—అతను దానిని వ్యక్తపరచడు. కాని వివాహమైపోగానే, ఇక తానామె భర్తకుగడా ఆమె పద్ధతులను ఆమాత్రము సరిదిద్దేహక్కు తనకులేదా? అని ఒక్కసారిగా ఆమెను మార్చడానికి ప్రయత్నిస్తాడు.

## వివాహం జూదమా?

ఇక మొదలౌతుంది—ఆమె హృదయంలో అనుమానము. వివాహమునకుపూర్వము, తన ప్రవర్తనతో యే విధమైన తప్పుబట్టని తన భర్త—యిప్పుడు తన ప్రతి కదలికలోనూ లోపాలెన్నడము చూసి, అతను వివాహమునకు పూర్వములా తనను ప్రేమించడములేదేమో—అని శంకిస్తుంది. మనస్సు చాలా చిత్రమైనది. ఒక బాధతో కొంచెము మానసిక బలహీనత ఎక్కువైనకొద్దీ—అనేక బాధలు చుట్టుముట్టి మనస్సును మరి బలహీనముగా మార్చివేస్తాయి. అప్పటినుండీ ఆమె బాధపడటమూ అతనిని బాధించడము జరుగుతుంది ఇక ఆ గృహము నరకసదృశమౌతుంది.

వివాహమునకు ముందు ప్రేయసీప్రియులు ఒకరియందు మరి ఒకరికి నచ్చని చిన్న చిన్న లోపాలను, అప్పుడే సరిదిద్దడానికి ప్రయత్నించాలి. వారు మార్చుకోనిపక్షములో, వివాహము చేసుకొనుట మానవచ్చు. కాని అలాగాక, క్రొత్తలో వుండే మోజుతో—ఆమాత్రము చిన్న చిన్న లోపాలను

సర్దు కొనలేకపోతారా? అనుకొని వివాహము చేసుకొంటే, అలాటి చిన్న చిన్న విషయాలే పెద్ద పెద్ద గృహ కలహాలుగామారి, చివరకు విడాకులవరకూ దారితీయవచ్చు.

ఇలా ముందుగా పరిచయమున్నవారు కూడా ముందుగా ఒకరినొకరు అర్థము చేసుకొనలేక, కేజీతులా తమ దాంపత్య జీవితాన్ని దుఃఖమయము చేసుకొంటుంటే—వివాహము జూదముగాక మరే మవుతుంది?

ఇంతవరకూ వివాహము ఎందుచేత జూదముగా పరిగణింపబడుచున్నదో, వధూవరులు ఎందుచేత ఒకరి నొకరు అర్థము చేసుకొనలేకపోవుచున్నారో చర్చించాము. కాని యిలా ఎప్పటికీ భగవంతునిపై ఆధార పడి, కండ్లు మూసుకొని—సంసార సాగరంలో దూక టమేనా నేటి వధూవరుల కర్తవ్యం? ఇలా వివాహము దైవాధీనము గాకుండా, స్వయంకృతము చేసు కొనలేరా, విద్యాధికులు, నవనాగరికులు, సంస్కార వంతులు అయిన నేటి స్త్రీ పురుషులు?

పూర్వం వధూవరులకు పెద్దలు చెప్పినదే వేద వాక్యము. వారి పూర్వీకుల సంప్రదాయానుసార ముగా నడుచుకొనుచూ, వారి పద్ధతులను గుడ్డిగా నమ్మడమే వీరి పని. వారికి స్వంత అభిప్రాయ ములుగానీ, ఆశయాలుగానీ వుండేవిగావు. భర్త అడుగుజాడలలో నడవటమే ఆనాటి స్త్రీల కర్త వ్యం. వారు యెప్పుడూ తమ భర్తల అభిప్రాయము లకు ఎదురుచెప్పరు. అసలు వీరికి ప్రత్యేక అభి ప్రాయములుంటేగదా వారి మాటలకు వ్యతిరేక ముగా చెప్పటానికి?

కాలం మారింది. స్త్రీలూ మారారు. ఈనాటి స్త్రీలకూ స్వంత అభిప్రాయములూ, ఆశయములూ అంటూ కొన్ని వున్నాయి. తమ భర్త అభిప్రాయ ములు తప్పులైన, ఒప్పులైన—వాటిని గుడ్డిగా నమ్మటానికి వీరి మనస్సు ఒప్పుకొనదు.

అందువలన ఈనాటి వధూవరుల దాంపత్య జీవితము సుఖమయం కావాలంటే ఒకటేమార్గం. వధూవరులు, వారి వివాహమునకుముందుగానే ఒకరి అభిప్రాయములను మరిఒకరు సుస్పష్టముగా తెలుసు కోవాలి. చిన్న విషయా అని త్రోసివేయకుండా— ప్రతి చిన్న విషయములోనూ వారి అభిప్రాయము లను తెలుసుకోవాలి. వారి వారి అభిరుచులను నిర్మొహ మాటముగా తెలుసుకొనగలగాలి. ఒకరి మనస్తత్వము, మరిఒకరి మనస్తత్వముతో ఏకమై నప్పుడే వివాహము చేసుకొనవచ్చు. లేకపోతే మాని వేయవచ్చు. ఇక్కడ స్త్రీ తన సిగ్గును కొంచము దూరము చేయాల్సివుంటుంది. కాని తన జీవిత భాగస్వామిని యెన్నుకొని, ఒక గురుతర సంసార భారమును మోయబోయే ఈ సమయములో ఆ మాత్రము స్వతంత్రించడములో తప్పులేదుగా? అయినా అనేక రంగాలలో ముందంజ వేస్తున్న నేటి స్త్రీలకు, యిదేమీ పెద్ద కష్టముగాదనుకొంటాను. ఇలా చేసినందువలన వివాహములు కొంతవరకూ సుఖ మయమవుతాయని నా ఉద్దేశ్యము. అప్పుడు హామునకు 'జూదము' అను బిరుదు తొలగించవచ్చు.

★


"మోహన్ ఇప్పుడు
తప్పకుండా
ఇంజనీరు
అవుతాడు - మనం
నేషనల్
సేవింగ్స్‌లో
పొదుపు చేయడం
ఎంత మంచిదైంది!"





ఒక మూలలో ఒదిగి నిల్చున్నాడు.

ఆ అబ్బాయి ముఖం అతి దీనంగా ఉంది. వాడికి పన్నెండేళ్ల వయసుంటుందేమో! మాసిపోయిన లాగు, కొంచెం చిరిగిన చొక్కా తొడుక్కున్నాడు. బాగా పెరిగిన జుట్టు ఉంగరాలు తిరిగి నుదుటి మీదా, చెవులమీదా పడుతోంది. చేతిలో ఒక సంచి ఉంది. ఇదీ ఆ అబ్బాయి వాలకం.

మా ఆయన ఉష మాటలు విన్నారేమో, పేపరులో నుంచి తల పైకెత్తి,

"ఎక్కనీ ఉషా! ఇదేం మన ఇల్లు కాదుగా! స్థలం బోలెడంత ఉంది. ఎవరైనా ఎక్కి కూర్చో వచ్చు." అని ఆ అబ్బాయి వైపు తిరిగి "ఇక్కడ వచ్చి కూర్చో బాబూ!" అన్నారు.

ఆ అబ్బాయి భయం భయంగానే వచ్చి ఒక బెంచీమీద కూర్చున్నాడు.

రైలు కూతపెట్టి స్టేషన్‌ను వదిలింది.

అంతవరకూ ప్రతి స్టేషనులోనూ రైలు ఆగంగానే పరుగెత్తుకువెళ్లి తలుపుకు అడ్డంగా చేతులుపెట్టి నిల్చుని వచ్చేవాళ్లందరికీ 'స్థలంలేదు, స్థలంలేదు' అని చెబుతూ అందర్నీ పంపించేసిన ఉషకు ఇది చూసి అవమానం జరిగినట్లనిపించిం దేమో మౌనంగా నిల్చుండిపోయింది.

ఆయన మళ్లీ పేపరు చదవడంలో మునిగి పోయారు.

నేను ఆ అబ్బాయికేసే చూస్తూ ఉండి పోయాను. తక్కిన పిల్ల లిద్దరూ కిటికీలోంచి బయటికి చూస్తూ కూర్చున్నారు. రైలు పొగలు గక్కుతూ వేగంగా పరుగెడుతోంది.

ఉష మళ్లీ నా చేతులు పట్టుకుని "ఇప్పు డొచ్చేది ఏ స్టేషనమ్మా ?" అని అడిగింది.

నేను మాట్లాడకుండా ఆయన్ని అడగ మన్నట్టు సంజ్ఞ చేశాను. ఉష వెళ్లి వాళ్ల నాన్న గారిని అడిగింది. ఆయన "ఎన్నో స్టేషన్లు వస్తుం టాయి ఉషా. అన్నిటికీ బోర్డు లుంటాయిగా నువ్వే చదువుకో." అనేసి మళ్లీ చదువుకో సాగారు.

ఉష మళ్లీ, టెలిగ్రాఫ్ స్తంభాలను లెక్కపెట్టు కుంటున్న వాసు దగ్గరికి వెళ్లి అడిగింది. వాడు 'తొంభైనాలుగు' అంటూ దాని తలమీద మొట్టి కాయ వేశాడు. తను శ్రద్ధగా లెక్కపెడుతుంటే ఇది మధ్యలో వచ్చి లెక్క పాడుచేస్తోందే అని వాడికి కోపం. ఉష వాడి చేతిమీద గిల్లి, ఏడుస్తూ తలుపు దగ్గరకు వెళ్లి నిల్చుంది. రెండోవాడు రవి వెనక్కు వెళుతున్న చెట్లను లెక్కపెడు తున్నాడు.

ఆ అబ్బాయి దృష్టంతా ఉషమీదే ఉంది. బహుశా దాని చేష్టలు వాణ్ణలా ముగ్ధుణ్ణిగా చేశాయేమో!

రైలు మరొక స్టేషన్లో ఆగంగానే ఉష మళ్లీ తన పని మొదలెట్టింది. ఆ అబ్బాయి కూడా లేచి తలుపు దగ్గరికి వెళ్లాడు. దిగబోతున్నవాడితో "నువ్వు ఇక్కడే దిగాలా ?" అని అడిగింది ఉష.

"లేదు. ఇంకా చాలా దూరం పోవాలి" అన్నాడా అబ్బాయి.

"మరి యిప్పుడే దిగుతున్నా వెందుకు ? లోప లికి రా. నే నేనున్నా నిన్ను దిగిపొమ్మన్నానా ఏమిటి ?"

# వాసుదేవరావు

(13-వ పేజీ తరువాయి)

అంది ఉష. అప్పుడే ఆ అబ్బాయితో స్నేహం చేసేసుకుంది.

"మరి ఇందాక వద్దన్నావుగా !" అంటూ ఆ అబ్బాయి మళ్లీ తన స్థానంలోకి వచ్చాడు. కాని కూచోవడానికి వాడెందుకో సందేహిస్తున్నట్టనిపిం చింది. చిత్తరువులా చూస్తూ నిలబడే ఉన్నాడు. ఉష వచ్చి వాణ్ణి కూర్చోబెట్టింది.

ఆ అబ్బాయివంకే తదేకంగా చూస్తూంటే నా మనసు గతంలోకి వెళ్లిపోయింది.

* * *

నా కప్పుడు పదేళ్ల వయస్సు. అప్పుడు ఇదే వయస్సుగల వాసు అనే అబ్బాయి మా పక్కింట్లో ఉండేవాడు. వాసు వాళ్ల తల్లిదండ్రులకు ఏకైక

---

తండ్రి:— గోపీ! ఏం చేస్తున్నావురా?

గోపీ:- (వీథిలోంచి) ఈగోడ మీద కాగితములు అంటించరాదు" అని కాగితంమీద రాసి అంటిస్తున్నా నాన్నా!

నాగం వెంకట గోపాలరావు (బందరు)

---

పుత్రుడు. అచ్చు ఈ అబ్బాయిలాగే ఉండేవాడు. కాని వీడంత పిరికివాడు కాడు. చాలా ధైర్య వంతుడు. స్కూల్లో ఫస్టుమార్కు లొచ్చేవి. ఆటల్లో కూడా అతనే ముందు. అతనివెంట ఎప్పుడూ అయిదారుగురు మిత్రులు తప్పకుండా ఉండేవాళ్లు. తన మిత్రబృందంతో రోజూ ఎవరి తోటలోకో దూరి, పళ్లు దొంగిలించి తినడం అతనికి సరదా. రోజూ వాళ్లింటికి ఎవరో ఒకరు వచ్చి వాసుమీద ఫిర్యాదులు చెప్పడం వాళ్ల నాన్న తిట్టడం, వాళ్లమ్మ ఏడవటం పరిపాటి అయి పోయింది.

నేను వాసూ వాళ్లమ్మతో జడవేయించుకోవ డానికోసం రోజూ వాళ్లింటికి వెళ్లేదాన్ని. మా అమ్మకు నా జుత్తు చూస్తేనే చిరాకు. నా పొడు గాటి జుత్తును మా అమ్మ దువ్వుతుంటే నాకు చాలా నొప్పి కలిగేది. ఏడిచేదాన్ని. వాసూవాళ్లమ్మ ఇదిచూసి, నాకు తనే జడేస్తానని చెప్పింది. రెండు మూడు రోజులు మా ఇంటికే వచ్చి వేసింది కూడా. ఆవిడ నాకు కథలూ, తమాషా కబుర్లూ చెబుతూ నా తల చిక్కు తీసేది. నాకా కథల ధ్యాసలో అసలు నొప్పే తెలిసేదికాదు. అమ్మది అదోరకమైన స్వభావం. నేను వాసూ వాళ్లమ్మతో జడ వేయించుకోవడం తన కిష్టంలేనే అయినా, నేను ఆవిడతో వేయించుకునేటప్పుడు ఏడవనని కోప మేమో. ఆవిడ మాటలు వినడానికి నేను చాలా ఆసక్తిగా ఉంటానని కూడా కోపం. అదీగాక ఆవిడ తనకు 'అలా చేయకూడదు, ఇలా చేయాలి'

అని బుద్ధి మాటలు చెప్పడం కూడా మా అమ్మకు సరిపడలేదు. "మా పిల్లను నేను ఏమన్నా చేసుకుంటాను. మీరెవ రడగడానికి ?" అని మండి పడి ఆవిడను పంపేసింది.

ఒకరోజు మా అమ్మ మంచినీళ్లు మోసు కొస్తుండగా కాలుజారి పడబోతే, అటువైపుగా వెళ్తున్న వాసు పరుగెత్తుకొచ్చి బిందె అందుకుని అమ్మను పడకుండా పట్టుకున్నాడు. బిందె తనే మోసుకొచ్చి మా యింట్లో దింపాడు. అప్పటి నుంచి వాసు అంటే మా అమ్మకు చాలా అపేక్ష కలిగింది. ఈ అదను చూసుకుని వాసూ వాళ్లమ్మ మళ్లీ నాకు తమ ఇంటికే పిలిచి జడ వేయడం ప్రారంభించింది. కాని నేను జడ వేయించు కునేందు కెళ్లినప్పుడు వాసు ఇంట్లో ఉన్నాడంటే ఇహ నన్ను ఏడిపించుకు తినేవాడు. స్కూల్లో జరిగిన సంగతంతా గుర్తు చేస్తూ, నేను పాఠం అప్పజెప్పకుండా వచ్చేశాననీ, నేనో తెలివితక్కువ దద్దమ్మననీ, మొద్దు ననీ ఇలా ఎన్నో మాటలు అనేవాడు. నాకు అతని మాటలు విని ఒళ్లు మండిపోతున్నా, నేను పాఠం అప్పజెప్పని సంగతి మా అమ్మ కెక్కడ చెప్పేస్తాడో నన్న భయం కొద్దీ ఊరికే ఉండేదాన్ని.

అప్పుడు వాళ్లమ్మ కోప్పడేది. "ఊరుకోరా వెధవా. దానికేం ఆడపిల్ల ! నీలా చదువుకుని అది ఉద్యోగం చెయ్యాలా, ఊళ్లేలాలా ? పెళ్లవంగానే అత్తవారింటికి వెళ్లిపోతుంది. నీలాంటి మగా డెవరో దానికోసం పుట్టిఉంటాడులే ! నువ్వేం దాన్ని ఆక్షేపించక్కర్లేదు." అని.

మా ఇంట్లో ఏం ఫలహారాలు చేసినా వాసుకు కూడా పెట్టేవాళ్లు. వాసూ వాళ్లింట్లో నాకూ అలాగే. నేను మా అమ్మతో ఉక్రోషంకొద్దీ "వాడి కెందుకు పెట్టాలి ?" అని అంటే వాసు కూడా వాళ్లమ్మతో అలాగే అనేవాడు. మా అమ్మా, వాసూ వాళ్లమ్మా ఇద్దరూ చేరారంటే ఇహ మా గురించే సాగేవి కబుర్లు. కాని మా అమ్మ మాత్రం నాలుగు రోజుల కొకసారి ఏదో ఒక కారణంగా ఆవిడతో పేచీ పెట్టుకునేది. ఆవిడ మారు మాట్లాడకుండా వెళ్లిపోయేది. ఒకటి, రెండు రోజులు గడిచాక మళ్లీ వచ్చేది. మళ్లీ మామూలుగా కబుర్లు చెప్పుకునేవా ళ్లిద్దరూ.

* * *

ఆయన పేపరు చదువుకోవడం అయిపోయింది. మా అబ్బాయి వాసు టెలిగ్రాఫ్ స్తంభాలను లెక్క పెట్టలేక విసుగెత్తి ఊరికే కూర్చుండిపోయాడు. వాడికి ఆ పేరు పెట్టింది నా బలవంతం వల్లనే. ఆయనకు నచ్చకపోయినా, నేనే పట్టుబట్టి పెట్టిం చానాపేరు. ఇంక రెండోవాడికీ, మూడోదానికీ ఆయన ఇష్టప్రకారమే పేర్లు పెట్టాం రవి, ఉష అని. రవి చెట్లు లెక్కపెట్టడం ముగించి, అటూ యిటూ ఉన్న పంట పొలాలను చూస్తూ వాళ్ల నాన్నగారిని ఏవేవో ప్రశ్న లడుగుతూ కూర్చు న్నాడు. ఆయన కూడా వాటికి ఓపిగ్గా సమా ధానం చెబుతున్నారు. ఉష ఆ అబ్బాయితో కబుర్లు చెబుతోంది. ఆ అబ్బాయి కూడా దానికి గమ్మ త్తయిన కథలు చెబుతూ నవ్విస్తున్నాడు. నేను వాళ్లనే చూస్తూ మధ్య మధ్యలో ఆయనవైపు

# మీ పిల్లలకు దగ్గుగాని రొంపగాని వచ్చినప్పుడు

## నిజమైన స్వస్థత చేకూర్చుటకు







# సిరోలిన్ 'రోష్' ఇవ్వండి

మీ పిల్లలయొక్క దగ్గును రొంపను ఉపేక్షించకండి. శీఘ్రముగా నిరపాయముగా నిజమైన స్వస్థత చేకూర్చే సిరోలిన్ ఇవ్వండి. అది చాలా సౌమ్యముగా పనిచేయును. మీ బిడ్డలు దాని రుచికి ఇష్టపడుదురు. సిరోలిన్ మీకు కూడ ఎంతో మంచిది. అది దగ్గును ఆపడమే కాకుండా దగ్గుకు మూలకారణమగు హానికరమైన సూక్ష్మ క్రిములను నశింపచేయును. సిరోలిన్ గొంతు నొప్పిని ఉపశమింపచేయును. కఫమును నుసను పోగొట్టును, ఎంత బాధాకరమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత కలుగజేయును.




## మీ గృహమందు సిరోలిన్ తప్పక ఉంచుకొనండి.

WT-VT 2398

'రోష్' తయారు    సోల్ డిస్ట్రిబ్యూటర్సు:, వాల్టాస్ లిమిటెడ్

చూస్తూ కూచున్నాను. ఆయన పేపరు చదువుకోవడం అయిపోయిన తరువాత నాకు అదేపనిగా ఆ అబ్బాయినే చూడటం సాధ్యపడటంలేదు. 'ఇదేమిటి ? పిచ్చిదానిలా అలా చూస్తావేం ?' అంటారేమోనని భయం.

అంతలోనే పిల్లలు 'ఆకలి .... ఆకలి' అని గోల పెట్టసాగారు. ఆయన ఆ అబ్బాయితో ఏదో మాట్లాడుతున్నారు. నేను టిఫిన్ క్యారియర్ తెరుస్తూ ఉండగానే ఆ అబ్బాయి లేచి తన స్థలంలోకి వెళ్లిపోవడానికి ప్రయత్నించాడు. కాని ఆయన వాడి చేయి పట్టుకుని బలవంతంగా కూర్చోబెట్టుకొని "ఎక్కడిదాకా వెళ్తున్నావు బాబూ ?" అని అడిగారు.

ఆ అబ్బాయి సిగ్గుతో తల వంచుకుని "కాకినాడ" అన్నాడు.

"అయితే మాది బెజవాడే. నువ్వు ఇవ్వాళ మా యింట్లో ఉండి, రేపు కాకినాడ వెళ్ళు" అన్నారు ఆయన.

"కాకినాడలో ఎవరున్నారు ?" అనడిగాను నేను.

"మా మామయ్య" అన్నాడు.

"మరి మీ తల్లిదండ్రులు ఎక్కడున్నారు ?" నా ప్రశ్నకు జవాబు చెప్పలేదా అబ్బాయి. దుఃఖంతో వాడి గొంతు పూడిపోయి మాటలు రాలేదు. ఆయన మాట మార్చుతూ "దాని మాటలకేం గానీ, నీపేరేమిటబ్బాయ్ ?" అని ప్రశ్నించారు.

ఆ అబ్బాయి గొంతు సవరించుకుని "చంద్రశేఖరం" అన్నాడు.

నా చేతులు వణికి టిఫిన్ క్యారియర్ చెయ్యి జారింది. అది క్రింద పడేలోగానే గభాలున లేచి వచ్చి దా న్నందుకున్నాడు చంద్రశేఖరం.

.... ఆ, వాసు కూడా మా అమ్మ తెస్తున్న బిందె నిలాగే అందుకున్నాడు .... మళ్ళీ నామనసు గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకో నారంభించింది.

వాసు కాలేజీలో చేరడానికి పట్నం వెళ్ళుతుంటే నాకు తెలియకుండానే ఏడుపు వచ్చేసింది. మళ్ళీ అతను సెలవల్లో ఇంటికి వచ్చినప్పుడు చాలా పెద్దవా డయిపోయినట్లు కనిపించాడు. తెల్లని ప్యాంటు, బుష్‌కోటు ధరించి నా ముందు నిలబడినప్పుడు నాకు సిగ్గు ముంచుకొచ్చి ఇంట్లోకి పారిపోయి దాక్కున్నాను.

ఆరోజు సాయంకాలం వాసూవాళ్ళమ్మ వచ్చి నన్ను వాళ్ళింటికి తీసుకెళ్లి "ఏం ? వాసు పెద్దవాడిలా కనుపించాడా నీకు ?" అని అడుగుతూ ఉండగానే వాసు అక్కడికి వచ్చి "ఆమే ఇప్పుడు ఒకరిని చూసి సిగ్గుపడేంత పెద్దదయిపోయింది. కదమ్మా ?" అన్నాడు. నేను యిక అక్కడ నిల్చోలేక ఇంటికి పరుగెత్తు కొచ్చేశాను. ఇహ మళ్ళీ అతని కెదురుగా నిలబడి మాట్లాడలేదు నేను. వాసు కాలేజీ కెళ్లేవాడు. మళ్లీ సెలవల్లో వచ్చేవాడు. మా ఇంటికి వచ్చి మా అమ్మతో పిచ్చాపాటీ మాట్లాడేవాడు. అతను మా యింటికి రాంగానే నేను వెళ్లి వాళ్లింట్లో కూచునేదాన్ని. మా అమ్మ "ఆ అబ్బాయి వస్తే ఎందుకలా పారిపోతా వమ్మాయ్ ? ఇప్పుడు నువ్వేమంత పెద్దదాని వయిపోయావని ?" అనేది. కాని నాకు

మాత్రం అతన్ని చూడంగానే సిగ్గు ముంచుకొచ్చేసేది.

* * *

ఏమిటి లలితా ? ఎందుకలా ఉన్నావ్ ? ఒంట్లో బావుండలేదా ?" నా వాలకం చూసి గాభరాగా అడిగారు ఆయన.

నేనేం సమాధానం చెప్పను? నిజంగా చూస్తే నా ఒంట్లో ఏమీ లేదు. కులాసాగానే వున్నాను. కాని ఈ సంగతి ఆయనతో ఎలా చెప్పేది? అందుకని చిన్న అబద్ధమాడేను.

"కడుపులో నెప్పిగా ఉందండీ !" అని.

"అయితే ఈ చద్దిపూరీలు తినకు" అన్నారు ఆయన.

"మరింకేం తినను ? మట్టి తినమంటారా?" అని అడిగాను. కారణం లేకుండానే నా కాయన మీద కోపం వచ్చింది.

"కాస్సేపాగు. నీ కది దొరకాలంటే ఏదైనా స్టేషన్ రావాలి. ఈ పరుగెడుతున్న రైల్లో నీకు మట్టెక్కడ దొరుకుతుందీ ?" అని పకపక నవ్వారు.

చంద్రశేఖరం పిల్లలతో కూచుని వద్దు వద్దంటూనే టిఫిన్ ఆరగిస్తున్నాడు. ఆకలి వాడి మొహమాటంను దూరంగా నెట్టేసింది. నాకు వాడి ఆకలి చూసి జాలేసిందో ఏమో చెప్పలేను. అయిదారు పూరీలు వాడి ఇస్తట్లో వేసేశాను. నేనలా పరధ్యానంగా పూరీలు వడ్డించడం ఆయన గమనించారేమో, "లలితా జాగ్రత్త ! మళ్లీ నీ కడుపునొప్పి ఆ అబ్బాయికి ట్రాన్స్ఫర్ అయిపోగలదు !" అన్నారు.

నేను మాట్లాడకుండా వచ్చి ఖాళీగా ఉన్న బెంచీ మీద పడుకున్నాను.

వాసు దగ్గరికి వచ్చి "ఎందుకమ్మా పడుకున్నావు ?" అనడిగాడు. నేను పలకలేదు.

"చంద్రశేఖరం, నీకు పేకాట వచ్చా ?" అని అడుగుతూ పేకముక్కలు తీసి కలపసాగారు ఆయన.

రవి నా దగ్గరకు వచ్చి "అమ్మా ! నువ్వు కూడా వస్తావా పేకాటకి ?" అని అడిగాడు. నేను అప్పుడు కూడా మౌనంగానే ఉన్నాను.

ఉష ఒక దుప్పటి తీసుకొచ్చి నాకు కప్పింది.

వాళ్ళు ఆట మొదలుపెడుతూండగా వాసు మళ్లీ అన్నాడు. "ఉండండి నాన్నా, అమ్మకూడా వస్తుందేమో !"

"అదిప్పుడు రాదులే. దాని మనసు సరైన స్థితిలో లేదిప్పుడు. కడుపునొప్పి కూడాను. ఇహ ఇంకేం వస్తుందీ ?" అని నవ్వుతూ పేకముక్కలు పంచసాగా రాయన. వాసు, చంద్రశేఖరం ఒక జట్టు, ఆయన రవీ మరొక జట్టుగా ఆట మొదలెట్టారు.

నేను దుప్పటిని తలనిండా కప్పుకుని పడుకున్నాను. రైలు చక్రాలు లయబద్ధంగా చప్పుడు చేస్తున్నాయి. 'అవును ! ఆయన చెప్పినమాట నిజమే. ఇప్పుడు నా మనసు నిజంగా సరైన స్థితిలో లేదు. అది మళ్లీ గతంలోకి చొచ్చుకుపోయి వెనకటి సంఘటనలను పైకి తవ్వుతోంది......

చంద్రశేఖరం—ఇది వాసు నాన్నగారి పేరు. నేను స్కూల్ ఫైనల్‌లో ఉన్నప్పుడు ఆయనకు ట్రాన్స్

ఖర్ అయింది. వాళ్ళు ఊరికి బయలుదేరేరోజు వాళ్ళను మా యింటికి భోజనానికి పిలిచారు. మా నాన్నగారూ, చంద్రశేఖరంగారూ మాట్లాడు కోవడం ఆరోజే చూశాను నేను. ఇదివర కెప్పుడూ వాళ్ళలా మాట్లాడుకోలేదు. నన్ను మాత్రం ఆయన అప్పుడప్పుడు పలకరిస్తూ ఉండేవారు. కాని ఆయనంటే నాకు చాలా భయం. ఎందు కంటే వాసుకు ఆయన విధించే శిక్ష చూశాను కాబట్టి.

వాళ్ళందరూ బయలుదేరేందుకూ కొంచెం ముందుగా వాసూ వాళ్ళమ్మ నన్ను పిలిచి జడేసింది. తన పెట్టెలోనుంచి ఒక చీర తీసి తనే కట్టింది నాకు. తరువాత తన భర్తను పిలిచి నన్ను చూపించి "ఎలా ఉందండీ ?" అని అడిగింది. ఆయన వాత్సల్యంతో నా తల నిమురుతూ "సాక్షాత్తు లక్ష్మీదేవిలా ఉంది" అన్నారు. అప్పుడు ఆయనంటే నాకు భయం పోయింది. తరువాత వాసూ వాళ్ళమ్మా నన్ను చెయ్యి పట్టుకుని మా యింటికి తీసుకెళ్ళింది. మా యింట్లోకి వెళ్ళగానే నాకు చాలా సిగ్గేసింది.

"అదేమిటమ్మాయ్ ? వాళ్ళింట్లో ఉన్నప్పుడు లేని సిగ్గు మనింట్లోకి రాంగానే ఎక్కడనుంచి వచ్చింది ? తల పైకెత్తు" అంది అమ్మ.

నేను తల కొంచెం పైకెత్తి అమ్మవంక చూశాను. వెంటనే నా తల క్రిందికి వాలిపోయింది. అమ్మ వెనక నిలబడి నవ్వుతున్నాడు వాసు!

ఎంత వెనకగా నిలబడినా అమ్మకంటె పొడుగ్గా ఉన్నాడు కాబట్టి ఇట్టే కనిపించాడు. సూటు వేసుకొని ఉన్నాడు. నవ్వుతూఉంటే అతని బుగ్గన చిన్న సొట్ట పడుతోంది. కోటేరులాంటి ముక్కు, మెరిసే కళ్ళు, నుదుటిమీద నాట్యమాడుతున్న ఉంగరాల జుట్టు. వాసు చాలా అందమైనవాడు...

దుప్పటి తొలగించి చంద్రశేఖరం వైపు చూశాను. వాడి జుట్టుకు తైల సంస్కారం లేదు. అది దువ్వెన మొహం చూసి ఎన్నాళ్ళయిందో అన్నట్టుగా చక్కగా ఉంగరాలు తిరిగి, గాలికి అటూ యిటూ కదులుతూ వాడి ఫాలభాగంమీద పడుతోంది. చంద్రశేఖరం ఒకచేతిలో పేక ముక్కలు పట్టుకుని మరొకచేత్తో జుట్టును పైకి తోసుకుంటున్నాడు. మళ్ళీ చెక్కిట చెయ్యి ఆనించి ఆలోచనామగ్ను డవుతున్నాడు. మా వాసు చిలిపిగా తన ముక్కలను దొంగతనంగా చూడ బోతే ముక్కలను కనపడకుండా దాచుకుని, వాసు వైపు కొరకొరా చూస్తున్నాడు. అవే చూపులు! ఆ వాసు కూడా ఇలాగే చూసేవాడు. నేను మళ్ళీ ముసుగెట్టుకున్నాను. నా ఆలోచనా చక్రం మళ్ళీ తిరగసాగింది. .... వాసూవాళ్ళు మదరాసు వెళ్ళి పోయారు. నా స్మృతిపథంలో వాసు ఒక్కడే నిలిచిపోయాడు. వాళ్ళమ్మను మరవగలిగాను. చంద్ర శేఖరంగార్నయితే అసలు తల్చుకోనైనా లేదు.

మునుపు వాసు సైకిలుమీద వచ్చి క్రిందికి దిగకుండానే, తలుపులను తోసుకొని లోపలికి వెళ్ళేవాడు. అతను సైకిలు బెల్లు మ్రోగిస్తూ ఉంటే నా గుండెలు అమిత వేగంగా కొట్టుకునేవి.

ఇది తెలుసుకున్న నా స్నేహితురాలు శారద ఊరికే వేధించేది. "నీ వాసు బి. ఏ. పాసయి పోయాడా ?" అని.

"నా వాసు ఎవరే ?" అనడిగాను నేను.

"ఓయబ్బో ! ఏమీ ఎరగనట్టు! అతనేనే .... పోనీలే పూర్తిపేరు చెబుతా. మిస్టర్ వాసుదేవరావు. ఇప్పుడు తెలిసిందా ?" అంది చిలిపిగా.

"అతను నా వాసు ఎందుకవుతాడూ ?" నేను లేని ధైర్యం తెచ్చుకుని అడిగాను.

"కాకపోతే నా వాసు అవుతాడా ?" కళ్ళు చిట్లించి కొంటెగా నవ్వింది శారద.

నా మనసు అల్లకల్లోల మయింది. నేను వణికిపోయాను. "అవునా ? ఇది నిజమేనా ? " అనిపించింది. "ఛీ ! నీకు సిగ్గులేదూ ?" అని అడుగుదా మనుకున్నాను కాని మాట నోట్లోనే ఆగిపోయింది.

"ఎందుకలా కంగారుపడతావ్ ? నేను ఉన్న విషయం చెప్పానుకాని లేనిపోనిది కల్పించి చెప్పలేదుగా అంది.

నేను మరేం మాట్లాడలేదు.

*　　*　　*

నాకు పెళ్ళీడొచ్చిందని చదువు మాన్పించే శారు. మా నాన్నగారు.

ఒకరోజు పిడుగులాంటి (నాకు మట్టుకు) వార్త వచ్చింది. వాసుకు పెళ్ళిట ! మే మందరమూ తప్పకుండా రావాలిట !

మా అమ్మ, నాన్న ఇద్దరికీ చాలా కోపం వచ్చింది. 'పిళ్ళెం మనుషులా' అని.

నాకు మాత్రం కోపం రాలేదు. నా మనసంతా శూన్య మయిపోయింది.

"ఇకనైనా ఏమైనా సంబంధా లున్నాయేమో కనుక్కోండి. ఊరికే ఇంట్లోనే కూర్చునిఉంటే పెళ్ళికొడుకులు మన గుమ్మంలోకొచ్చి దిగుతా రనుకున్నారా ?" అంది అమ్మ.

"అదికాదు .... ఆ చంద్రశేఖరంగారు .... " అని నసిగారు నాన్నగారు.

"ఏడికాడులెండి ...... "

"మీ పార్వతమ్మగారు .... ?"

"మా పార్వతమ్మేమిటి ? ఆవి డెవరో—నే నెవరో ! నమ్ముకున్నందుకు బాగా శాస్తి అయిం దిగా. అన్యాయంగా అమ్మాయి చదువు పాడు చేశారు. ఆ వాసుగాడేమో లక్షణంగా పెళ్ళికొడు కయ్యాడు. ఛీ! ఏంమనుష్యులు? ఎంత పొగరుఆవిడకి!"

"అబ్బబ్బ ! ఎందుకే నీకింత కోపం ?"

"అవును నేనేగా అందరికీ చెడ్డదాన్ని. మీరు చాలా మంచివారు. పెళ్ళికి వెళ్ళి కానుకలు సమ ర్పించి రండి, అంత ఆపేక్షగా ఉంటే." అని మా అమ్మ నాన్నగారిమీద మండిపడింది.

ఎవరి మనసూ సరిగ్గాలేక మా ఇంట్లో ఎవరూ భోజనం చేయలేదారోజు.

ఆ మర్నాడే నా ఫోటో ఒకటి తీసుకుని వరా న్వేషణకు బయలుదేరారు మా నాన్నగారు. ఇంట్లో మా అమ్మ పెట్టే బాధలను భరించలేకపోయాను. నన్ను ఊరికే కోప్పడేది. మళ్ళీ అంతలోకే నన్ను తన గుండెల కదుముకుని ఏడిచేది.

"లలితా ! ఎక్కడున్నాడమ్మా నీ మొగుడు ?"

"ఎవరమ్మా ?"

"పాపం బుల్లిపాపవి. ఏమీ ఎరగవుకదూ ?"

"ఏమిటమ్మా నువ్వనేది ?" నాకు మా అమ్మ మాటలు అర్థంకాక తెల్లబోయి అడిగాను.

## వాసుదేవరావు

"ఏమిటా ? నా బొంద! నువ్వు మొగపిల్లవాడిగానైనా పుట్టివుండవలసింది లలితా! అప్పుడు, నేనుకూడా నా తడాఖా చూపించేదాన్ని. మొగపిల్లల్ని కన్నవాళ్ల కెంత గర్వం ? హుం! ఇప్పుడు ఏమనుకుని ఏం లాభంలే" అంది.

"ఎవరికమ్మా గర్వం ?"

"చాలు వూరుకోవే. ఏమీ ఎరగనట్టు వేషాలెయ్యకు !" అని కసురుకునేటప్పటికి నేను ఊరికే ఉండిపోయాను.

ఇహ అప్పటినుంచి నాకు పది పదిహేను రోజులకొకసారి పెళ్లిచూపులకని వచ్చేవాళ్ల ముందు తల వంచుకు కూర్చోవడం, నా పేరు చెప్పడం ఇదే పని. నాకు విసుగెత్తిపోయింది.

"లలితా ! నువ్వు నా కడుపున చెడబుట్టావు. వచ్చినవాళ్లందరూ అలా వెళ్లిపోతున్నారేమిటే ? ఇంతకీ విన్ననాల్సిం దేముందిలే. అంతా నా ఖర్మ!", అని తల బాదుకునేది అమ్మ.

"అమ్మా, నీకు తప్పకుండా పిచ్చెక్కుతుంది" అన్నాను ఒకరోజు. రానురాను ఆమె ధోరణి మారిపోయింది.

"పోనీలే. నాకు పిచ్చెక్కితే ఎక్కనీ. పిచ్చిదాని కూతురనైనా నీకు దబ్బున వరుడు దొరికితే అంతే చాలు" అంది అమ్మ.

మూడేళ్ళు నన్నో బొమ్మకింద జేసి, వచ్చినవాళ్లందరిముందూ ప్రదర్శించారు మావాళ్ళు. చివరి కెలాగయితేనేం ఈయన నన్ను పెళ్ళాడారు.

* * *

"టికెట్ .... టికెట్ ప్లీజ్" టికెట్ కలెక్టర్ వచ్చాడు. నేను లేచి కూర్చున్నాను. చంద్రశేఖరం గాభరాగా లేచి తలుపు దగ్గరికి పరుగెత్తాడు. ఆయన "ఎందు కలా పరుగెత్తుతున్నావ్ చంద్రశేఖరం ?" అని అడుగుతూ ఉండగానే చెకింగ్ ఇన్‌స్పెక్టర్ చంద్రశేఖరాన్ని పట్టుకున్నాడు.

వాడి అవస్థను చూచిన నాకు చెప్పలేనంత జాలేసింది. కాని నేనేం చెయ్యగలను ? నిస్సహాయంగా చూస్తూ కూర్చున్నాను. మా ఆయన నా ముఖంవైపొకసారి చూసి, గబుక్కున లేచారు. టికెట్‌కలెక్టర్ దగ్గరకెళ్లి డబ్బు తను కడతాననీ, ఆ అబ్బాయిని వదిలేయమనీ చెప్పి, పర్సులోంచి డబ్బు తీసిచ్చారు.

నేను చంద్రశేఖరంవైపు జాలిగా చూశాను. వాడు ఏడుస్తున్నాడు.

నా మనసు మా ఆయనపట్ల కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. అలాగే ఆయనవైపొకసారి చూశాను. ఆయన చంద్రశేఖరాన్ని సమాధాన పరుస్తున్నారు.

పిల్లలు ఇదేమీ అర్థంకాక నోరు తెరుచుకుని చూస్తున్నారు.

టికెట్ కలెక్టర్ రసీదు వ్రాస్తూ చంద్రశేఖరాన్ని "నీపే రేమిటబ్బాయ్ ?" అని ప్రశ్నించాడు.

చంద్రశేఖరం ఏడుస్తూనే చెప్పాడు తనపేరు.

టికెట్ కలెక్టర్ వెళ్లిపోయిన తరువాత మా ఆయన చంద్రశేఖరాన్ని అడిగారు. "మీ నాన్నగారి పేరేమిటబ్బాయ్ ?" అని.

వాడు వచ్చే దుఃఖా న్నాపుకుంటూ అన్నాడు "వాసుదేవరావు."



# దీపావళి

(11వ పేజీ తరువాయి)

దివసంగా గణిస్తారు. వ్యాపారస్తులు కూడ, తమ వ్యాపార విక్రమంకోసరమై, ప్రతీ సంవత్సరం ఆనాడే తమ వ్యాపారాన్ని ప్రారంభిస్తారు.

దీపావళి పండుగనాటిరాత్రి ఉత్తరదేశంలో చాల మంది తప్పనిసరిగా జూదమాడుతారు. దీనికి కూడ ఒక చిత్రమయిన కథ ఉన్నది. ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు జూదమాడిరట. పరమేశ్వరు డోడిపోయెనట. అప్పుడాయన కైలాసమును వదలి రుద్రభూములలోనే తిరుగవలసి వచ్చెనట. కుమారుడైన సుబ్రహ్మణ్యమున కిది చాల విచారకారణమైనదట. అంత ఆయన పార్వతీదేవితో జూదమాడి, గెలిచి, పరమేశ్వరునకు కైలాసము ఇప్పించెనట. కాని పార్వతిఇల్లు లేనిదై కడగండ్ల పాలయ్యెనట. ఆమె పాట్లు తనయుడైన వినాయకుడు చూడలేకపోయెనట. అంతట ఆయనగారు పట్టుబట్టి, జూదవిద్యను నేర్చికొని, ఈశ్వరునితో జూదమాడి ఈశ్వరుని వోడించి, తలిదండ్రులిద్దరిని కైలాసమున జేర్చెనట. అంతట పరమేశ్వరుడు సంతోషించి, ఆదినము జూదమాడిన చాల శుభంబగునని పలికెనట. ఆదినము కూడ దీపావళిరోజే.

ఈకథ ననుసరించే కాబోలు, ఉత్తరమున ప్రతివాడు దీపావళినాటిరాత్రి జూదం తప్పక ఆడుతాడు. ఆరాత్రి జూదంలో వోడినవానికి సంవత్సరం పొడుగునా అదృష్టము కలసి వచ్చునని కూడ వారి నమ్మిక. అందుచేత ఆరాత్రి జూదములో వోడిపోయినవానికి కూడ ఆరాత్రి పరమ సంతోషంగానే గడిచిపోతుంది.

మహారాష్ట్రదేశంలో దీపావళి అర్థం వేరుగా ఉంటుంది. దీపావళినాడు పాతాళలోకంనుంచి బలిచక్రవర్తి తన రాజ్యమును చూచిపోదామని భూలోకం వస్తాడుట. అందుకోసం మహారాష్ట్రదేశంలో ప్రతిఇంటిముంగిట బలిచక్రవర్తిని ఆనందపరచుటకై చిత్ర విచిత్రములైన ముగ్గులతో అలంకరిస్తారు. రాత్రిపూట చీకటిలో బలిచక్రవర్తి దోవ తప్పకుండా ఉండటానికి ఇంటింట దీపాలు వెలిగించి ఊరంతా కాంతిమయం చేస్తారు. మహారాష్ట్రుల ఈచర్య గమనించినపుడు, బలిచక్రవర్తికి ఇంద్రత్వంరాలేదని ఎవ్వరూఅనుకోరు. ఈనాడు కూడా బలిచక్రవర్తి రాకకోసం ప్రతీ సంవత్సరం ప్రజలెదురుచూస్తూనేయున్నారు. అతడెంత ఉత్తమ రాజైయుండవచ్చును? బహుశా రామరాజ్యంలోకన్న బలిచక్రవర్తి రాజ్యంలోనే ప్రజలు ఎక్కువ సుఖశాంతులను అనుభవించినారేమో అని అనిపిస్తుంది.

మన దక్షిణదేశంలో, దీపావళిని నరకాసురవధా దివసంగా పరిగణిస్తారు. ఇంటింట టపాకాయలుపేల్చి, కృష్ణ నరకాసుర యుద్ధ నాటకం ప్రతి సంవత్సరం ప్రతివారూ ఆడుతారు. నరకాసురుని కథకూడా చాల చిత్రమయినదే.

నరకాసురుడు భూదేవి పుత్రుడు. "ప్రాగ్జ్యోతిషం" అని అతని కోటపేరు. అది చాల దుర్భేద్యమయినది. ఒకనాడు నరకాసురుడు అదితియొక్క చెవుల కమ్మలను హరించుకొని తనకోటకు వెళ్లినట. దేవతలు అప్పుడు ఈ విషయం కృష్ణునితో చెప్పుకొని మొరపెట్టికొనిరట. అంతట కృష్ణుడు వెళ్లి నరకాసురుని చంపి, అదితికి తన కమ్మలను తెచ్చి ఇచ్చెనట. విష్ణుపురాణంలోను, మహా భారతంలోను నరకాసురునికథ ఇలా ఉంటుంది.

హరివంశంలో మాత్రం ఈ కథ మరొకరీతిగా ఉంటుంది. ప్రాగ్జ్యోతిష నగరమందు ఏలుతున్న రాజు నరకాసురుడు. అతడు దేవతలకు పరమ శత్రువు. అంతేకాదు. ప్రజాకంటకుడు కూడ. ఒకనాడు అతడు ఏనుగురూపం ధరించి, విశ్వకర్మ కూతురిని ఎత్తుకపోయి బలాత్కారము చేసెనట. అంతటితో తృప్తిపడక అనేకమంది గంధర్వ కన్నెలను ఎత్తుకపోయి తనకోటలో బంధించెనట. అటు తర్వాత అనేకమంది మానవ కన్యలనుగూడ ఇతడు హరించెనట. మొత్తముమీద పదహారువేల కన్నెలను ఇతడు హరించి, వారి వస్త్రాభరణాలను తస్కరించి, కోటలో బంధించి, తన జనానాగాచేసికొనెనట. ఈ అసురుడినిమించిన కంటకుడు మరొక్కడు లేడని ఇత డనిపించెనట. చివరకు దేవతలు, మానవులు ఇతని దౌష్ట్యములను భరింపలేక, కృష్ణునితో మొరపెట్టికొనిరట. వెంటనే కృష్ణుడువెళ్ళి యుద్ధముచేసి, నరకాసురుని జంపి,కోటలో బంధించియున్న పదునారువేల స్త్రీలను విడిపించెనట. అంత ఆపదహారువేల స్త్రీలు దిక్కుమాలినవారగుటచే వారందరిని తన గోపికలుగా చేసికొని, తన జనానాలో చేర్చికొనెనట.

ఈ కథ ననుసరించి నరకాసురుడు మరణించినందుకేగాక, కృష్ణునకు పదహారువేల గోపికలు దొరికినందుకు కూడ ప్రజల కత్యంత సంతోషము కలిగిందని, సంతోషం పట్టలేక ఆనాడా టపాకాయలు పేలుస్తున్నారని మనం అనుకోవచ్చును.

ఏది ఎట్లయినా, భేదం అనేది ఎంచక, బీదసాద, పిల్లా, బిక్కా, అందరూ దీపావళినాడు మైమరచి సంతోషంగా గడుపుతారు. నిజంగా దీపావళి మన జాతీయ పండుగులలో ఒకటిగా ఎన్నుకొనదగినమాట మాత్రము వాస్తవము. ★



చిత్రకారుడు: రావాడ కృష్ణ, (ధవళేశ్వరం)

# న్యూఢిల్లీ లేఖ

(9-వ పేజీ తరువాయి)

1947 నుంచీ కాంగ్రెస్‌పార్టీ దేశాన్ని అడ్డులేకుండా పరిపాలిస్తున్నది. పోయిన రెండు ఎన్నికలలోనూ కాంగ్రెస్‌కు చెప్పుకోతగ్గ ప్రతిపక్షమే లేదు. ఈసారి కూడా పరిస్థితి ఇంచుమించు అలాగే ఉంది. ఒకవైపు కుల మత ద్వేషాలను ఖండిస్తూ, ఎన్నికల విషయంలో మాత్రం వాటికి తల ఒగ్గడం ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఢిల్లీలో పొట్టకోసం, కాంగ్రెస్ ప్రభుత్వం రోడ్లమీద ఇళ్లు కడుతూవుంటే చూస్తూ ఊరుకుంది. వేలకువేల మంది వారికి ఇష్టంవచ్చిన ఖాళీ స్థలాలపైన తిష్ట వేస్తున్నారు కాని వారిని తరలించే శక్తి మున్సిపాలిటీకి ఇటువైపు లేదు. ఈ తిష్ట వేసే వారికి వేరే ఏర్పాట్లు చేస్తున్నట్లు ప్రకటనలు జరుగుతున్నాయి. ఇదంతా చేయిస్తున్న పార్టీకి మరొక ఐదు సంవత్సరాల దాకా సరియైన ప్రతిపక్షమే ఉండేట్లు లేదని ఇంతకుముందే చెప్పాను.

కాంగ్రెస్‌కి ఉండే బలంలో సగం కూడా లేదు బ్రిటిష్ లేబర్‌పార్టీకి. కాని, హైడ్‌పార్క్ మధ్య లండన్ చుట్టూ గుడిసెలు ఎవరినైనా వేయనిచ్చారా ?

మురికివాడల నిర్మూలనకు ప్రధానమంత్రి కావలసినంత కృషి చేస్తున్నారు. సరిక్రొత్త మురికి వాడల సృష్టి జరుగుతూనే ఉంది. ప్రతినెలా సుమారు వెయ్యిమంది ఢిల్లీకి వచ్చి స్థిరపడి పోతున్నారు. 'ప్రభుత్వాధీనంలో ఉన్న భూమి' మీద తిష్ట వేశారు. వేరే ఏర్పాట్లు చేసేవరకూ జరగరు. ఇక ప్రజాస్వామ్యానికి ఈ దేశంలో ఏమి భవిష్యత్తు ఉన్నట్లు ? ఎదురులేని పార్టీ ఒకటి రాజధానిలోనే చట్టవిరోధులకు అవకాశాలు కల్పిస్తూ ఉంటే ప్రజాస్వామ్యం ఎలా సాగుతుంది ? ఎటూ శిక్షింపబడేది న్యాయంగా బ్రతికేవారే.

* * *

ఇప్పటికి ముప్ఫైఎనిమిది సంవత్సరాల క్రితం, నేటి 'డ్యూక్ ఆఫ్ విండ్సర్' ఇంకా 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' గానే ఉన్నప్పుడు మన దేశానికి మొట్టమొదటిసారి, (ఆఖరుసారి కూడా) వచ్చారు. వీరి రాకపట్ల నిరసన చూపవలసినదని మహాత్మా గాంధి చెప్పారు. అప్పటి 'ఆంగ్లో ఇండియన్' పత్రికలు ఈ నిరసన ఉద్యమాన్ని ఖండించారు.. 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' కు జరిగిన అవమానం, బ్రిటిష్ దేశానికే వర్తిస్తుందన్నారు.

శ్రీ కృష్ణమీనన్ విషయంలో ప్రధానమంత్రి ఇదేవిధంగా తర్కిస్తున్నారు. ఇటీవల బొంబాయిలో మాట్లాడుతూ, ఆచార్య కృపలానీ, వారిని బలపరిచే 'ట్రోయికా' సిద్ధాంతవాదులూ దేశీతవాలు 'స్వీకరించాలు,' నన్నార శ్రీ నెహ్రూ. ఎన్నిక సభలలో ఇంకా వివరంగా మాట్లాడగల నన్నారు.

భారతదేశంలో ప్రజాస్వామ్యం స్థితి దీనివల్ల కొంత తెలుస్తుంది. తమ మంత్రులలో ప్రతి ఒక్కరి సహాయానికీ ప్రధానమంత్రి సిద్ధ మవుతున్నారా ? లేకపోయినట్లయితే కేశవిహీనమైన శ్రీ కృష్ణమీనన్ తలకే ఈ ఛత్రం పడుతున్నారా ?

ఈ సమస్యను రెండు విధాలుగా పరిశీలించవచ్చు. 'అనగా, అనగా' తమ మిత్రుడైన శ్రీ మావ్‌త్సెటుంగ్ (చైనా) వలె 'వెయ్యి పువ్వులు పూయని' మ్మని శ్రీ నెహ్రూ అంటే కాంగ్రెస్ పార్టీలో శ్రీ కృష్ణమీనన్‌కి ఉన్న పలుకుబడి పరీక్షించినట్లవుతుంది. తక్కిన విషయా లన్నిటికీ తాళంవేసే పార్టీలో ఈ కొద్ది స్వేచ్ఛ పరిణామం ఏమిటో శ్రీ నెహ్రూకి తెలుసు. శ్రీ నెహ్రూ 'వాటర్‌లూ' బొంబాయిలోనే తటస్థమయ్యే అవకాశం లేకపోలేదు. బొంబాయి చౌపాటీ ఇసుకల మీద నుంచి పయనమయ్యే శ్రీ మీనన్ 'ఎలెక్షన్ నావ' సాఫీగా ప్రయాణం చెయ్యబోదని శ్రీ నెహ్రూ తెలుసుకుంటారు, ఎంత ధీమాగా ఉన్నప్పటికీ.

పోటీ జరిగేది కృపలానీ కృష్ణమీనన్‌ల మధ్య. 'సోషలిస్టు' సిద్ధాంతాల మీద నిర్మించిన సమాజంలో అందరికీ సమానమైన అవకాశాలు ఉండాలి. ఈ సిద్ధాంతాలను బోధిస్తూ ఉంటారు. శ్రీ నెహ్రూ. శ్రీ మీనన్ వెనక అతి బలిష్టమైన కాంగ్రెస్‌పార్టీ ఉంది. శ్రీ కృపలానీకి స్వంతంగా పార్టీ ఏదీ లేదు. కాని "కాంగ్రెసేతర" పార్టీలు ఆయన పక్షం ఉన్నాయి. శ్రీ నెహ్రూ తన పలుకుబడి శ్రీ కృష్ణమీనన్ కోసం వినియోగిస్తే వీ రిద్దరికీ సమానమైన అవకాశాలు ఏర్పరచినట్లు అవుతుందా ?

రాజకీయాలలో కానీండి, మత సంబంధమైన విషయాలలో కానీండి, ఏ నాయకుడూ తన అనుచరుల విశ్వాసానికి భరించలేనంత తీవ్రమయిన పరీక్ష ఏర్పరచకూడదు. శ్రీ కృష్ణమీనన్‌కు వ్యతిరేకంగా మాట్లాడేవారిని ఐడిపించి నెహ్రూ భారత దేశంలో ప్రజాస్వామ్యాన్ని హతమార్చాలని ప్రయత్నిస్తున్నారు. భారత ప్రజలకు శ్రీ నెహ్రూ పట్ల అవ్యాజ్యమయిన ప్రేమ ఉన్నది. కాని దీనిని శ్రీ కృష్ణమీనన్‌కు కూడా పంచి ఇవ్వమంటే వీలుపడదు. ఇంత బహిరంగంగా శ్రీ కృష్ణమీనన్‌కి సిఫార్సు చేస్తున్నారంటే, దాని అర్థం, తమంతట తాము శ్రీ కృష్ణమీనన్ సులభంగా నెగ్గలేరని ఒప్పుకోవడమే అవుతుంది. శ్రీ నెహ్రూ గొడుగుక్రింద ఉంచున్నా శ్రీ కృష్ణమీనన్ బొంబాయిలో కొంచెం తడవక తప్పదు. గొడుగు పట్టే వారికైన ఐరద విసరటం జరుగుతుందా అనే భయం మాత్రం మిగులుతోంది.



# గళ్లనుడికట్టు-78

ఆధారాలను బట్టి మాటలు తెలుసుకున్న తర్వాత 'బ్రాకెట్ల'లో సూచించిన గళ్ళను వాటితో నింపితే నరకాసుర వధకు సంబంధించిన పద్యం (భాగవతం లోనిది) వస్తుంది. రెండు 'న్' లు మాత్రం ఎక్కడా ఇమడనందున ముందే ఇచ్చేశాము!

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ■ | 2 | 3 | 4 | 5 | ■ | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 న్ | 28 | 29 | 30 |
| 31 | 32 | 33 | 34 | 35 | 36 | 37 | 38 |
| 39 | 40 | 41 | 42 | 43 | 44 | 45 | 46 |
| 47 | ■ | 48 | 49 | 50 | 51 న్ | ■ | ■ |

అ. పద్మసమానము కాదు, వివాహస్థానము. (19, 47, 24)

ఆ. చిన్న కొమ్మలకి చేరిస్తే సమూహం ! (11, 9, 45)

ఇ. కల్ల తర్వాత మాటల్లో వస్తుంది. చివరి భాగం చిత్రానికి సంబంధించినది. (40, 39, 29)

ఈ. బలే, యుగం మార్చినా అదే ! (46, 49).

ఉ. మనుష్యులు, మధ్య రెండక్షరాల జిడులు ఒకటే కావాలి. (21, 22, 32).

ఊ. వక్కలవాటి మధ్యలో మంగలి. (50, 34),

ఋ. సొగసే ! (20, 31).

ౠ. కొంత చూసే మాట, బంధువుల ఇంటిలో వెతికి చూడండి. (37, 2).

ఎ. అతిశయించకు ! మింగుడు తగ్గించుకోండి చూద్దాం ! (28, 17).

ఏ. గారడి పదములో జంతువు దాచారుట !

(10, 43, 48).

ఐ. దిగులు. కొంచెం మార్పుచెందినా సరే.

(33, 30, 26).

ఒ. మిన్నుములో ఆకాశమా ? (8, 25).

గ. తమక, వరమునకు వెతికి చూడండి. (8, 5, 6)

ఘ. ముక్కి పై మాటవారి, 'శిక్ష'. (18, 15, 23)

చ. స్తుతించు. ముందు ధూమం! (41, 42, 7)

ఛ. నాటకములో వేయును, అర్థం రావాలి.

(4, 38, 36, 16).

జ. వదలు, విడచు. శరీరంలో వాయువు తగిలితే తెలుసుకోవచ్చు. (44, 35).

ట. కన్నుయొక్క, చూచితి ! (1, 12)

ఠ. ఎవరైతేనేమి, చక్రంగాడి తప్పదుకదా !

(14, 13).

దసరాపాటలు నేర్చుకొంటున్న బాలురలో ఒకడు లేచి నిలుచుని "సార్" అన్నాడు.

"ఏమిట్రా అది" అన్నాడు మునలిగురువు.

"పాట కొంచం మార్చాలండీ"

"ఏమిట్రా నీబొంద మార్చేది"

"నేను బడిలో చేరినప్పటి నుంచీ "అయ్యవారికి చాలు ఐదువరహాలు" అనే పాడుతూ వున్నాం." ఇప్పటికే ధరలు పెరిగిపోయాయి. మీరు సెలవిస్తే పదివరహాలని పాడాలనుకొంటున్నాం సార్"

డి. రాజేష్ (ఆదోని)

## 77-వ గళ్లనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శి | 2 లె | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | 3 ప్రా | బ్లు |
| ■ | 4 త | 5 న | ■ | ■ | ■ | ■ | ■ | 6 గ | డి | ■ |
| 7 డి | ■ | 8 వ | 9 నం | ■ | ■ | ■ | 10 ప్రా | టి | ■ | 11 వా |
| 12 త్రా | 13 ప్ర | ■ | 14 ది | 15 వి | ■ | 16 అ | న్న | ■ | 17 ప్ర | డి |
| ■ | 18 త | 19 మ | ■ | 20 నే | కు | వ | ■ | 21 గు | ట్టు | ■ |
| ■ | ■ | 22 కు | రు | చ | ■ | 23 కా | గ | డా | ■ | ■ |
| ■ | 24 వా | టం | ■ | 25 న | గ | శ | ■ | 26 కు | 27 అ | ■ |
| 28 టే | డ | ■ | 29 వా | ము | ■ | 30 ము | 31 ని | ■ | 32 శే | 33 చి |
| పి | ■ | 34 స్వ | గు | ■ | ■ | ■ | 35 పి | 36 స్త్రీ | ■ | కు |
| ■ | 37 ప్రా | ద | ■ | ■ | ■ | ■ | ■ | 38 వ | 39 డ | ■ |
| 40 సి | గ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ట్టు | డ |

## అతనికంటె ఘనుడు

ఒక స్కూల్లో క్లాసు జరుగుతోంది.

ఉపాధ్యాయుడు పొడుం అలవాటున్న మనిషి. పాఠం చెపుతూ "ఆఫ్రికా ఖడ్గ బల్లు" అంటూ చెప్పుకుపోతున్నారు.

ఉచ్ఛారణ బాగులేదని హెడ్మాస్టరుగారిని చెప్పమన్నారు. హెడ్మాస్టరు గారికి వచ్చినంత పనైంది. ఎంచేతనంటే అతని కంటె రెండు వట్లు ఎక్కువగా ఈయన పీలుస్తాడు. ఆయన తడబడుతూ.

"ఆఫ్రికా ఖడ్గ బద్దు" అన్నాడు.

పిల్లలంతా గొల్లు మన్నారు.

యస్. గోపాలరావు (గంగాడ)

* * *

ఇద్దరు స్నేహితులు ఒక పల్లెటూళ్ళో జరుగుతున్న అమ్మవారు జాతర చూడటానికి వెళ్లారు. అందులో ఒకడు జాతరలో జరుగుతున్న వింతలను విశేషాలను చూస్తూ ఇలా అడిగాడు:

ఏమోయ్! ఆ మేక చెవులను అలా కత్తిరించేస్తున్నారే?

రెండోవాడు.-ముమ్మందు దానిమీద నరికినా మే-మే-అని అరవకుండా అలవాటు పడేందుకేమో!

ముంజులూరు వెంకటేశ్వరరావు
(మచిలీపట్నం)

* * *

అల్లుడు:- అత్తగారూ ఎంత శ్రమపడి యీ వంటలు చేశారు? ఎంత బాగున్నవి. ముఖ్యంగా ఈ పులుసు జన్మలో మరవలేను.

అత్త:-అంత రుచిగా వుందా నాయన!

అల్లుడు:- రుచిగా ఏమిటి, నిన్న కొద్దిరోజులు మాయింటికి తీసుకెళ్ళుదామనుకుంటున్నా!

అత్త:-ఇంకా రుచిగా ఉండేది కాని కత్తిపీట లేక.

అల్లుడు:-లేకుంటే ఏమి? ,

అత్త:- నోటితో కొరికి వేశాను పుల్లిపాయ.

డి. పాపయ్యా, యం యం రెడ్డి (ఆదో








Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street,

